శ్రీరస్తు　　　　　　　　　　　　　　　　శుభమస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీః

# శ్రీ ప్రత్యక్ష రామాయణము

## ప్రత్యక్ష-ఆత్మానుభూతి రామాయణము

### ప్రథమ భాగము


రచయిత :- ఉభయభాషా ప్రవీణ.

పండిత ఆకుండి సూర్యనారాయణశాస్త్రి




ప్రథమ ముద్రణము – 1000 ప్రతులు

ప్రజోత్పత్తి (మధుమాసము) నిజవైశాఖమాసము

జూన్ 1991

సర్వస్వామ్యములు - గ్రంథకర్తవి

**మూల్యము - 50-00 రూప్యములు**

సంపాదకుడు - ప్రచురణకర్త

శ్రీ అకుండి గోపాలకృష్ణ, బి.కాం.
అసిస్టెంట్ ల్యాండ్ ఆఫీసర్ (టిస్కో),
16, టమారియా రోడ్,
సాకి, జంషెడ్‌పూర్ (బిహార్)

ప్రకాశకులు :

శ్రీ అకుండి సూర్యనారాయణశాస్త్రి,
శ్రీమతి వజ్ఝల భానుమతి, బి.ఏ.
C/o. శ్రీ వి. రమేశ్, బి.ఇ.
డిప్యూటీ. సి. ఎస్. టి. ఇ. (ఎస్. సి. రైల్వే)
రైల్వే క్వార్టర్ నెం : 601/3,
లాన్సెర్ బారక్స్.
సికిందరాబాద్ - 500 026.




ముద్రాపకులు :
M/s. ఆర్. కె. ప్రింటర్స్,
నాంపల్లి, హైదరాబాద్ - 500 001.

# కృతజ్ఞతాభివందనములు

ఈ గ్రంథము
శ్రీశ్రీశ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయమున ముద్రితము
వారికి
మా హృదయపూర్వకమైన
కృతజ్ఞతాభివందనములను
అందఁజేయుచున్నాఁడను.



This book
is published with the financial
assistance from
SRI TIRUMALA TIRUPATI DEVASTHANAMS
under the scheme - Aid to publish
Religious books

# ధన్యవాదములు

అనపహార్యములగు బహుకార్యవ్యగ్రులయ్యును సుహృద్భావముతో సావధానముగా నేను రచించిన శ్రీ ప్రత్యక్షరామాయణకావ్యమును తాము కొన్ని ఘట్టములను చదివి, నేను చదివి వినిపింపగా కొన్ని ఘట్టములను విని సద్భావముతో నేను కోరిన తోడనే వారి అమూల్యమగు అభిప్రాయము లను అందజేసిన-

అపారసారస్వతాభిజ్ఞులు - విద్వదగ్రగణ్యులునగు

1. విద్వాన్ శ్రీ దివాకర్ల రామమూర్తి, ఎమ్. ఏ,
   రిటైర్డు ప్రిన్సిపాల్, ఎ. వి. ఎన్. కాలేజ్,
   విశాఖపట్టణము

2. బ్రాహ్మీభూషణ-విద్యాప్రవీణ-
   శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి, ఎమ్.ఎ., పి.ఓ.ఎల్.
   రిటైర్డు పండిట్. ఆంధ్ర విశ్వవిద్యాలయము
   విశాఖపట్టణము.

వారలకు కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములను అభివందనములను అందజేయుచున్నాడను.

ఇట్లు
భవదీయుడు

**రచయిత**

**పండిత ఆకుండి సూర్యనారాయణశాస్త్రి**

# అభినందనములు_ఆశీస్సులు

ఈ ప్రత్యక్ష రామాయణ గ్రంథముద్రణమునకు ఉదారభావము - సద్భక్తిభావముతో ఆర్థికసహాయమును అందజేసిన అస్మత్కుటుంబ సభ్యులకు - మిత్రులకు అభినందన పూర్వకముగా ఆశీస్సులను అందజేయు చున్నాడను.

కరుణాసముద్రుఁడు - పరంధాముఁడు శ్రీరామచంద్రప్రభుఁడు వారలకు ఆయురారోగ్య - ఐశ్వర్యాదులను ప్రసాదించుగాత!

ఇట్లు
రచయిత
పండిత ఆకుండి సూర్యనారాయణశాస్త్రి

## ధన్యవాదములు ;

ఈ ప్రత్యక్షరామాయణ గ్రంథమును చక్కగా ముద్రించి - అందముగా బైండ్ చేసి సకాలములో - అందజేసిన శ్రీ ఆర్. కె. ప్రింటర్సు వారికి, ముద్రణాలయ సిబ్బందికి మా ధన్యవాదములను అందజేయుచు అభినందించుచున్నాను.

ఇట్లు
రచయిత
పండిత ఆకుండి సూర్యనారాయణశాస్త్రి

కృతికర్త దంపతులు



శ్రీ ఆకుండి సూర్యనారాయణశాస్త్రి - శ్రీమతి విశాలాక్షి

# (కృతిభర్త)-కృతినాయకుఁడు



శ్రీ రామచంద్రప్రభువు

శా॥ సత్యశ్రీ పరిపాలకా! ప్రభు! భవత్సత్ప్రేరణాశక్తిచే
ప్రత్యక్షంబుగ నిన్నుఁగాంచుచెద ఈ ప్రత్యక్షరామాయణం
బత్యంతామల భక్తిఁ వ్రాసితిని రామా! దీనిఁగైకో గదే!
నిత్యశ్రీకరమై తనర్చుతమహిన్! నీదివ్యచారిత్రమున్.

## అభిప్రాయవేదిక

# ఆమోదము

విద్వాన్ దివాకర్లరామమూర్తి. ఎం. ఏ.
(రిటైర్డు) ప్రిన్సిపాల్
ఏ. వి. ఎన్. కాలేజ్ విశాఖపట్టణము

మిత్రులు శ్రీ అకుంది సూర్యనారాయణ శాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషా ప్రవీణులు. పండితవంశ సముత్పన్నులు. వారి తాత తండ్రులు మహా పండితులేకాదు కవులు కూడ. ఒకరు రామాయణ తత్త్వమును గావ్యముగా రచించిరి. ఒకరు అధ్యాత్మ రామాయణమును యథామూలము పద్యములలో ననువదించిరి. వారందరు రామాయణ సారము ననుభవించి యిత రులననుభవింపఁజేసినవారు. వీరి బంధువులలో వఝ్ఝలవారు - వారును మహాపండితులు కవులు. వంశపారంపర్యమయిన సంస్కృతాంధ్ర విద్యా ప్రావీణ్యము వీరికి సంక్రమించుటలో ఆశ్చర్యములేదు. దానికి తోడు విజయనగర సంస్కృత కళాశాలలో మహాపండితుల యొద్ద సాహిత్యమును గఱచి ఇంటివిద్యకు మెఱుగులు దిద్దుకొనినారు. ఇంకను ఆంధ్ర సంస్కృతో పాధ్యాయులుగా ఉన్నత పాఠశాలలలోను ఆంధ్రభాషోపన్యాసకులుగా వి. దేవ్ కాలేజ్ జయపూర్‌లోను (ఒరిస్సా) డి ఎ వి కాలేజ్ కోరాపుట్‌లోను బహు కాలము సమర్థతతో పనిచేసి పేరు పొందిరి. తమ యఱువదియేండ్ల భాషా వ్యాసంగ గతానుభవ ఆవేశములతో ఇప్పుడు ప్రత్యక్షరామాయణమును రచించి వంశమర్యాదను అవిచ్ఛిన్నము చేసినారు.

వీరు సాహిత్య సమ్రాట్ కళాప్రపూర్ణ ఇత్యాది బిరుదాంచితులగు జయపురాధీశ్వర శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారి ఆస్థానమున గౌరవాస్థానపండితులుగా నుండెడివారు.

ప్రత్యక్షరామాయణ రచనా సంకల్పమొక విచిత్రమైన మనః పరిణామము.

ఎందఱెందఱో ఎన్నెన్నియో విధముల రామాయణమును పద్యమయముగా, గద్యముగా, గద్యపద్యయుతముగా కీర్తనలుగా, ద్విపదగా నాటకములుగా రచించి పేరు పొందిరి. ఆ వాల్మీకి వాగమృతమును రుచిచూచిన ఆవేశపరులెవ్వరు, తమ భక్తి ప్రపత్తి పూర్వకముగా సారస్వతవేదులయిన కవులు బహురమణీయవిన్యాసభరితమయిన రామాయణమును తమ వాక్కులలో వెలయింపక యుండలేరు. నిజమునకు రామాయణ మొక సారస్వత కల్పకము. దానిని హృదయతః ఆస్వాదించుట పూర్వజన్మసుకృతము, ఆ సుకృతఫలము రామాయణ రచనము. శ్రీ శాస్త్రిగారు రామాయణము నెడ నత్యంత భక్తిప్రపణులు.

వాల్మీకిరామాయణము ఒక సారస్వత భావఖని. ఎవ్వరేవిధముగా వారి యనుభూతికి అక్షరకల్పనమొనర్చినను నది మనోజ్ఞమే! ఆ వస్తువు అంతటి సాధు సుందరమయినది. అందెందు తడవినను మాధుర్యము స్రవించును. అయ్యది శబ్దముచే మాధుర్యము, అర్థముచే మాధుర్యము. అది మధురము. అక్షరమధురాక్షరము.

శ్రీ శాస్త్రిగారు ఎందఱో ఎన్నియోరీతుల రామాయణము రచించుట నెఱుంగనివారుకారు. అన్నింటితో పరిచయమును లేనివారును కారు. కాని వారి భక్తిప్రపత్తులు - విలక్షణము. వ్రాసిన రామాయణమునే మరల వ్రాసిరి. వారి భక్తిప్రపత్తులు వారివి కనుక.

శాస్త్రిగారిది ప్రత్యక్షరామాయణము. పద్యకావ్యము సుమారు ఠః కావ్యమున 2000 లకు మించి పద్యములున్నవి ఈ ప్రత్యక్షరామాయణ ప్రత్యేకత ఏమి?

శాస్త్రిగారు రాముని కాలముననుండి రామోదంతమును ప్రత్యక్షముగా ప్రక్కనుండి దర్శించి తన్మయులయినవారు కారు. కాని కాలము దేశము వారి భావనకు మనోన్మనమునకు అడ్డంకులు కాలేదు.

శాస్త్రిగారు మనసా రామునికాలమున వసించిరి. ఆ బాల్యము రామునితో సన్నిహితత్వము వహించిరి రాముని సహవాసమున స్నేహితునిగా, దాసునిగా, గురువుగా, రాజాంతఃపురమున కంచుకిగా, మర్మసఖునిగా ఆత్మ మిత్రునిగా నుండి రాముని యెడబాటు నొక క్షణమైనను భరింపలేని మనస్థితితో నుండిరి. "రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర" అని రాముని సంబోధించిరి. రామునికే రాముని చరిత్రమును విన్నవించిరి. రాముని యావద్వృత్తాంతమును ప్రత్యక్షముగా దిలకించుచు ఆవేశపూరితమున సారస్వతోద్రేకముతో వ్రాసిరి. ఇట్టి ప్రత్యక్షత రామునితో పొంది అనుభూతి నొంది కావ్యమును రచించిన వారరుదు.

ఇకావ్యము రామునితో కవికిగల ప్రత్యక్షతను పాఠకునికి కూడ కల్గించి ఆనందము కల్గించుననుట సత్యము.

రచనావిషయమునుగూర్చి యొండు రెండు మాటలు. కవి పాండిత్య ప్రకర్షకు పోలేదు. కృతకరచనకు దిగలేదు సహృదయ పాఠకులకు సులభముగా ఆస్వాద్యమగుటకు మధురములు, మంజులములు, సలక్షణములగు పదములు పొదిగి సంస్కృతాంధ్ర భాషాస్వారస్యమెఱింగిన వారగుట భక్తి తొణికిసలాడ భంగ్యంతరమున రచించిరి. రచన ధారావంతము. రసానుకూలము. భక్తిప్రపూర్ణము. అందందు కొన్ని నూతన సన్నివేశములున్నవి. అవి మూల రామాయణమునకు విరుద్ధములు కావు.

తాను రామునితో, తాను చూచిన రామాయణమును వివరించి చెప్పుటలో ఒక విశేషమును ప్రదర్శించి, రామాయణసర్వస్వమును పఠితలకు ప్రత్యక్షమొనర్చినారు.

శ్రీ శాస్త్రిగారు ధన్యులు. వారి రచనము పండిత పామర జనామోదము నొందగలదు.

బహుసంతానవంతుడై కుటుంబబాధ్యతలను సమర్థతతో నిర్వహించి కలిగిన స్వపుత్రికలకు తోడు కృతికన్యకల నెందఱినో పోషించి జీవిత పరమార్థమును చూఱకొనిన శ్రీ శాస్త్రిగారు అభినందనయోగ్యులు వారి రామభక్తి అకృత్రిమము. అతిపవిత్రము.

శ్రీమద్రామాయణమును యథామూలము గద్యముగా నేనును వ్రాసితిని. ఆ రచనలోని సాధక బాధకముల పూర్తిగా నెఱుంగుదును.

శ్రీ శాస్త్రిగారి ప్రయత్నమును నేను సర్వవిధముల సుహృద్భావముతో అభినందించుచున్నాను. రామాయణమునకు తొలిపలుకుగాని, అభిప్రాయములుకాని అవసరములేదు.

శ్రీరామస్మరణభాగ్యమును మరల నా కొసంగిన శ్రీ శాస్త్రిగారికి నేనెంతయో కృతజ్ఞుడను.

విద్వాన్ దివాకర్ల రామమూర్తి ఎం.ఏ,

విశాఖపట్టణము

19-6-1989

# అభినందనము

సాహిత్య విద్యాప్రవీణ, బ్రాహ్మీభూషణ
-రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి M. A.L. O. L.
రిటైర్డు పండిట్ ఆంధ్రవిశ్వకళాపరిషత్
విశాఖపట్టణము

పండితశ్రేష్ఠ శ్రీ ఆకుండి సూర్యనారాయణ శాస్త్రిగారు నాకు చిన్ననాటి మిత్రులు.

సుప్రసిద్ధమైన పండిత కుటుంబమున జన్మించిన వారు. వీరి తాత ముత్తాతలందఱును మహాకవులే. అట్టి కుటుంబమున జన్మించిన వీరుకూడ పండితాగ్రణులు కవిపుంగవులు నగుటలో ఆశ్చర్యమేమున్నది.

"ఆకరే పద్మరాగాణాం జన్మ కాచమణేః కుతః" వీరు కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు శ్రీ దూసి రామమూర్తి శాస్త్రిగారు మున్నగు పండితోత్తములకడ విద్యాభ్యాసము గావించి, ఉభయ భాషలందు నిష్ణాతులై జయపుర కళాశాలా (విక్రమ దేవవర్మ కాలేజ్) ఆంధ్రాధ్యాపకులై పేరెన్నికగన్న మనీషి వర్యులు.

వీరు జయపురాధీశ్వర శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారి ఆస్థానమున గౌరవాస్థానపండితులుగా నుండెడివారు.

ప్రాక్తనజన్మపుణ్యకర్మవశంబుననో, తమ పూర్వుల ఆశీర్వాద బలంబుననో వీరికి కవితాధార సహజసిద్ధముగ లభించినది. వీరు విద్వత్కవివతంసులనదగినవారు.

రామునివంటి నాయకుడు, రామకథవంటి యితివృత్తము సంస్కృతాంధ్రాది సారస్వతములందు మఱియొకటి కానరాదు. అందుచేతననే సామాన్య

కవులనుండి ఉత్తమ కవీశ్వరులవఱకు అందఱును ఏదోయొక విధముగ రామగాథను రచించినవారలే.

శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారును ఆ రామాయణగాథనే "ప్రత్యక్ష రామాయణము" అను పేర పద్యకావ్యముగా రచించిరి. వీరా రాముని భగవంతునిగా భావించుచు, ప్రత్యక్షముగా ఆరామచంద్ర చరితమును దర్శించుచు, తన్మయులై ఈ కావ్యమును రచించిరి. వాల్మీక్యధ్యాత్మ రామాయణములకిది పుత్రికవంటిది.

ఇందలి రచనా విశేషములను గూర్చి వ్రాయుట పద్యముల నుదహరించుట అకించిత్కరమని నా యూహ. ధారావాహికయగు కవితలో, మృదు మధుర పదవిన్యాసములో, అనల్పనూతన కల్పనా చమత్కృతితో, ప్రసాద మాధుర్యాది గుణనిర్మితిలో వీరు సిద్ధహస్తులు. వీరి సీసపద్యములు ప్రాచీన కవులను దలపింపజేయును. పండిత పామరుల కందఱికి పరమానందమును గూర్చు నీమహాకావ్యము మిక్కిలి ప్రశంసనీయము.

శ్రీ శాస్త్రిగారు ఇతోధికముగ గ్రంథరాజములను రచించి కవితాకాంతామతల్లికనర్ఘ భూషణరాజి నొసంగి శాశ్వత కీర్తి నార్జింతురుగాక!

ఓం తత్సత్

# తొలిపలుకు

విద్వత్కవిమహోదయులారా!

శ్రీ వాల్మీకిమహర్షి ముఖకమలమునుండి వెలువడిన మధురాతిమధుర మకరందనిష్యందమే శ్రీమద్రామాయణము. ఆ మహోన్నత వాల్మీకి హిమగిరిరాజముఖగహ్వరమునుండి జాలువారిన పవిత్రగంగాప్రవాహమే రామాయణ అమృత స్రవంతి. ఆవేణి గీర్వాణవాణిలో ప్రవహించి భారతావని పునీతము గావించినది.

ఆ సారస్వత మహానదీమతల్లి శాఖోపశాఖలే తక్కిన రామాయణ స్రోతములు.

ఆ తరువాతి కాలమునగూడ ఆ గీర్వాణవాణిలోనే అధ్యాత్మరామాయణము ఆదిగాగల అనంతరామాయణములు అనంతముఖములనుండి వెలువడినవి.

"చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరం" అని శ్రీరామచరితము ఛందఃప్రస్తారమువలె విస్తరించినది.

ఇంక సంస్కృతభాషలోనే ఇతిహాస పురాణములుగానే గాక కావ్యములుగా నాటకములుగా ఆ రామకథ ఎంతగనో విస్తరించినది.

ఆ మధురాతిమధురగీర్వాణభాషామతల్లికి పిల్లలుగా దేశభాషలలో దివ్యరామాయణ గాథలెన్నియో వెలసినవి.

అందు తేనె వానలు కురియు మన తెనుగులోనే ఆ వాల్మీకి రామాయణమునకు - కొన్ని యథామూలానుపాదముగా కొన్ని స్వేచ్ఛానువాదముగా

భాస్కరరామాయణము, రంగనాథరామాయణము ఆదిగాగల రామాయణము లెన్నియో అవతరించినవి. ఎందఱు ఎన్నివిధములుగా వ్రాసినను ఆ రామకథామాధుర్యము తరుగనిది తనివితీరనిది.

ఆ రామకథాసుధాసారము గద్యపద్యాత్మకముగా, ప్రబంధములుగా, నాటకములుగా, శతకములుగా, పాటలుగా బహువిధములుగా ప్రవహించినది. అయినను ఇంక నది పరాకాష్ఠనందుకొనలేదు. ఆ కథయింక ఎన్నిరూపములు దాల్చునో ఎన్ని యుగములు నడచునో!

"ఇన్ని రామాయణములుండగా పునః ఈ రామాయణరచన ఎందులకు" అను ప్రశ్న ముదయించకపోదు. కాని ఎన్ని రామాయణములు చదివినను విన్నను నిత్యము తిన్న అన్నమునందు అరుచిపుట్టినట్లు లోకులకు ఆ రామాయణ కథయందు అరుచిపుట్టదు. అదియే ఆ కథలోనున్న విశేషము. ఆ కథయందు అరుచియన్నది ఈనాటికేగాదు ఏనాటికి పుట్టదు.

శ్లో. యః పిబన్ రామచరితామృతసాగరమ్
ఆతృప్తస్తం మునిం వందే ప్రాచేతసమకల్మషమ్.

ఆ వాల్మీకి మహర్షియే ఎంతగా రామకథామృతపానము చేసినను గానముచేసినను తృప్తినందలేదట అంత తనివితీరనిది రామకథామృతము.

నేనును ఆరామాయణము లెన్నిచదివినను తనివిననక ఆ ప్రభువు ప్రసాదించిన కవితాశక్తితో నాశక్తికొలది రామకథ రచింపదొరకొంటిని.

మా ప్రపితామహులు శ్రీమదాకుండి వేంకటకవి "తత్త్వసంగ్రహ రామాయణము" అను పేర మహాప్రబంధమును రచించిరి. మా పితృవ్యులు పూజ్యగురుపాదులునగు విద్వత్కవి శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు అధ్యాత్మ రామాయణమును తెనుగున అనువదించిరి. ఆ శ్రీరాముడు మాకులదైవము. మాసనాతనదైవము ఆ ప్రభువుపేరు తలచిన నాకు ఒడలు పులకరించును. ఆ ప్రభువు చరితమెంత చదివినను విన్నను తనివి ననక నేనంతటి ప్రముఖ కవిని కాకున్నను ఆ లోకైక ప్రభువు ప్రేరణమున భక్తిపారవశ్యమున పులకరించిన తనువుతో నేనీ రామాయణమును పలికితిని.

కవిలోకమున నన్నొక కవిగా లోకము గుర్తించకపోయినను ఆ రాముని పాదదాసులలో నన్నొక దాసునిగా గుర్తించినచాలును. ధన్యోస్మి అంతకంటె కావలసినదేమున్నది? అదియే నా ఆకాంక్ష.

**ఇందలి విశేషము :**

నా రామాయణరచనలోగల విశేషము ఏమన- ఆ రామునికాలములో నేనొకఁడనై ఏదియో రూపమున ఆతని చరితమును ప్రత్యక్షముగా మనో వీధిలో గాంచుచు ఈతనువులో ఆత్మానుభూతితో ఆ ప్రభువునకు ఆతని మధురకథను ఆతని పాదసన్నిధానముననుండి వినుపించుచున్నట్లు వ్రాసి యున్నాను. దాననే దీనికి "ప్రత్యక్షరామాయణము ప్రత్యక్షాత్మానుభూతి రామాయణము" అని పేరు పెట్టియున్నాను.

తొలుత నేను ఈ రామాయణమునంతను సీసములలో "రమ్యగుణ సాంద్ర! శ్రీ రఘురామచంద్ర! "అను మకుటముతో వ్రాయఁదలచితిని గాని రానురాను "తుదివఱకు సీసములే పోతపోసిన పాఠకులకు విసువు పుట్టునేమో రుచితరుగునేమో" అని భావించి చెవులకు క్రొత్తచవులు చూపనెంచి ఆ ప్రభువు ప్రేరణముననే రసానుగుణములగు వివిధ వృత్తగీత కందాదులతో నా హృదయైకవాసియగు ఆ శ్రీరామప్రభువు పలికించిన తీరుగపలికితిని.

ఒక పుష్కర కాలమునకుముందే ఈ మహాకావ్య రచనకు జయపుర ములో (ఒరిస్సా) శ్రీకారము చుట్టియుంటిని. కాని - అది మొదలుగ కన్న కన్యలకు వరాన్వేషణము వివాహాది శుభకార్య పరంపరల నిర్వ హణము, అధ్యాపకవృత్తి నిర్వహణము, యూనివర్సిటీ కార్యకలాప నిర్వహణ మునను క్షణమైనను విశ్రాంతిలేక ఆదిలోనే కావ్యరచన ఆగిపోయినది.

అట్లయ్యును 1977 లో దక్షిణ భారతయాత్రలు 1984 లో ఉత్తర భారతయాత్రలు చేయునపుడు ఆ యా క్షేత్ర వర్ణనములతో రచన చేయక పోలేదు. తత్తత్ క్షేత్ర వర్ణనాత్మకమయిన చిన్న కావ్యమును వ్రాసి యుంటిని కాని ఈ రామాయణరచన మాత్రము సాగదయ్యెను.

తదుపరి 1986 లో నేను చేయవలసిన కార్య కథలన్నియు భగవంతుని కృపవలన పూర్తిఅయినవి (51) ఏబదియొక్క సంవత్సరములు అవిచ్ఛిన్నముగా అధ్యాపక వృత్తి నెరపి అంతటితో ఉద్యోగమునుండి గూడ విశ్రాంతిని గొంటిని. అపుడు మరల ఆ శ్రీరామచంద్రుని ప్రేరణమున కలము పట్టితిని

డెబ్బది యాఱేండ్ల ప్రాయములో వార్ధకావస్థలో మరల కలము పట్టుటచే దీనిని పూర్తిచేయగలనో లేనో అను భయము ఆవహించినది. అయినను ఆ కరుణా సముద్రుడు శ్రీరామవిభుడు ఇంతవరకు బుద్ధి వైశద్యము, దేహనాశక్తి, ఆరోగ్యభాగ్యము ప్రసాదించుటచే మూడేండ్లలో (1986-1989) రెండువేల పద్యములకు మించిన ఈ మహాకావ్యమును పూర్తి చేయగలిగితిని. ధన్యోస్మి.

జయపురరాజన్యుల రాజధాని అయిన జయపురములో (ఒరిస్సా) 1972 లో కావ్యారంభము చేసి మరల ఉద్యోగమునుండి విశ్రాంతి గొన్న పిమ్మట 1986 నుండి ఏళ్లల ఇండ్లలోనుండి కొన్ని ఘట్టములు వ్రాసి తుదకు చిన్నకుమారుని యింట ఆంధ్రమహాభారతకర్త కవిబ్రహ్మ తిక్కన సోమయాజి కవితావిహారభూమి, మనుమసిద్ధి భూపాలుని రాజధాని అయిన సింహపురి నెల్లూరులో పూర్తిగావించితిని. మూడేండ్లపాటు అవిచ్ఛిన్న కృషితో, దీక్షతో శ్రీరామచంద్రుని కృపావిశేషమున ఈ మహాకావ్యము పూర్తిగావింపగలిగితిని

ఇట్టి శక్తిని ప్రసాదించిన ఆ నా సనాతన ప్రభువు రఘువీరునకు శ్రీరామచంద్రునకు కనులనుండి జాలువారిన ఆనందబాష్పములతో పులకించిన తనువుతో సహస్రాధిక భక్తిపూర్వక సాష్టాంగనతులను మనసా సమర్పించుకొనుచున్నాను.

ఈ రామాయణ మహాకావ్యరచనలో నా సహధర్మచారిణి అర్ధాంగలక్ష్మి శ్రీమతి విశాలాక్షి "కవితా సువాణి" అయి కథాగమనమున పాత్రపోషణమున ఆయాతావులందు ఉచితమగు సూచనలు అందించుచు ఎంతగానో

ప్రోత్సాహమును గావించినది. ముఖ్యముగా అందఱకు అవగాహమగునట్లు సులభశైలిలో వ్రాయవలసినదిగా తరచుగా జ్ఞప్తికి తెచ్చుచు నాకు చేదోడు వాదోడుగా నిలిచినది. ఆమె గావించిన ప్రోత్సాహముతో అందఱకు అవగాహమగునట్లు సులభశైలిలో ఈ మహా కావ్యరచన గావించితిని.

## ఇందులో త్రొక్కిన త్రోవలు

**నాటకఫక్కి :**

నాందీ ప్రస్తావములతో కావ్యారంభము చేసి, పాత్రల సంభాషణమున నాటకీయత చూపి స్వస్తి (భరత) వాక్యముతో పూర్తిచేసి నాటకరీతుల నవలంబించితిని.

**పురాణ పద్ధతి :**

కథాకథనమున సులభశైలిలో పురాణపద్ధతిని అనుసరించితిని.

**ప్రబంధశైలి :**

పుర గిరి దుర్గ వన ఉపవన కానన మున్యాశ్రమాది వర్ణనములందు ప్రబంధశైలి నాశ్రయించియున్నాను.

**శతక పద్ధతి :**

"రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర!" అను మకుటమును అందందు అలంకరించి శతక పద్ధతిని త్రొక్కితిని.

**ఛందో వ్యాకరణ విశేషములు :**

"ర - ల" లకు యతిమైత్రి అప్పకవి కాదన్నను అహోబలపండితాదులు అంగీకరించుటచే వారి మార్గము ననుసరించితిని.

"న-ణ, ర-ఱ, ల-ళ" లకు యతి-ప్రాసములందు మైత్రిని పాటించితిని.

వ్యాకరణాంశములు :

1) శ్రుతిహితముగనున్నచో "అకార-ఇకార" సంధులను గావించితిని

2) పాదాంతమున - పదాంతమున కొన్ని యెడల విసంధిని పాటిం చితిని.

3) ద్రుతమునకు-అచ్చు పరమగుచో కొన్నియెడల 'ం న్న' ద్విత్వ నకారమును ప్రయోగించితిని. సామాన్య పాఠకుల సౌలభ్యమునకై అర సున్న లను "ఁ" విడువవలెనని సరళాదేశ - గ, స, డ, ద, వా దే శ సంధులను మానవలెనని "ఱ"లకు సర్వత్ర సాధురేఫనే వాడవలెనని . అనుకొంటిని గాని అభ్యాసవశమ్మున అనుకొనకుండ పడిపోయినవి. అక్కడక్కడ విర మించితిని. గణభంగము యతి భంగముగాని పట్టుల కొన్నియెడల విసంధిని పాటించియున్నాను.

"బలవదపి శిక్షితానామాత్మన్యప్రత్యయం చేతః" అని మహాకవి కాళిదాసంతవాడే అనియుండగా నే నెంతవాడను. నేనెంత కష్టించి కావ్య రచన గావించినను విద్వద్గణము మెచ్చికోలు నందుకొన్నగాని నా కావలీ రచనను సుసంపన్నమైన దానిగా భావింపజాలను.

శ్లో. గుణదోషౌ బుధో గృహ్ణన్ ఇందుక్ష్వేడావివేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి.

పరమ శివుఁడు చంద్రకళను శిరసావహించి విషమును కంఠమునందే ఆణచియుంచినట్లు విద్వద్వర్యులు- ఇందుగల మంచిని గ్రహించి దొసగులను ... ... . . మన్నింతురుగాక !

"కాలో హ్యనంతః విపులా చ పృథ్వీ" అని భవభూతి వచించినట్లు ఈ కాలమున గాకున్న మరి యేకాలమునందైనను- ఈ నా కావ్యమునకు -

శ్రీరామచంద్రుని కృపావిశేషమున గుర్తింపు రాగలదని విశ్వసించుచు సవినయంబుగ మనవి చేయుచు - ఇంతతో సెలవు దీసికొనుచున్నాను.

విద్వత్కవిజనంబులు ఈ నా కావ్యమును పఠించి మంచిని గుర్తింతురు గాక!

ఇట్లు - రచయిత
విద్వజ్జన విధేయుడు
పండిత ఆకుండి సూర్యనారాయణశాస్త్రి

---

గమనిక:- అందందు అఖండయతిని ప్రయోగించితిని.

1) ఇందు నాలుగు పాదములకు మించియున్న పద్యములను మాలికలుగా గుర్తించవలెను.

2) "రావడి" (ప్రాపడి) కి ముందున్న అక్షరము ఇందు కొన్ని యెడల లఘువుగా వ్యవహరింపబడెను.

·) తుదినిగల "తప్పొప్పుల" పట్టికను చూచి తప్పులను సవరించుకొందురు గాక!

—o—

# రచయిత సంగ్రహ జీవిత చరిత్ర

| | |
|---|---|
| నామము | : ఆకుండి సూర్యనారాయణశాస్త్రి |
| జననము | : తేది. 8-6-1911<br>శ్రీ విరోధికృన్నామ సంవత్సర<br>జ్యేష్ఠశుద్ధ ద్వాదశీ గురువారము |
| జన్మ స్థలము | : ఇంగిలాపల్లి అగ్రహారము<br>మాతామహుని గృహము |
| స్వగ్రామము | : కిండాము అగ్రహారము<br>(విజయనగరము జిల్లా) |
| పూజ్య-మాతృశ్రీ | : దివంగత - లక్ష్మిగున్నమాంబ |
| పూజ్య - పితృపాదులు | : దివంగత - గోపాలశాస్త్రి<br>ఉద్దండ పండితులు |
| ప్రాథమిక విద్యాభ్యాసము | : స్వగ్రామము - కిండాము అగ్రహారమున |
| ఉన్నత- కళాశాలా విద్యాభ్యాసము | : విద్యానిలయమైన-విజయనగరములో<br>శ్రీ మహారాజావారి సంస్కృత కళాశాలలో<br>ఉద్దండ పండితుల యొద్ద<br>1924 నుండి 1933 వరకు |
| "డిగ్రీ" - ఉపాధి | : ఉభయభాషా ప్రవీణ (1933 మార్చి) |
| వృత్తి | : అధ్యాపకత్వము<br>1933 నుండి 1984 వరకు |

ఇంచుమించు 51 సంవత్సరములు
జయపురము - గుణుపురము సునాబేద
కోరాపుట్ జిల్లా (ఒరిస్సా) ఉన్నత పాఠశా
లలో ప్రధాన - సంస్కృత - ఆంధ్రోపా
ధ్యాయుడుగా ఉద్యోగ నిర్వహణము
1951 నుండి 1972 వరకు
వి. దేవ్ కాలేజ్ - జయపురము
కోరాపుట్ జిల్లా (ఒరిస్సా)
డి. ఎ. వి. కాలేజ్ - కోరాపుట్
కోరాపుట్ జిల్లా (ఒరిస్సా)
ఆంధ్రోపన్యాసకుడుగా
(తెలుగు లెక్చరర్‌గా) ఉద్యోగించుట.

1935 నుండి 1951 వరకు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజావారి ఆస్థానమున : గౌర వాస్థాన పండితుడుగా నుండి శ్రీవారి సన్మానము లందుకొనుట.

ఇతర వ్యాసంగములు : కవితా వ్యాసంగము
జ్యోతిశ్శాస్త్రము
ఉపన్యాసము లిచ్చుట
శ్రీ గీతాప్రవచనోపన్యాసములు

నిర్వహించిన పదవులు : 1960 నుండి 1966 వరకు
సెకండరీ బోర్డు (ఒరిస్సాలో)
తెలుగు చీఫ్ ఎగ్జామినర్‌గా

1) ఉత్కళ యూనివర్సిటీ వాణీవిహార్ — 1965 నుండి 1988 వరకు

2) బెరహంపూర్ యూనివర్సిటీ
భంజవిహార్

ఈ మూడు యూనివర్శిటీలలో
ఆంధ్ర శాఖలో

3) సంబల్‌పూర్ యూనివర్సిటీ
జ్యోతీ విహార్
(ఒరిస్సా)

1) ఎగ్జామినర్స్ బోర్డు
2) పేపర్ సెట్టర్స్ బోర్డు
3) కండక్టింగ్ బోర్డు
4) బోర్డు ఆఫ్ స్టడీస్ వీనిలో మెంబర్‌గా చైర్మన్‌గా అనేక పదవులు నిర్వహించుట

నడిపించిన సంస్థలు : జయపురములో (ఒరిస్సా)

1) ఆంధ్రభాషాభివర్ధనీ గ్రంథాలయ నిర్వహణము
1938 నుండి 1944 వరకు

2) సునాబేదలో (ఒరిస్సా)
శ్రీ గీతా ప్రచార సంఘ స్థాపన నిర్వహణము
1974 నుండి 1989 వరకు

—o—

# 17

## రామాయణ ప్రశస్తి

శ్లో॥ వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।

వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా ॥

"వేదవేద్యుడైన పరమ పురుషుడు శ్రీరాముడై అవతరింపగా వేదములే ప్రాచేతసుముఖమునుండి రామాయణముగా వెలసినవి" అని రామాయణము ప్రశస్తిగాంచినది. వేదసారమే రామాయణము - వేదప్రతిపాదితమైన ధర్మము లన్నియు రామాయణ కథావస్తువులో నిగూఢముగా అంతర్లీనములై యున్నవి.

పరమ పవిత్రము - ఇహపర సాధనము - చతుర్విధ పురుషార్థ సాధనము రామాయణము. అట్టి ఉత్తమ గ్రంథము సారస్వతమున మరియొకటి లేదనుట సత్యము. సారస్వతాకాశమున శ్రీమద్ రామాయణము సహస్రరశ్మి ఖానమాన సూర్యుని వంటిది. తక్కిన గ్రంథకోటియెల్ల తారాగణము వంటిది దానినే దాని నాధారముగా జేకొనిని అనంతకోటి రామాయణము లనంతముఖముల వెలసినవి. అదియొకమహారత్నాకరము. ఎన్ని రత్నము లెందఱెత్తి తీసినను ఇంక నా రత్నఖని తరుగలేదు. ఇంకనందెన్నో అమూల్య రత్నములుండనే యున్నవి.

అటులనే రామాయణమెక అమృతస్రవంతి ఎందఱెంత త్రావినను తరుగనిది తనివితీరనిది.

నీతులకు, ధర్మములకు, ఆదర్శములకు, సామాజిక వ్యవస్థకు, నాటికి నేటికి అదియొక ప్రతీకగా నిలిచినది. ఆ రామాయణము ఇంత విశిష్ట స్థానము ఆక్రమించుకొనుటకు కారణములేకపోలేదు

ఈ కథాంశమున నాయికానాయకులు అలౌకిక వ్యక్తులు. సీతారాములు ప్రకృతి పురుషులు, సృష్టి స్థితి–లయకర్తలు, అనంతకల్యాణ గుణగరిష్ఠులు దుష్టశిక్షణ–శిష్టరక్షణ–ధర్మస్థాపనము చేయుటకై అవతరించిన ఆదినారాయణుడే శ్రీరాముడు.

తాను నారాయణుడయ్యును (నరుడై) మానవుడై అవతరించుటచే సంపూర్ణ మానవత్వమును ప్రదర్శించి ఆదర్శ మహాపురుషుడైనాడు.

ఆమాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, ఆ భ్రాతృవాత్సల్యము, ఆ ఏకపత్నీ వ్రతత్వము, ఆసత్యదీక్ష, ఆ శరణాగతరక్షణము, ఆ స్థైర్యము-ధైర్యము-వీర్యము- ఆ గాంభీర్యము అనన్యసామాన్యమైనవి ఆ రూపగుణశీలములు అనుపమానములు, అలౌకికములు, అపురూపములు. "ఒకే మాట ఒకే సతి ఒకే బాణము" అని లోకమున గణుతికెక్కినవాఁడు శ్రీరాముడు,

"పుంసాం మోహనరూపాయ" అని రూపమున "రామో ద్విర్నాభాషతే" అని సత్యవాక్పాలనమున "అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ." అని శరణాగతరక్షణమున ఖ్యాతిగాంచిన మహాపురుషుఁడు లోకమునకు ఆదర్శమానవుడు శ్రీరాముడు ఒకఁడనంతకల్యాణగుణగరిష్ఠుఁడు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అని మనోవాక్కులకందని అలౌకిక గుణసంపన్నుఁడని వేదములే నిర్ద్వంద్వముగ వాకొనియున్నవి. అట్టి పరాత్పరుడైన శ్రీరాముడు నాయకుడుగాగలది ఆ రామాయణము. ఇంక కథా నాయిక అన్న - త్రిలోకసుందరి, లోకైకమాత, సాధ్వీమతల్లి, అయోనిజ, పకృతిభూత అయిన సీత-కథానాయిక.

అట్టి ప్రకృతి పురుషులే కథానాయికానాయకులగుటచే రామాయణ మంతటి ప్రశస్తి గాంచినది.

మరియు

రామాయణమొక అపూర్వ కల్పవృక్షము. కల్పతరువెట్లు కోరిన కోర్కెలను ఫలింపజేయునో అట్లే రామాయణ కల్పభూజము ఎవరు ఏ ఫలములను అపేక్షించి పఠింతురో వారి వారి ఆ కోర్కెలను ఫలింపఁజేయును. అంతియేగాక అంతమున మోక్షమును గూడ ప్రసాదించును. అట్టి విశిష్ట మహామానిత్వము రామాయణము. రామాయణప్రశంసిని అభివర్ణించుటకు ఆదిశేషుడును అసమర్థుడన నేనెంత?

ఇట్లు
విబుధ విధేయుడు
—పండిత ఆకుండి సూర్యనారాయణశాస్త్రి

# అనుక్రమణిక

## బాలకాండము–విషయసూచిక

## అయోధ్యాకాండము-విషయసూచిక





## అరణ్యకాండము - విషయసూచిక

# కిష్కింధాకాండము - విషయసూచిక

శ్రీః

# శ్రీ ప్రత్యక్షరామాయణము

## ప్రత్యక్షాత్మానుభూతి రామాయణము

## బాలకాండము

---

### ధ్యానముద్ర

శ్లో. శ్రీనారదాదిమునిబృందసుపూజ్యమానౌ
శ్రీశంఖచక్రకులిశాంకుశపద్మచిహ్నౌ,
శ్రీజానకీవిమలహస్తసుసేవ్యమానౌ
శ్రీ రామచంద్ర చరణౌ శరణం ప్రపద్యే. 1

### నాంది

శ్లో. శ్రీరామచంద్ర నయన భ్రమరౌ భ్రమంతౌ
సీతా విలోలనయన భ్రమరీముఖాబ్జే,
సంపాత్య మోహవివశౌ న పునర్నివృత్తౌ
తౌ రక్షతాం దివమనూన రసానుభావౌ. 2

## ప్రస్తావన

చ. అఱువది యేండ్ల చక్రము రయంబున నేగెను జూచుచుండగా
అరుదగు నీదుభక్తి నికనైనను సంసృతి బంధముక్తియున్
పరమును గోరి నీ చరణ పద్మములన్ భజియించువాఁడ నీ
స్థిరమగు భక్తి నాకు దయచేసి సదామది నుండు రాఘవా! ౩

ఉ. తాతలు దండ్రులందఱు సదా భవదీయపదాంబుజద్వయిన్
పూత మనంబులన్ నిలిపి పొల్పుగ వ్రాసిరి త్వత్ ప్రబంధముల్
పూత చరిత్ర! నాదగు పూర్వభవార్జిత పుణ్యమేమొ! నే
నాతత భక్తి నీ మృదుపదాబ్జములన్ భజియింతు రాఘవా! 4

ఉ. శ్రీరఘురామచంద్ర! సరసీజదళాయతనేత్ర! త్వత్కథా
సారము వ్రాయఁబూనితిని సాధ్యమె నాకది మందబుద్ధికిన్
పారములేని సంద్రముడుపంబునఁ దాటగఁ బూనునట్టు లా
దూరపుఁ గొమ్మపండులను ద్రుంచగ వామనుఁడెంచునట్లుగాన్. ౕ

చ. సలలిత సాహితీ ప్రతిభ చాలదు శాస్త్రములన్న–యన్నియున్
దెలిసినవాఁడ గానిఁక సుధీవరులెల్లరు మెచ్చునట్టి– ఆ
లలితకవిత్వశక్తియు పఁశక్కి–ఇఁకెట్టులు త్వచ్చరిత్ర నీ
స్తుతిగుణ! చెప్పువాఁడ కవిసూరిజనంబులు మెచ్చ రాఘవా! 6

ఉ. తారక లెన్నవచ్చు నికతాపరమాణువు లెన్నవచ్చు– ఆ
వారిధి వీచికా ప్రకరవర్ధిత శీకర బిందుసంతతిన్
తీరిచి వేరవేర గణుతింపఁగవచ్చును–కాని తావకో
దారగుణంబులెన్నగ విధాతకునైనను శక్యమే ప్రభూ! 7

ఉ. శ్రీజనకాత్మజా విమల చిత్తసరోజ మరందపాన భృం
గా ! జలజాక్ష ! త్వద్వినుత క్రమచరిత్ర వచింప శక్యమే !
నా జననాంతరాంతర సనాతనదైవమ! నాదుమానసాం
భోజ మిళిందపుంగవ ! ప్రభూ! వచియింపుము నీవె నీకథల్. 8

ఉ. చెప్పెడు వాఁడ వీ వెటులు చెప్పిన అట్టులు వ్రాయువాఁడనే
తప్పులొ యొప్పులున్న—అవి తావకముల్ సుమి ఇందులోన నా
గొప్పతనంబు చెప్పికొనఁ-గొంచెము లే దిది కల్లకాదునేఁ
జెప్పితి నున్నమాట ఇఁక-చెప్పుము రాఘవ! నీవె నీ కథల్. 9

ఉ. ఒప్పగు నీ సుధామధుర సూక్తులఁ బోలునె నాదు కబ్బముల్
చప్పగనుండు పండితులు సత్కవులెల్లరు మెచ్చబోరహో!
చుప్పన ఇంచుకంత చవిచూచిన ఏర్పడు తారతమ్యముల్
చెప్పుము నీవ సద్రసము చిప్పిలుచుండఁగ రామ త్వత్కథల్. 10

ఉ. ఓ రఘురామ ! త్వత్పదపయోజము లుత్పలచంపకంబులన్
తీరుగ పూజచేసి వినుతింతు త్వదీయమహాకథాసుధా
సారము రక్తిమీర ఘనసారపటీర జవాదిసార క
స్తూరి సుగంధబంధుర వచోవిధంబున విస్తరింపుమా ! 11

—o—

## కృతి సమర్పణము

ఉ. ఆయతబాహుదండ! విపులాయతవక్ష! మహేంద్రనీలర
త్నాయితకోమలాంగ! రతినాయకసుందర ! ఫుల్లపద్మప
త్రాయతనేత్ర! స్మేరరుచిరానన! పావననామ! జానకీ
నాయక! పద్మగర్భసురనాయకపూజితపాద! కర్ణరా
సాయనమైన త్వత్కథను సౌరకులాంబుధిపూర్ణచంద్ర! ఆ
త్రేయసగోత్రజాతసుచరిత్రుఁడ త్వత్పదభక్త సూర్యనా
రాయణశాస్త్రి నామకుఁడ వ్రాసితి త్వత్కృప భక్తిమీర, ఆ
మ్నాయనుతాంఘ్రిపద్మ! రఘునాయక! మద్హృదయాధినాయకా!
పాయనిభక్తి నీకిదె ఉపాయనమిచ్చెద రక్తి నాదు రా
మాయణకావ్యకన్యను రమాప్రియవల్లభ! స్వీకరింపుమా! 12

ఉ. పావనరూప! రామ! భవబంధవిమోచననామ! భక్తసం
భావితకామపూరణ! ప్రభాకరవంశవివర్ధనా! సదా
భావితభక్తబృందసమభావన! నాదగు ఈ ప్రబంధమున్
కేవలభక్తినిత్తు పరికింపుమ నాహృదయైకవాసివై. 13

ఉ. భూములు నిండ్లు కోరనిక భోగము లేవియు నిచ్చగింప, ఆ
రామములంతకున్ వలదు, రామ! త్వదీయపదాబ్జసేవ,
నీ నామజపమ్మజస్రము, ఘనాఘనసుందరరూపమున్, పరం
ధామ! త్వదీయ కోమలపదమ్ముల సన్నిధి, గోరెదన్ సదా. 14

ఉ. పట్టితి నీ పదాబ్జములు - పద్మభవాభవ నిత్యసేవ్యముల్
పెట్టితి నీదు నామమును పిల్లలకున్ మధురాక్షరమ్ము, చే
పట్టితి త్వచ్చరిత్రము ప్రబంధముగా రచియింపభక్తిమై
పట్టివి కాపు నా నుడులు వారిజలోచన? నీ వెఱుంగవే! 15

ఉ. మా కులదైవతంబవని మా యిలువేలుపు నీవటంచు నే
నోకరుణాసముద్ర! పురుషోత్తమ! సన్నుత సూర్యవంశ నీ
రాకర! పూర్ణచంద్రమ! పరాత్పర! నిన్నె భజింతు నిత్యమున్
ఓ కమలాయతాక్ష! గనుమో ప్రభు! నీ పదదాసునిన్ దయన్. 16

శా. సత్యశ్రీ పరిపాలకా! ప్రభు! భవత్సత్ప్రేరణా శక్తిచే
ప్రత్యక్షంబుగ నిన్నుఁగాంచు చెద ఈ ప్రత్యక్షరామాయణం
బత్యంతామల భక్తి వ్రాసితిని రామా! దీని గైకోగదే!
నిత్యశ్రీకరమై తనర్చుత మహిన్ నీ దివ్యచారిత్రమున్. 17

ఉ. శ్రీసురసిద్ధఖేచర విశిష్టమునీంద్రుఁడ నౌచు నొక్కచో
బాసిగ నౌచు నొక్కయెడ దాసుఁడ నౌచును నొండుచోట, నే
భూసురపుంగవుండనయి బోయెత నౌచును పక్షివాఁడనై
వాసిగ వృక్షపక్షిమృగ వానరరూపుడ నౌచు నొండుచో
దాసజనప్రియుండవు గదా యని నిర్మల దాస్యభక్తి న
భ్యాసవశమ్మునన్ సతము ధ్యానముచేయుచు నిన్నె నెమ్మదిన్
వ్రాసితి నీ చరిత్ర రఘువంశ-విభూషణ! రామచంద్ర! నా
దోసములున్న వాని దయతో క్షమియించి గ్రహింపుమీకృతిన్. 18

చ. ఉరుకరుణాబ్ధి! ఓ రఘుకులోత్తమ! కామసహస్రకోటిసుం
దర! సురరాజనీలతను! దైత్యకులాంతక! రాఘవేంద్ర! అ
క్షరపరమాత్మ! భక్తజనకల్ప! యనల్పమదీయ మౌక్తికా
క్షరగుణరత్నభూషిత-సుకావ్యసుకన్యగ్రహింపవే ప్రభూ! 19

చ. ప్రవిమలరూపశీల గుణభవ్యల-నా నవకన్యలన్ విభూ!
ప్రవిమలరూపశీలగుణభవ్యులకుత్తమవంశవార్ధి సం
భవులకుదారధీరగుణవంతుల కిచ్చితి త్వత్కృపన్నికన్

ప్రవిమలభక్తిభావ వరవర్ణనిరమ్య సువర్ణభూషితన్
కవికులజాత! పూత నవకావ్య సముజ్జ్వలకన్యకామణిన్
రవికులరామ! గైకొను పరాత్పర! జన్మతరింపఁ బోయెడిన్. 20

చ. ఘనముగ కట్నకానుకలు కాంచనవస్త్రములంగదమ్ములున్
మణిగణకీలితప్రచురమంజులభూషణజాల మీయ నే
జనకుడ గాను రామ! దివిషద్గణపూజితపాదపద్మ! ని
ర్ధనుడను త్వత్పదాబ్జములదాసుఁడ భూరికుటుంబినోయి! ఓ
యనఘచరిత్ర! నెమ్మది అనన్యమతిన్ వరియించె నిన్నె దా
మననిజరూప! ఈ మధురమంజులభాషిణి సౌకుమార్య స
ద్గుణమణిభూషితాంగి నిదె కొమ్ము! మదీయసుకావ్యకన్యకన్
జననుత! జానకీశ! మనసా వచసా శిరసా భజించెదన్. 21

గీ. ఏకపత్నీవ్రతుండను-ఎట్టు జేను
స్వీకరింతునటంచు-భావింపవలదు
కావ్యకన్యక-కామిని గాదు రామ!
కాన గైకొమ్ము! వ్రతము భంగమ్ము గాదు. 22

క. సదమలచరితా! రాఘవ!
పదియవ అల్లుండవైతి భాగ్యము పండెన్
కొదవేమి మాకు, సుఖ సం
పదలును అంత్యమున ముక్తిపదమున్ గల్గున్. 23

—౦—

## శ్రీ గణపతి స్తుతి

సీ. ఎవ్వాని చేతిలో నెనఁగు గఁటపుముల్లు
వ్యాసు వాగ్ధోరణి వ్రాసిపుచ్చె
ఎవ్వాని కడకంటి యించు కెఱ్ఱని జీర
చవితి జాబిలికి దోషంబు తెచ్చె
ఎవ్వాని పూజ వాగీశాదిసురకోటి
సర్వార్థసిద్ధికి సాయ మిచ్చె
ఎవ్వాని క్రేఁగంటి యెలిమి చల్లని చూపు
వేదవేదాంగాది విద్య లిచ్చు
అట్టివేలుపు వ్రేలుడు పొట్టవాని
గట్టుదొరపట్టి కూరిమి కడుపుపంట
గుజ్జువేలుపు వాక్సిద్ధి గోరి గొలుతు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 24

—o—

## శ్రీవాణీ స్తుతి

సీ. నవరత్నఖచిత వీణాదండతుంబిక
స్తనయుగ్మపీనవక్షమున మెలఁగ
కంకణకింకిణీకలనాదమేదుర
స్వరవర్ణగీత నిస్వనము లెసఁగ
మధురమంజులగాన మాధుర్యమునఁ జొక్క
దరమీలితాక్షిపద్మమ్ము లలర
ముఖపద్మవాసనోన్ముఖ శిలీముఖపాళి
మంజుగుంజారతి మారుమ్రోఁగ
గానమునఁ దేలు దివ్యశృంగారమూర్తి
నీరజాసనురాణి సునీలవేణి
వాణిఁ గొలిచెద ప్రౌఢసద్వాణిఁ గోరి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 25

—o—

## భక్త్యంజలి

సీ. శ్రీరామపాదసంసేవామృతాత్ముండు
  రుద్రాంశధారి మరుత్సుతుండు
వానరాధీశసమ్మానితసచివుండు
  బ్రహ్మజ్ఞుఁ డాజన్మబ్రహ్మచారి
అంభోధిలంఘనోజ్జృంభితవేగుండు
  మైనాకశైల సంభావితుండు
లాంగూలవహ్నికీలాదగ్ధలంకుండు
  రావణగర్వనిర్వాపణుండు
రామదాసుండు సర్వదా రామనామ
గానలోలుండు జానకీప్రాణదాత
అయిన హనుమంతు సద్భక్తి నంజలింతు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 25

## గీర్వాణకవి ప్రశంస

సీ. కమ్రరామాయణ కల్పశాఖాకవి
  కోకిలప్రథిత వాల్మీకిసుకవి
భారతసంహితాఖ్యాసు - అష్టాదశ
  పౌరాణకల్పనాప్రౌఢు వ్యాసు
రూపకనిర్మాణరూఢ సత్కవితాఢ్య
  భవ్యకీర్తిప్రభాభాసు భాసు
కావ్యనాటకకళాకల్పనాచాతుర్య
  కవికులాలంకారు కాళిదాసు

బాణ భవభూతి మాఘు సుబంధు హర్ష
చోర భారవి భోజ మురారి ముఖ్య
సరససంస్కృత కవికోటి సంస్మరింతు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 26

## ఆంధ్రకవి ప్రశంస

సీ. భారతాంధ్రీకృతిప్రథిత మూర్తిత్రయ
నన్నయతిక్కనెఱ్ఱన్నకవుల
రామాయణగ్రంథరచన విశ్రుతిగన్న
భాస్కరామాత్యాది ప్రౌఢకవుల
భాగవతమ్ము సద్భక్తి భావావేశ
మున సంతరించు పోతనకవీంద్రు
ప్రౌఢవాక్కవిసార్వభౌము నైషధకావ్య
కర్త శ్రీనాథశృంగారకవిని
ఆంధ్రకవితాపితామహు అల్లసాని
పెద్దనామాత్యకవి పినవీరభద్రు
తిమ్మనామాత్యు భట్టు నుతింతువాఁడ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 27

## రామాయణ ప్రశస్తి

సీ. ఎన్ని కవికోకిలా లెన్ని కంఠము లెత్తి
పాడెనో దివ్యప్రబంధసరణి
ఎన్ని వీణాతంత్రు లెన్ని వేలేండ్లుగా
కీర్తించెనో దివ్యగేయఫణితి

ఎన్ని భూర్జత్వక్కు లెన్ని పైప్పలపత్ర
సంతతుల్ సతతంబు చదువుకొనెను
ఎన్ని శ్రీతాళమ్ము లెన్ని తాళమ్ములు
వ్రాసెనో తాము గీర్వాణవాణి
అట్టి తావక భవ్యదివ్యప్రబంధ
కోటి మించెను శతకోటి కోటిదాటి
ఎంత చదివిన తనియ నే నెంత వినిన
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 28

# కథారంభము

క. శ్రీరమణీమణి హృత్సర
సీరుహమధులుబ్ధ భృంగ ! శ్రితమునిసంగా !
కారుణికోత్తమ ! రామా !
శ్రీరఘువంశాబ్ధిసోమ ! సీతారామా ! 29

క. వినిపించెద నీ కథ నిక
వినుమోయీ ! చవులు చెవుల విందులు గొలుపన్
గనుమోయీ ! దయతో మము
మనుమోయి ! కోటిమదనమంజులమూర్తీ ! 30

## శ్రీ వైకుంఠము

సీ. క్షీరవారాశివీచీశీకరాసార
శీతమందానిల సేవితంబు
భానుచంద్రాగ్ని సంభాసితంబును గాని
దివ్యప్రకాశ సందీపితంబు

సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య
ముఖ్యచతుర్విధ ముక్తిదంబు
సనకాది వారిజాసనతనూభవ గమ్య
మపునరావృత్తి సమంచితంబు
ముక్తికన్యాస్వయంవరాసక్త సకల
భక్తజన సేవితైకైక భుక్తిసీమ
అయిన వైకుంఠ మేలు రాజాధిరాజ!
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 31

## శ్రీ శేషశాయి

సీ. శ్రీభోగిభోగశయ్యాభోగ యోగ ని
ద్రాసక్త భద్రనేత్రద్వయుండు
కౌమోదకీ శార్ఙ్గ ఖడ్గచక్రాదిక
దుర్వారశస్త్రచతుర్భుజుండు
కోటిసూర్యప్రభాకుంఠకాంతిచ్ఛటా
రాజిత తేజోవిరాజితుండు
శ్రీకామినీమణీ శృంగారవక్షోజ
వీక్షా సమాసక్తవీక్షణుండు
అద్వితీయుం డనంతుం డనాదిమధ్య
లయుఁ డమేయుండు నాదినారాయణుండు
నీవె కావా? కా లక్ష్మీశ! నిగమవినుత
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 32

## శ్రీపతి హజారము

సీ. ప్రణవాదినిగమమంత్రములు రూపము దాల్చి
నీ దివ్యచరిత వర్ణించుచుండ
అనమాన చక్రశార్ఙ్గాది శస్త్రాస్త్రముల్
మూర్తిమన్నైజ విస్ఫూర్తి మెరయ
ధర్మపక్షోద్ధూత బ్రహ్మాండనిచయుండు
వైనతేయుఁడు గురుభక్తిఁ గొలువ
విశ్వరక్షాదక్షవేత్రహస్తుండు వి
ష్వక్సేనుఁ డెలమి పార్శ్వమున నిలువ
మహితవైకుంఠ దివ్యధామంబునందు
గొలువు దీరిచియున్న నిన్గొలువ రారె
పద్మసంభవశర్వ దిక్పాలవరులు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! ౧౩

## రావణుని తపస్సు

సీ. పౌలస్త్యుఁ డకలంకభక్తితోడుత దివ్య
వర్షముల్ ఘోరతపంబు సేయ
తత్తపోవహ్నివిస్తారకీలావళుల్
ఆక్రమింపఁగ భూనభోంతరముల
అఖిల గీర్వాణు లాహాకారముల్ సేయ
లోకంబులల్లకల్లోలమయ్యె
ఇంద్రాదిదిక్పాలురెల్ల సంక్షోభించి
వారింప వేడ రావణుని తపము

అజుఁడు ప్రత్యక్షమై వరమడుగు మనిన
వరద ! దయచేసి నరులు వానరులు దక్క
సకలసురకోటి యక్షరాక్షసపిశాచ
గరుడగంధర్వసిద్ధకిన్నరులవలన
చావులేనట్టి వరము నా కీవె యనఁడె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 34

## వరదానము

గీ. "తత్తథా స్తు"ని వరమిచ్చి ధాత చనిన—
వరబలంబున నతఁడు గర్వమున మించి
విక్రమమ్మున త్రైలోక్య మాక్రమింప
రావణుని కోడి సర్వగీర్వాణవరులు. 35

గీ. పద్మభవు జేరవచ్చి యాపన్నశరణ !
దేవ ! రక్షించు మమ్ము రావణునివలన
ఈవె కాకింక దిక్కు మా కెవ్వ రనిరి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 36

## శరణాగతి

సీ. వాణీశు ముందు శర్వాణీశుఁడవల
ఇంద్రాణీశుఁ డఖిలగీర్వాణవరులు
కోటేశ రోహిణీప్రాణేశ వాగీశ
వరుణవాయుకుబేరవసువు లవల
యక్షకిన్నరగారుడాశ్వినేయులు సాధ్య
సిద్ధగంధర్వాద్యశేషసురులు

స ప్తర్షిబృందమ్ము సనకాదిమునికోటి
నారదాదిక సర్వనాకమునులు
శరణుశరణంచు వచ్చి త్వచ్చరణయుగము
ఆగమోక్తుల వినుతించి ఆ దశాస్యు
ఘోరకృత్యాలు వర్ణించినారు గాదె!
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 37

## భగవద్వాణి

సీ. అబ్జజ! వాసవాద్యఖిలదిక్పతులార!
సనకాదిదివిజసన్మునులు! వినుడు
తపముచే నాదు పుత్రత్వమ్ము తమితోడ
అర్థించి రదితికశ్యపులు మున్ను
నరవిని వారె కౌసల్యాదశరథులై
జన్మించి రా పుణ్యదంపతులకు
పుత్రుండనై భువి పుట్టి రాక్షసకోటి
ఖండింతు ధర్మరక్షణము పొంటె
నేను శ్రీరాముఁ డనఁగ జన్మించువాఁడ
శ్రీసతీమణి పుట్టు తా సీతగాగ
మీరు వానరు లౌచు జన్మించుఁ డంటి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 38

## అయోధ్యాపుర వర్ణనము

ఉ. ఉత్తరభారతోర్వి సరయూనది తీరమునం దయోధ్య నా
ఉత్తమపట్టణం బొకటి యొప్పను అయ్యది రాజధానిగా
ఉత్తరదక్షిణావని సముజ్జ్వల విక్రమశౌర్యసాహసో
దాత్తులు భానువంశజు లుదారులు పాలననేసి రున్నతిన్. 39

శా. సప్తద్వీపవసుంధరాస్థలి మహాసామ్రాజ్యమై యొప్ప, ఆ
సప్తాశ్వాన్వయజాతు లెల్లరు మహాసమ్రాట్టు లౌచున్ జగ
ద్వ్యాప్తోద్దీప్తపరాక్రమక్రమమునన్ ధర్మైకనిష్ఠారతిన్
దీప్తిం గాంచిరి సత్యపాలనవిధిన్ దానైకదీక్షామతిన్. 40

సీ. ఏ పురం బీ భువి - ఇనవంశసంజాత
రాజేంద్రులకు నెల్ల రాజధాని
ఏ పురం బిల నలకాపురంబును బోలి
బహుభోగభాగ్యసంపదల మించు
ఏ పురం బేవేళ - ఇభరాజహయరాజ
రథరాజిసుభటసంరంభశోభి
ఏ పురం బేపొంది ఇక్ష్వాకుఁ డాదిగా
బహుసార్వభౌమసంపాలితమ్ము
సారసరయూనదీరమ్యతీరభూమి
సరసకేదారఫలితసస్యప్రశస్తి
గాంచి, కాంచనసౌధాళి మించె నేది
అదియె విఖ్యాతమౌ అయోధ్యాపురమ్ము. 41

సీ. ఏ పురం బేలెను ఇనతుల్యతేజస్వి
లోకవిఖ్యాతుఁ డిక్ష్వాకవిభుఁడు
ఏ పురం బేలెను - ఎల్లదిక్కుల గెల్చి
దాతృమూర్ధన్యమాంధాతృనృపతి
ఏ పురం బేలెను - ఇంద్రాదులున్ మెచ్చ
సత్యవాగ్రతహరిశ్చంద్రనృపతి
ఏ పురం బేలెను - ఇలకు గంగను దెచ్చి
కీర్తిగన్నట్టి భగీరథుండు

ఏ పురం బేలెను– ఇంద్రాదులన్ గెల్చి
రణధీరరఘుమహారాజవిభుడు
అట్టి పుణ్యరాజమౌ అయోధ్యాపురమ్ము
దశదిగంతరసంవ్యాప్త విశదయశుఁడు
దశరథేశుండు విమలసద్ధర్మమూర్తి
పూర్వరాజేంద్రులనఁ నెల్ల బోలి యేలె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 42

## దశరథమహారాజు

ఉ. రాజితవిక్రమక్రమపరాజితశాత్రవరాజమౌళి నీ
రాజితపాదపీఠుఁడు, నిరంతరధర్మవిధారతుండు, వి
భ్రాజిత సద్యశోవిభవరాజిత సర్వదిగంతరుండు, నై
రాజదయోధ్య నేలె జనరంజనపంక్తిరథుండు ధీరుఁడై. 43

గీ. కోసలాత్మజ కౌసల్యకోమలాంగి
కేకయాధీశపుత్రి కైకేయిసుదతి
మితసుభాషిణి వినుత సుమిత్రసుమతి
అతని రాణులు ముప్వురు నమలగుణులు. 44

ఉ. వారలు చారుగాత్ర లనవద్యచరిత్రలు కోమలాంగు లం
భోరుహపత్రనేత్రలు అపూర్వసురూపతనూవిలాసినుల్
చారువిశాలఫాలలు ప్రసన్నముఖుల్ సవిలాసహాసశృం
గారవచోభిరామలు ప్రగాఢపతివ్రతనైకలాలసల్. 45

ఉ. దారల ముప్వురన్ దశరథక్షితిపాలుఁడు కూర్మిపేర్మి దై
వారగ నొక్క రీతిగను వారల గాంచుచు సత్రయాగముల్
భూరి సువర్ణనాణెములు భూసురకోటికి నిచ్చి చేసి, ఈ
ధారుణి నేలె ధర్మమును దప్పక తా జయవెట్టగా ప్రజల్. 46

చ. బిరుదుమగండు శత్రుగణభీకరుఁ డాహవదోహలుఁడునై
ధరణిపులెల్ల గొల్వగ సుదారచరిత్రుఁడు ధర్మనిష్ఠ భూ
సురులకు దాతృతాగరిమ శుద్ధసువర్ణము లిచ్చి యిచ్చునై
సురుచిరరూపశీలగుణసుందరరాజ్ఞులు కూర్మి గొల్వగా
అఱువదివేలవర్షము లనంతను నేల ననంతకీర్తితో. 47

గీ. ఆ నరేశ్వరు రాజసభాంతరమున
అర్థశాస్త్రాదివిదులు రాజ్యాంగవేత్త
లమలగుణశీలయుతులు విద్యాన్వితులును
ప్రాజ్యసామ్రాజ్యరక్షాసురేజ్యసములు
మంత్రదక్షులు గల రష్టమంత్రివరులు. 48

ఉ. అందఱు రాజభక్తియుతు లందఱు రాజహితాభిలాషులున్
అందఱు మంత్రదక్షులును అందఱు సర్వప్రజాభిమానులున్
అందఱు రాజనీతివిదు లందఱు షడ్గుణశాస్త్రవేత్తలున్
అందఱు పంచతంత్రవిదు లందఱు సర్వసమర్థు లెన్నగన్. 49

గీ. అమరగురుతుల్యులగు అష్టమంత్రులందు
మహితమతిశాలియైన సుమంత్రమంత్రి
రాజహితకారియౌచు నిరంతరమ్ము
నిరతప్రభుభక్తి రాజసన్నిధిని నుండు. 50

ఉ. ఆతతవిక్రమస్ఫురణ ఆతఁడు గెల్చెను దైత్యకోటి, వి
ఖ్యాతవదాన్యతాగరిమ ఆతఁడు మించె దధీచిముఖ్యులన్
ఆతతభోగభాగ్యముల ఆతఁడు గేరు సురేశుభోగముల్
పూతచరిత్రుఁ డాతనికి పుత్రులు లేమియె లో[illegible]

గీ. దశరథేశుండు పుత్రసంతాన మొకటి
తనకు లేకుంట మదిని సంతాప మంది
గురువశిష్ఠుం భక్తిమై గొలచి వేడ
పుత్రకామేష్టి చేయుమో భూమిపాల
నీకు నుదయింత్రు విష్ణుసన్నిభులు సుతులు
అనుచు వచియించె ఆనందమంద విభుఁడు. 52

## పుత్రకామేష్టి

సీ. దశరథేశ్వరుఁడు వృద్ధత్వమ్మునన్ దన
సంతులేమికి చాల చింతఁజిక్కి
పుత్రార్థియై తాను- పుత్రకామేష్టినన్
యజ్ఞంబు సేయ నాయత్తమయ్యె
ఋష్యశృంగాదిక ఋత్విక్కులం గూడి
శాస్త్రోక్తవిధిని యజ్ఞమ్ము చేసె
తద్యజ్ఞమూర్తి ప్రత్యక్షమై అమృతాన్న
మందింప ఆనందమంది రేఁడు
అందుకొని కూర్మి తన రాణులందఱకును
పంచియిచ్చిన వా రతిభక్తితోడ
దాని భుజియించి గర్భముల్ దాల్చినారు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 53

## అంతర్వత్నులు

సీ. అన్నాదులన్ బుట్టె అరుచి అంతంతకు
మట్టిపై దోచె- కమ్మందనమ్ము
వింత కోర్కెలు పుట్టె వేవిళ్ల తఱచయ్యె
తళుకుచెక్కుల వెల్లఁదనము దోచె

నడుములు బలుపొందె నడలు మందమయ్యె
　　అలతంత నడువ నాయాసమయ్యె
చూచుకమ్ముల చుట్టు చూపట్టె నీలిమ
　　సౌందర్యగరిమ విస్తారమయ్యె
విశ్వనేతలు నిజగర్భవీథినుంట
　　పట్టమహిషుల గర్భముల్ భారమయ్యె
నిండుచూలాండ్ర కంతంత నెలలు నిండె
　　దశమమాసమ్ము వచ్చె సందడులు మించె. 54

గీ. మంత్రసానులతోఁ జేసి మంతనమ్ము
ప్రసవగృహమున నన్నియు భద్రపఱచి
సఖులు నిటునటు రాణివాసమ్మునందు
నడఁవణొచ్చిరి మునిముని నవ్వులొలయ. 55

## భగవదవతరణము

సీ. గ్రహపంచకం బుచ్చగతిఁ దాము చరియింప
　　కర్కటప్రథితలగ్నమ్మునందు
స్వక్షేత్రగతుఁడౌచు చంద్రుండు గురుతోడి
　　సాహచర్యంబున సంచరింప
రవి — ఉచ్చపదమేషరాశిసంగతుఁడుగా
　　నవవసంతపు చైత్రనవమితిథిని
వసుమతిప్రద పునర్వసుతార — మధ్యాహ్న
　　కాలంబునన్ బుణ్యవేళయందు
దుష్టశిక్షణదక్ష చతుర్భుజములు
స్వర్ణచేలమ్ము రత్నభూషణగణమ్ము

శ్యామలాంగమ్ము దివ్యతేజమ్ము వెలయ
కల్గితివి గాదె కౌసల్య- గర్భమందు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 56

సీ. మందరధ్వని దేవదుందుభుల్ దివి మ్రోగె
అప్సరస్త్రీల నాట్యమ్ము లెసఁగె
గంధర్వకిన్నరగానముల్ వినిపించె
బ్రహ్మాదిసురలు సంబరమునందె
జల్లున కల్పవృక్షములు పూవులు రాల్చె
మునిబృంద మత్యంతముదము చెందె
దశదిక్కులును విశదంబులై! కాంతిల్లె
పుడమి తా సస్యసంపూర్ణమయ్యె
పద్మనాభుండు వైకుంఠవల్లభుండు
పుడమి జన్మించె నని దేవముని యు చాటె
నాడు నే జెందినట్టి ఆనంద మెంతొ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 57

## కౌసల్య - పారవశ్యము

సీ. నిను గాంచి తను గాంచి నిజమొ కల్లొ యటంచు
కౌసల్య మిపుల దిగ్భ్రాంతిచెంది
ఇట్టి పుత్రుఁడు పుట్టు టేమి ! నా గర్భాన
శిశురూపమున దా వసించు టేమి !
నా పూర్వజన్మపుణ్యంబునన్ శ్రీపతి
ఆవిర్భవించె కృతార్థనైతి
అని భక్తిపారవశ్యమున మేన్ పులకింప
కన్నులానందాశ్రుకణము లొలుక

ప్రస్తుతించుచు పుత్రభావంబు వేడ
నీలరుచులొల్కు సుందరబాలరూప
మందితివి గాదె తల్లి యానందమంద
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 58

## భరతాదుల జననము

గీ. మరుదినంబున కైకేయి మహితచరిత
పుత్రు గాంచెను అంబుజోత్ఫుల్లనేత్రు
అమలగుణశీలవతి సుమిత్రాంబ పిదప
మధురగుణరూప పుత్రయుగ్మమ్ము గాంచె. 59

గీ. దివ్యతేజోవిరాజితదీప్తతనుల
పుత్రులన్ గాంచి దశరథభూవిభుండు
కనుల నానందబాష్పముల్ గ్రమ్మి కురియ
కోటివరహాలు భూసురకోటి కిచ్చి
వసుధ యంతట పుత్రోత్సవమ్ము చేసె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 60

## జాతకర్మ - నామకరణము

గీ. గురువశిష్ఠుల పూజించి గొలిచి భక్తి
జాతకర్మాది సకలసంస్కారవిధులు
జేయుఁడని వేడ దశరథక్షితివిభుండు
శాస్త్రవిధి నల్పె బాలుర జాతకర్మ౦ 61

కోసలాత్మజ తాఁ గన్న కొడుకు లోక
రంజనుండును మునిలోకరమణుఁ డనుచు
రమ్యగుణరూపశీలపాదమ్యుఁ డనుచు
"రాముఁడని" దివ్యరమణీయనామ ముంచె. 62

కేకయాధీశసుత యగు కైక గన్న
సుతుని భూభారభరణపక్షతను నెఱిఁగి
శిష్టమునిజనపూజ్య వశిష్ఠమౌని
"భరత" నామమ్ము నిడె మోదభరితుఁడగుచు. 63

అల సుమిత్రాంబ పుత్రులందగ్రజుండు
మహితలక్షణుఁడగుట లక్ష్మణుఁ డటంచు
అతని తమ్ముండు తా శత్రుహంత అగుట
మనసునం దెంచి "శత్రుఘ్నుఁ" డని వచించె. 64

## రామ నామ మహిమ

అరసి– అష్టాక్షరీమంత్రమందు వెలయు
'రా'ను గ్రహియించి బీజాక్షరమ్ముగాగ
అమలపంచాక్షరీమంత్రమందు నొప్పు
'మా'ను జోడించి 'రామ'నామమ్ము నుంచె. 65

'రా'ను స్మరియింప సర్వాఘరాశి యెల్ల
భస్మమైపోవు ఎల్ల శుభంబు లబ్బు
'మా'ను స్మరియింప కైవల్యమార్గ మబ్బు
'రామ !' త్వన్నామ తారకనామమయ్యె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 66

## బాలరాముడు – ఆత్మానుభూతి

సీ. గునగున నేల బంగుడులాడగా వచ్చి
తమితోడ నెత్తిముద్దాడినానో !
ఊయలలోఁ బెట్టి ఊఁచి జోలలు పాడి
పట్టుపరుపుల బొజ్జోపెట్టినానో !
బంగారుగిన్నెలో పాలు బువ్వను గల్పి
మంచిమాటల తినిపించినానో !
మొలచుట్టు బంగారుమువ్వలు రవళింప
పరువెత్తు నిను గాంచి పట్టినానో !
తానమాడించి చక్క ముస్తాబుచేసి
బొజ్జనిండుగ పాల్వోసి బుజ్జగించి
దాసిగా ఎంత నీ సేవ చేసినానో !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 67

సీ. పాలమీగడలపసల్ పరిమళమ్ములు గ్రమ్మ
తళతళలాడు బుగ్గలపసందు
అలికభాగము గప్పి అల్లాడు నలకల
ముద్దుగారెడు నవ్వుమోము సొంపు
పులిగోళ్ల పతకంపు ముత్యాలసరులతో
పొలుపారు నునుపారు బొజ్జతీరు
సిరిమించు బంగారు చిఱుమువ్వగంటల
కలరవంబులు గుల్కు కటిబెడంగు
గజ్జెమువ్వల రవళించు కాళ్లబెడఁగు
ముద్దుటుంగరముల వ్రేళ్ల మురువు హరువు

దాచపెట్టిన సొగసెల్ల దోచుకొన్న
చిట్టిరాముని నిను గాంచినట్టి తల్లి
చూచి ముద్దాడు మే మెంత నోచినామొ!
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 68

సీ. కౌసల్య నిను ముద్దుగా నెత్తి ఆడింప
తిలకించి పులకించి పిలిచినానా!
దశరథేశ్వరుఁ డంకతలమందు నిను జేర్చి
ముద్దులాడఁగ జూచి మురిసినానా!
తమ్ముకుట్టల గూడి తగ బంతులాడుచో
తెచ్చి మీ చేతి కందిచ్చినానా!
అస్త్రశస్త్రాదివిద్యల నేర్వబోవుచో
బాలుర మిము గూడి వచ్చినానా!
భద్రకంచుకినై రాజభవనమందు
మంచికత లేవొ చెప్పి ఆడించినానొ!
అటులుగాకున్న నీ భక్తి యెటులు గ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 69

సీ. రావె నా బంగారు రఘురామ వేరావె!
రమణీయరత్నాలరాశి రావె!
రావె నా చిన్నారి రామచిలుకా రావె!
ముద్దుల వరహాల మూట రావె!
రావె నా ముద్దారు రాకాశశీ రావె!
రావె నా నోముఫలమ్ము రావె!
రావె నా అందాల రామచంద్రా రావె!
రావె నా ముత్యాలకోవ రావె!

అనుచు ముద్దుగ నిను బిల్చి ఆదరించి
అక్కునను జేర్చి ముద్దాడి చెక్కునొక్కి
చొక్కు మీ తల్లి కౌసల్య చక్కగంటి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 70

## రామాదుల సౌదర్యము

గీ. నీవు లక్ష్మణు లిర్వురు నిరత మైత్రి
ఒకరి నొక్కరు విడువకయుందు రెపుడు
భరతశత్రుఘ్ను లటు లాటపాటలందు
ఒకరి నొక్కరు పాయకయుందు రెలమి. 71

గీ. పాయసాంశానుసారమ్ము పరగి మీదు
సఖ్యభావంబు లోకప్రశస్తి గాంచె
పరమమైత్రిని భ్రాతృభావంబునందు
మీర లాదర్శసోదరులైరి జగతి. 72

గీ. అందు నీయందు బాల్యంబునందు గూడ
అనుజులుందురు సతతమత్యంతభక్తి
దాని గనుగొని మీ తల్లిదండ్రు లెంతొ
ముగ్ధులగుచును మదిలోన మురియుచుండ్రు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 73

## అక్షరాభ్యాసము

గీ. పంచవర్షాత్మకంబయిన ప్రాయమందు
అక్షరాభ్యాస కృత్యంబు నాచరించి
గురువశిష్ఠులు విద్యల గఱపువేళ
ప్రాప్తసంజ్ఞైన విద్యలు ప్రాప్తమయ్యె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 74

గీ. పరమపంచాక్షరీమంత్రపఠనమహిమ
వివిధవిద్యలు నుపదేశవేళలందె
పట్టువడె మీకు బ్రహ్మర్షివరునివలన
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 75

## రామాదుల కుపనయన సంస్కారము

క. మీదట మీ నల్వురకున్
ద్వాదశవర్షంబులందుఁ దగ నుపనయనం
బా దశరథభూకాంతుఁడు
వేదవిధిన్ సల్పె మహితవిభవంబెసగన్. 76

క. గాయత్రీమంత్రము, నా
మ్నాయరహస్యమ్ము, మూలమంత్రము, విద్యా
దాయకముల్ సంధ్యాదుల
ధ్యేయము గురుదేవుఁ డిచ్చె దీక్షావిధిమై. 77

క. శ్రద్ధా మేధా ప్రజ్ఞా
బుద్ధీంద్రియశక్తు లాజ్యపూర్ణాహుతులన్
శుద్ధార్చ్చల వెల్గొందు స
మిద్ధాగ్నులు మీకు నిచ్చె నిష్టార్థంబుల్. 78

## విద్యాభ్యాసము

సీ. విధ్యుక్తముగ చతుర్వేదమ్ములన్ నేర్పి
నిగమార్థబోధలు నియతిఁ జేసి
విశదంబుగా చతుర్దశవిద్యలం దెల్పి
షట్శాస్త్రముల పరిజ్ఞాన మిచ్చి

నీతిశాస్త్రము రాజనీతిశాస్త్రమ్మును
మనుధర్మశాస్త్రసమ్మతిని దెల్పి
క్షత్రియోచిత దివ్యశస్త్రాస్త్రవిద్యలు
వివిధరీతుల ధనుర్విద్య నేర్పి
అఖిలవిద్యావిశేషరహస్యములను
బాల్యమునఁ దెల్పి మిముఁ జేసె ప్రాజ్ఞులుగను
బ్రహ్మతేజస్వి బ్రహ్మర్షి వరతపస్వి
గురువరుండైన మీ కులగురువరుండు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 79

గీ. వివిధ శస్త్రప్రయోగాదివిద్యలందు
విశ్వవిఖ్యాతమౌ ధనుర్వేదమందు
శిక్షణము నంది నీవు వశిష్ఠువలన
పండితుడ వైతి గాదె కోదండవిద్య. 80

గీ. మహితశస్త్రాస్త్రవిద్య - సమంత్రకముగ
ఇచ్చుమైె మీకు నుపదేశ మిచ్చునంత
వింత - మంత్రాధిదేవత లంతరిక్ష
మందు నిలుచుండి ప్రత్యక్షమైరి గాదె. 81

గీ. అందు జ్యేష్ఠుండ వగుట నీ వఖిలవిద్య
లందు శ్రేష్ఠుండ వన్న విఖ్యాతి గాంచి
గురుల కెల్లర కామోదకరుఁడవైతి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 82

సీ. జననియై అమితవాత్సల్యంబునన్ బెంప
కౌసల్యగన్న భాగ్యం బదేమొ !
జనకుఁడై ఆనందజనకుఁడై లాలింప
దశరథుఁ డొనరించు తప మదేమొ !
గురువౌచుఁ దాఁ గులగురుగౌరవంబంద
ముని వసిష్ఠుని పూర్వపుణ్య మేమొ !
దాసులై నీ పాదదాసులై సేవింప
పరిచారకుల భవ్యభాగ్య మేమొ !
సకలపౌరులు చేసిన సుకృత మేమొ !
పురములో నున్న ప్రాణుల పుణ్య మేమొ !
అందులో నేను ఒక ప్రాణి నౌదు నేమొ !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 83

## సాకేతపురము

సీ. ఏ పురం బేనాడు గోపురంబును మించి
కమనీయభోగవిఖ్యాతి మించె
ఏ పురం బేనాడు ఈరేడు లోకాల
కేకాశ్రయమ్మౌచు ఏపు గాంచె
ఏ పురం బేనాడు ఇంద్రాదిదిక్పాల
బృందారకులతోడ సందడించె
ఏ పురం బేనాడు - ఇహలోకవైకుంఠ
ధామమై పావనత్వమున మించె
అట్టి సాకేతపురిలోన- అవతరించి
దివ్యదీధితివెలుగొందు దినములందు
ఏను నీ పాదరేణువునైన గానా !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 84

సీ. సాకేతపురవీథి సౌధగోపురకోటి
నీడల నొక కొంత నిలిచినానొ !
సరయూనదీపుణ్యసలిలధారలలోన
వాసిగా స్నానంబు చేసినానొ !
పురమేగు త్వద్రథతురగరింఖాధూళి
రేణువుల్ తలను ధరించినానొ !
పద్మ-వజ్రాంకుశ-ఛత్రరేఖాంకిత
త్వత్పాదముద్రలు తడపినానొ !
భూతలస్వర్గధామ సాకేతపురిని
మానవులలోన నే నొక్క మానవుఁడనొ !
అట్టుగాకున్న నీ భక్తి ఎట్లు గల్గు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! ౮౫

## విశ్వామిత్ర ఆగమనము

సీ. ఘనతపోవహ్ని సుక్షాత్రంబు కరిగించి
బ్రహ్మతేజస్స్ఫూర్తి బడసె నెవఁడు
స్వర్గచ్యుతుండౌ త్రిశంకు నిల్పఁగఁ గోరి
స్థాపించె దివి ప్రతిస్వర్గ మెవఁడు
సత్యవ్రతు హరిశ్చంద్రభూపతి పరీ
క్షించి సత్కీర్తి ఘటించె నెవఁడు
అతులశస్త్రాస్త్రవిద్యాసార మఖిలంబు
పరమేశు శుశ్రూష బడసె నెవఁడు
అట్టి గాధేయుఁ డర్థియై యడుగుదెంచి
భవనగతుఁడైన మీ తండ్రి పరమభక్తి

దశరథేశ్వరుఁ డర్ఘ్యపాద్యంబు లిచ్చి
స్వాగతము పల్కి కొల్చె సుస్వాంతుఁ డగుచు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 86

సీ. స్వస్త్యస్తు ! దశరథక్ష్మాపాల ! సర్వత్ర
విజయోస్తు ! తే సదా విశ్వవినుత !
శ్రీరస్తు ! ఘనయశః శ్రీరస్తు ! భూమీశ !
సవితృవంశాధీశ ! సార్వభౌమ !
యజ్ఞార్థ మేను నాయత్తమౌ తరిని మా
రీచాది ఘోరరాత్రించరాళి
రక్తమాంసాస్థివర్షంబులన్ గురిపించి
విఘ్నముల్ చాల గావించుచుండ్రు
వారి వధియింప సమరదుర్వారబలుల
రామలక్ష్మణులను బంపు రాజచంద్ర !
అనుచు వచియించెనో లేదొ అంతలోనె
భయముతో నీదు జనకుండు పలికె నిట్లు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 87

గీ. ఓయి ! మునిచంద్ర ! క్షమియింపు మోయి నన్ను
వార్ధకంబున పుట్టినవారు వీరు
క్షణము విడనాడి యుండగా జాల నయ్య !
చెక్కు నొక్కిన పాల్గారు చిఱుతవారి
నెట్టు పంపింతు మునిరాజ ఇదిగొ యిపుడ
నేన వచ్చెద వారి మన్నింపు మనఁడె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 88

గీ. రాముఁ డీతండు త్రిజగత్రక్షకుండు
ధర్మరక్షార్థ మి ట్లవతార మె త్తె
పూర్వజన్మార్జితోర్జిత పుణ్యగరిమ
పుట్టె నాతండు మీ కిట్లు పుత్రుఁ డగుచు
పంపు లక్ష్మణుతోడ శంకింపవలదు
కలుగుఁ గల్యాణ మంచును కౌశికుండు
పలుక గురునాజ్ఞ మిమ్ముఁ దాఁ బంపెఁ గాదె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 59

## కౌశికుని పారవశ్యము

గీ. జనకునకు- యరుంధతీజాని కధిక
భక్తి ప్రణమిల్లి- తనవెంట వచ్చు మిమ్ము
గాంచి మదిలోన మురియుచు కౌశికుండు
పరమపురుషుండు శ్రీరామభద్రుఁ డిట్లు
మనుజరూపంబు ధరియించి మమ్ముఁ గొలిచి
వచ్చుచుండెను నాదు తపంబుపండె
జన్మ తరియించె అనుచు సంజాతహర్ష
పులకకంచుకితాంగుఁడై ముగ్ధుఁ డగుట
అరసితిని మౌనిశిష్యుండ నైన నేను
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 60

## బల - అతిబల విద్యాప్రదానము

సీ. విష్ణుశేషాంశరోచిష్ణులౌ మిము గాంచి
తనలోన తన్మయత్వమును జెంది
సరయూనదీ గాంగసంగమస్థలిఁ జేరి
స్నానాదివిధులెల్ల నలిపి- మౌని

శ్రీరామ లక్ష్మణుల్ శీఘ్ర మీ రీ నదీ
సంగమస్థలిని సుస్నాతులగుచు
రండు - మీ కేను మార్గశ్రాంతి పోఁద్రోచి
క్షుత్పిపాసాదిసంక్షోభ ముడిపి
బలమొసంగెదు – అతిబల - బలయు నాగ
విద్య లొసఁగెద – అతిలోక వీర్యశౌర్య
ధుర్యులై మింతు రని మునివర్యుఁ డిచ్చె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 91

గీ. అచట - ఆ రాత్రి గడపి కామాశ్రమంబు
చేరఁబోవుచు మార్గాన ఘోరవనము
దటిసి రాఘవ ! – ఇయ్యెడ తాటకాఖ్య
క్రూరరాక్షసి వసియించు నారి - అనుచు
సంశయింపక వేవేగ సంహరింపు
మనుడు నెటనుండో ఘోరభయంకరాట్ట
హాస మొకరించె వచ్చె విహాయసమున
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 92

## తాటకావధ

సీ. మానవావళిముండమాలికాపృథుకంఠ –
ఘనదేహ పర్వతాకారశీర్ష –
సాంధ్యమేఘావళీసదృశ కర్బురకేశ –
అగ్నిగోళభయంకరాక్షియుగళ –
కటిబద్ధశవవేలికాభీకరాకార –
తాళాభదీర్ఘదోర్దండభీమ –

కుంభికుంభాకారకుచకుంభ – గజకర్ణ –
వక్రదంష్ట్రాభీలవక్త్రకుహర –
అయుతగజబల - తాటకాహ్వాయ – సుకేతు
తనయ యెదురొడ్డి మార్గరోధంబు సేయ
రామచంద్రమ ! అదె క్రూరరాక్షసి సుమ
సంహరింపుము – అనుచు హెచ్చరిక సేయ
గురువు నాజ్ఞను ఒక కోలఁ గూల్చినావు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 93

గీ. కనుల నానందబాష్పముల్ గ్రమ్మ నిన్ను
కౌగిటను జేర్చి దీవించి కౌశికుండు
భవుని మెప్పించి తాఁగొన్న భవ్యదివ్య
సకలశస్త్రాస్త్రముల్ మంత్రసహితముగను
దేశికుండౌచు దా నుపదేశ మిచ్చి
మిమ్ము – ఆశీర్వదించుట నెమ్మి గంటి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 94

గీ. అవల వయనించి పుణ్యసిద్ధాశ్రమంబు
చేరి – జన్నంబు – దీక్షమై చేయఁబూనె
ఋత్విజులఁ గూడి కౌశికఋషివరుండు
దక్షులై మీరు తద్యజ్ఞ రక్ష సేయ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 95

## యజ్ఞారంభము – మారీచ-సుబాహుల వధ

సీ. హోమాగ్నిధూమం బహోరాత్రముల్ లేచి
వృష్టికై ఘనరాజి సృష్టిసేయ
ఆజ్యధారాభవ్యహవ్యగంధము వీచి
అమృతాంధసుల నాసకానగొల్ప

స్వాహానినాదముల్ సర్వామరశ్రేణి
కర్ణముల్ సొచ్చి యుత్కంఠఁ బెంప
ఉద్గాతృ సామవేదోదీర్ణగానంబు
యజ్ఞేశ్వరునకు– ఆహ్వాన మీయ
ఋత్విజుల గూడి కౌశికఋషివరుండు
యజ్ఞమును జేయ– తద్విఘ్న మాచరింప
తాటకేయులు రెచ్చి యుద్ధండలీల
ఘోరరక్తాస్థిమాంసముల్ గురివినాడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 96

గీ. వాయుదివ్యాస్త్ర మీవు దుర్వారబాహు
దర్పమున నేయ మారీచదనుజు తరిమి
తరిమి శతయోజనంబులు శరధి ద్రోచి
శరము తా వచ్చి మరల నీ శరధిజొరుట–
పావకాస్త్రాగ్ని బఱపి సుబాహు భస్మ
మొనరించి తక్కిన దనుజవరుల
క్షణములోఁ జంపి యజ్ఞరక్షణము సేత
ఖేచరుఁడ నౌచు అపుడు వీక్షించినాను
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 97

## మిథిలాగమనము

గీ. యజ్ఞకార్యంబు సంపూర్ణమైన పిదప
నీదు బలవిక్రమములు వర్ణించి మెచ్చి
కౌగిటను జేర్చి దీవించి కౌశికుండు
ఇట్టు వచియించె– ఆనంద ముట్టిపడగ. 98

గీ. జనకభూజాని తాను యజ్ఞం బొకండు
చేయగా నెంచి మమ్ము విచ్చేయుఁడంచు
పంపె నాహ్వానపత్ర మీ భటులచేత
పోయివత్తమె ఆతని పురికి రామ ! ౯౯

గీ. జ్ఞానఖనియైన జనకభూజాని జూడ
అడుగుచుంటిమి నేడు మేమతని పురికి
ఆ ప్తమిత్రుండు మీ తండ్రి కతఁడు సుమ్మి
రండు మీరును మాతోడ రామచంద్ర ! 100

గీ. యజ్ఞభూమిని చదునుచేయంగ నందు
కలిగెనట సీత యజ్ఞభూగర్భమందు
'సీత' అని యామె లోకవిఖ్యాతి గాంచె
జనకరాజన్యపుత్రి యా జానకమ్మ. 101

గీ. జనకు నింటను ముక్కంటిధనువు గలదు
దాని నెక్కిడువానికిఁ దనదు పుత్రి
సీత నీయంగ శపథంబు చేసె నృపుఁడు
శివుని ధనువును జూడ విచ్చేయుమోయి ! 102

గీ. కొమరుప్రాయంపు రారాజుకొమరు లెల్ల
విల్లు కదలింపలేకనే వెల్లబోయి
తరలినారట సిగ్గుచే తలలు వంచి
దాని చూడంగ రమ్ము — కల్యాణమస్తు ! 10౩

ఉ. అని వయనించె కౌశికమహర్షియు మీ రడుగంగ — త్రోవలో
తన చరితంబు — ఆతని యుదాత్తతపఃక్రియ లెల్లఁ దెల్పుచున్
జనవర గాంగసత్కథలు సాగరపుత్రుల శాపముక్తియున్
ఘనతర భక్తిమీర వినిపించెను గాదటె — రామచంద్రమా !

క. మునివెనుకను జనుచును ని
ర్జనవనమును గాంచి మౌనిచంద్రమ ! ఇది యే
మునియాశ్రమమై తగు ని
ర్జనమై ఫలపుష్పతరువిశాలంబగుచున్. 105

క. కత మేమని నీ వడుగగ
సుతపఃక్రమమౌనిలోకసోముఁడు తా స
న్నుత గౌతమముని ప
్రస్తుతచరితము దెల్పె మౌనిశేఖరుఁ డంతన్. 106

## అహల్యా శాపవిముక్తి

గీ. అదియె గౌతమమౌనిపుణ్యాశ్రమమ్ము
అమరరాజేంద్రవంచితార్ధాంగలక్ష్మి
మౌని శపియించె కోపాగ్ని మండిపడుచు
అబ్జభవపుత్రి – ఆ అహల్యామతల్లి. 107

గీ. భర్తృకోపాగ్ని అశ్మరూపంబు దాల్చి
తపము గావించుచున్న దా తపసిగృహిణి
నీదు పాదాబ్జసంస్పర్శ నెగడెనేని
నైజరూపంబు దాల్చు నా నాతిమిన్న. 108

గీ. రమ్ము రమ్మోయి శ్రీరఘురామచంద్ర !
మునిసతీమణి శాపవిముక్తఁ జేసి
పతితపావన సత్కీర్తిబడయుమయ్య
బ్రహ్మమానసపుత్రి ఆ పడతిమిన్న. 109

గీ. గౌతముని ఘోరశాపాగ్ని గ్రాగియున్న
గౌతముని పత్ని బ్రోవ నుత్కంఠమీర
కౌశిక ప్రేరణమ్మున కదలివచ్చి
పాదసంస్పర్శ శాపమ్ముఁ బాపినావు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 110

## అహల్యా స్తుతి

గీ. పతితపావన ! త్వత్పాదపద్మరజము
సోకినంతనె ప్రభు ! పరిశుద్ధనైతి
నీలనీరదసుందర ! నీరజాక్ష !
భర్తృశాపంబు వరముగా పరిణమించె. 111

గీ. ధీరగంభీరమూర్తి ! సుదీర్ఘబాహు !
కర్ణచుంబితసువిశాలస్కంధశిఖర !
శ్యామసుందర ! పీనవిశాలవక్ష !
ధన్యనైతిని రామ ! తద్దర్శనమున. 112

గీ. గౌతముని ఘోరశాపాగ్ని కరగి కరగి
శుద్ధనైతిని ఏమొ విశుద్ధచరిత !
ఎన్ని జన్మాల పుణ్యమో నిన్ను నేడు
గాంచఁగల్గితి దివ్యశృంగారమూర్తి ! 113

గీ. బ్రహ్మమానసపుత్రిగా ప్రభవమంది
అమ్మ గౌతమమౌని కర్ధాంగినైతి
ఏమి పాపమ్ము చేసితో ఎరుగ నేను
వాసవుఁడు తాను నన్నట్లు మోసగించె. 114

గీ. భర్తృశాపాగ్నిలో అట్లు భస్మమయ్యు
మరల రూపంబు గంటి నీ చరణమహిమ
పూర్వవాసన లుడిగి నే పుణ్యనైతి
జన్మసాఫల్యమై పునర్జన్మ గంటి. 115

గీ. గౌతముం డంత వచ్చి ఆకాశవీథి
అమలరూపంబుగన్న అహల్య గాంచి
అతిథిసత్కారములు మీకు అచరించి
సతియు దానును బహువిధస్తుతులు చేసి
ఆశ్రమమ్మున కేగె— అహల్యతోడ. 116

గీ. రాతి నా రీతి చక్కని నాతి జేసి
పతితపావనబిరుదమ్ము బడసినావు
గాంచితదియెల్ల దివి సిద్ధగణముతోడ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 117

## నావికుని భక్తి

గీ. గౌతమాశ్రమమును వీడి కౌశికుండు
మిథిలమార్గంబుపట్టఁగ మిమ్ము గూడి
గంగ ఎదురయ్యె పోవుమార్గమ్మునందు
నదిని దాటింప వచ్చెను నావికుండు. 118

గీ. దండమో రామ !. "నీదు పాదముల ధూళి
తగిలినంతన— అది యొక్క 'తరుణి' యగును"
అనుచు మా పల్లెవారెల్ల రనఁగ వింటి
వాడవాడల ప్రాకె నీ వార్త రామ ! 119

గీ. రామచంద్రమ ! నీ పాదరజము సోకి
మగువగా పెద్దశిలగూడ మారె నంట
దారు ఓడి యెంత నీదు పాదముల ధూళి
పడతి అదియైన నా కింక బ్రతుక దేది ? 120

గీ. కాన నీ పాదధూళిని గాంగవారి
కడిగి తడియొత్తి ఆ మీద గడపువాఁడ
అయ్య ! రామయ్య ! రావయ్య ! అడుగుదోయి
కడుగనీవయ్య !" అని చక్క గడిగి యొత్తి. 121

గీ. నదిని దాటించి మీదు మన్ననను గాంచి
మురిసిపోవుచు చేతులు ముడిచి నిలిచి
కనుల నానందబాష్పముల్ గ్రమ్మి జార
నతులు సల్పుచు నేగె నా నావికుండు. 122

ఆ. పల్లెవాని ముగ్ధభక్తిని మది మెచ్చి
నదిని దాటి మీరు కదలినారు
పల్లెవాడ నగుచు ఎల్లను గనుగొంటె
రమ్యసుగుణసాంద్ర ! రామచంద్ర ! 123

## మిథిలాగమనము

ఉ. గంగను దాటి మీరలును గాధితనూజుఁడు కొంతదూర మే
గంగ విదేహపట్టణము కన్పడెఁ దా కనుచూపుమేరలో
గాంగజలాభివర్ధితసుగంధమనోహరపుష్పవాటికల్
బంగరుపంటభూములను పండిన గోధుమశాలిసస్యముల్. 124

క. కనుడున్ జనకుని గనుగొన
మన మురి యాడంగ మిమ్ము మౌనియు గని ఓ
జనసుతగుణగణరామా!
కను మల్లదె మిథిల చేరఁగాదగు మనకున్, 125

చ. అదె– మిథిలాపురం బదె విహాయసవీథికి నంటు గోపురం
బదె– పురవీథి సౌధపరిహాసితరాజతశైలరాజ మ
ల్లదె– జనకేశు దుర్గము మహాపరిఖాపరసాగరావృతం
బదె– చతురంగసైన్యము రథాశ్వగజేంద్రభటప్రచారమున్, 126

క. ఇది పురబాహ్యోద్యానం
బదె లలితలతాకుటీర మల్లదె గుంజత్
మదమత్తషట్పదాంచిత
సదమలజలపూర్ణ వారిజాతాకరమున్, 127

క. గిరిమల్లెలు విరజాజులు
గురువిందెలు కురవకములు గొజ్జగి జాలుల్
సురపొన్నలు గను మల్లవె
అరవిచ్చిన బొండుమల్లె లందము లొలుకున్, 128

గీ. శీతకాసారవీచికాశీకరముల
సకలపుష్పౌఘసుకుమారసౌరభముల
మోసికొనివచ్చు ఈ వాతపోతములను
సేదదీర్చుక పురమును జేరవచ్చు, 129

గీ. సరసకాసారతీరసంస్థాపితమ్ము
చంద్రకాంతాశ్మబద్ధమౌ చప్పరమున
కొంత అలసటదీర విశ్రాంతి చెంది
విపులఘంటాపథమ్మున వెడలుచుండ 130

## పురకాంతల ముచ్చటలు

సీ. ఇతఁడటే ! పదునాలుగేండ్ల ప్రాయమువాఁడు
ఘోరతాటక నొక్క కోలఁ గూల్చె
ఇతఁడటే ! మారీచ నేచి వాయవ్యాస్త్ర
మున నూఱుయోజనంబులకు ద్రోచె
ఇతఁడటే ! చూడఁ దా నెంత పిరుఁడొ గాని
భస్మమ్ము చేసె సుబాహుదనుజు
ఇతఁడటే ! పాప మా- ఇంద్రవంచితయైన
అల- అహల్యాశాప మపనయించె
ఎంత చక్కని వాఁడమ్మ ! ఎంత బలుఁడె
ఎంత మహిమాన్వితుండె తా నెంత ఘనుఁడె
శివుని విల్లును నెక్కిడి సీత నితఁడు
పెండ్లియాడంగ వచ్చిన పెండ్లికొడుకె ! 131

గీ. ఇంద్రనీలాభదేహుండు చంద్రముఖుఁడు
పీనవక్షోభిరాముఁ డాజానుబాహుఁ
డర్కతేజుండు సింహసంహనుఁ డితండు
ఇంత చక్కని రాచవా డెందుఁ గలఁడె ! 132

గీ. ఎంత సొగసమ్మచెల్లరా ! ఇతని జూడ
వేయికన్నులు చాలవే వీని గన్న
తల్లిదండ్రు లదెంతటి ధన్యులమ్మ
చూడ ముచ్చటగొలిపెడు సుందరుండు. 133

గీ. వీరలిద్దరు అతిలోకచారుమూర్తు
లందు— ఆ యింద్రనీలాభుఁ డమ్మచెల్ల
కోదమసింగంపు నడకల కోడెకాఁడు
అపరమన్మథుఁడమ్మ సీతమ్మ కీడు. 134

గీ. పీనవక్షుండు సంహతాపీనభుజుఁడు
కృష్ణవర్ణుండు విష్ణురోచిష్ణుఁ డితఁడు
ధీరగమనుండు అబ్ధిగంభీరుఁ డితఁడు
చూడఁదగువాఁడు సర్వాంగసుందరుండు. 135

ఉ. అమ్మకచెల్ల ! వీనిదగు అందము చందము చెప్పలేము— సీ
తమ్మకు నీడుజోడగు నితం డిఁక రెండవవాఁడు లక్ష్మణుం
డమ్మరో ! రూపురేఖలకు అన్నిట— అన్నకు తీసిపోవఁ డో
అమ్మరో! ఊర్మిళమ్మ కితఁడబ్బిన ఎంతటి భాగ్యమో గదే! 136

క. అని సౌధోపరి యువతీ
జనమును మదిలోన పుణ్యసతులును బొగడన్
మునివెంటను జనుచును జన
కుని పావనయజ్ఞశాలకుం జని రంతన్. 137

## ఆత్మానుభూతి

సీ. కౌశికయజ్ఞరక్షాదీక్ష చనువేళ
నిను గాంచి పులకించి నిలిచినానో !
ఘోరతాటక నొక్క నారసంబునఁ గొట్టు
శూరాగ్రణిని నిన్ను జూచినానో !
గాధేయముని గాంగగాథ విన్పించుచో
కించిత్తుగా ఆలకించినానో !

అల- అహల్యాశాపమపనయించిన నీదు
పాదాబ్జములు చేతఁబట్టినానొ!
నావికుఁడు తాను తన నావ నాతిగాను
మారు నను శంక త్వత్పాదమార్జనంబు
సలుపు నపు డేను నిను జూడఁగలిగినానొ!
కానిచో నాకు నీ భక్తి కలుగు నెట్లు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 138

## విశ్వామిత్రునకు స్వాగతోక్తి

గీ. మునికులోత్తమురాక ఆ జనకవిభుఁడు
భటులు దెల్పంగ భక్తిసంభ్రమము లెసగ
ఎదురుగాఁబోయి తన పురోహితులతోడ
అతులభక్తిని సాష్టాంగనతులు చేసి. 139

గీ. అర్ఘ్యపాద్యాదివిధుల సమర్చ చేసి
దివ్యరత్నాంచితాసనస్థితులఁ జేసి
భక్తి దపకోత్త గాధేయుఁ బ్రస్తుతించి
విమలహృదయుండు జనకభూవిభుఁడు నంత. 140

గీ. మౌనితో వచ్చు రాజకుమారవరుల
మదనసుందరులను సుకుమారతనుల
సూర్యచంద్రప్రకాశవిస్ఫూర్తియుతుల
గాంచి మిమ్ముల తగ సత్కరించి పలికె. 141

## విశ్వామిత్రుడు రామలక్ష్మణులను పరిచయము సేయుట

గీ. మౌనిచంద్రమ! ఈ రాకుమారు లెవరు?
భువికి దిగివచ్చినట్టి యే దివిజవరులొ!
సూర్యచంద్రులొ! అసమానశూరు లెవరొ!
అనిన- కౌశికముని నస్మితాస్యుఁ డగుచు. 142

గీ. ఇతఁడు రాముండు - లక్ష్మణుం డితఁడు - నీకు
పరమసఖుఁడైన దశరథేశ్వరుని సుతులు
యజ్ఞరక్షార్థమై వీరి ననుపు మనుచు
దశరథేశుని గోర నాతండు పంపె. 143

ఉ. మా వనమార్గమందు - వినుమా అల తాటకి నీతఁడొక్క నా
రాచముతోడ ఁజంపె - ఘనరాక్షసు యజ్ఞవిఘాతు నల్ల మా
రీచను ద్రోచె వారిధి - అరిందముఁడై యిక వాని తమ్ము ఆ
నీచ సుబాహు మాడ్చె దివి నిర్జరు లెల్లరు మెచ్చ నీతఁడే. 144

గీ. భటులచే మాకు నాహ్వానపత్ర మీవు
పంపఁగా వీరు మాతోడ వచ్చినారు
వచ్చుచున్ గౌతమాశ్రమవని - అహల్య
శాపముం బాపె పాదసంస్పర్శ నితఁడు. 145

గీ. వీరి రక్షను అట్లు నిర్విఘ్నగతిని
యజ్ఞకార్యంబు దీరె - ఓ అధిప వినుమ
రాముఁ డీతండు త్రైలోక్యరక్షకుండు -
అతని తమ్ముండె - ఈతఁడు నంతవాఁడె. 146

గీ. మీ గృహంబున నున్న ఆ మేటిధన్వ
ధనువు చూడంగ వచ్చె నీతండు రాజ!
అనుచు వినిపించినంతనే జనకవిభుఁడు
మహితసంతోషమున మయి మఱచిపోయె. 147

గీ. విశ్వకర్మవినిర్మిత - విశ్వవినుత
త్రిపురసంహారుధనువు దర్శించి దాని
సొంత మదియెంతొ చూచి ఓ జనకరాజ
పోవువారలు సాకేతపురికి వీరు. 148

## శివధనుస్సును సభామండపమునకు గొనితెచ్చుట

క. అని ముని యన విని జనకుఁడు
ఘనమగు ఆనందమంది కౌశికముని ! ఆ
ధను పీఠం బెక్కఁడ నా
తనయను సీతమ్మ నిత్తు తప్పదు సుమ్మీ ! 149

చ. అని జనకుండు తా భటసహస్రము పంపఁగఁ బోయి వారలున్
కనకవినిర్మితంబు- మణికాంచనభూషితమంజుకింకిణీ
స్వనయుతమున్- సుమేరుగిరిసారముఁ దెచ్చి సభాంతరంబునన్
ఘనతరవేదికాస్థలిని కార్ముకరాజము నుంచి రంతటన్. 150

## రాజకుమారుల పరాభవము - సభలో కలకలము

ఉ. రాజతశైలభారము పరాజితరాక్షసవీరవారమున్
భ్రాజితరత్నకాంతిపరిభావిత గోపతిచాపరాజమున్
రాజతశైలనాథభుజరంజితమున్ గురుశక్తిమద్ధనూ
రాజము సంభ్రమమ్మెసఁగ రాజకుమారులు చూచి రాదటన్. 151

గీ. కొదమసింగంబులట్టి రాకొమరు లెల్ల
మీసముల్ త్రిప్పి వీరవిన్యాస మొప్ప
ఒకరి వెంటను నొక రహమికలు మించ
ధనువు నెక్కఁడబోయి దుర్దండబలులు. 152

గీ. పేటికాంతరసంస్థితభీమధనువు
డాసి కొందరు దాని కదల్పలేక
ఎత్తగాఁబోయి మఱి కొందఱెత్తలేక
తలలు వాల్చిరి సిగ్గు నుత్తలము చెంది. 153

గీ. శైవచాపంబు నెక్కిడఁ జాల రెవరు
శైవవైష్ణవబలశక్తిఁ జాలు రెవరొ
తక్క— అన్యుల కిద్ది సాధ్యమ్ము కాదు
అనుచు కలకల మెసఁగె సభాంతరమున. 154

గీ. అంతిపురికాంతలందఱు— అవనితనయ
సౌధభాగంబునందుండి బాలకముల
చూచి రది యెల్ల దాసినై జూచినాను
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 155

గీ. మౌనికనుసన్న లేచితో మానధనుఁడు
చేతిధనువును తమ్ముని చేతి కిచ్చి
వీరశృంగారరసములు వియ్యమంద
కోదమసింగంపుగతితోడ కదలివచ్చి. 156

## శివధనుర్భంగము

సీ. గాధేయమునికడకంటిసంజ్ఞను గాంచి
కటిచేలమును గట్టిగా బిగించి
కలభంబుగతి మించు గమనభంగిని దాసి
అభవుచావము భక్తి నంజలించి
లస్తకంబును వామహస్తంబునన్ బట్టి
వలకేల మౌర్విని బట్టి తివిచి
ఆకర్ణముగ ధనురారోపణము సేయ
ఫెళఫెళధ్వనితోడ ఫెళ్లు మనుచు
విల్లు విఱిగెను బ్రహ్మాండ మెల్ల తిరిగె
జనకనందిని యెదలెల్ల ఝల్లు మనియె
ఎల్ల రాజుల మోములు వెల్లనయ్యె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 157

సీ. జనకుండు సంతోషజలధి నోలలనాడె
కౌశికుం డానందకలితుఁడయ్యె
సౌమిత్రి కౌతుకోత్సాహమ్మునన్ మించె
భూదేవి పులకించి మురిసిపోయె
అంతఃపురం బెల్ల ఆనందమునఁ దేలె
వందిమాగధజయధ్వనులు మీఱె
అఖిలసమ్మనిభూసురాశీస్సు జేపొందె
తూర్యనాదమ్ములు తోరమయ్యె
దేవదుందుభు లొక్కటి దివిని మ్రోగె
పుష్పవర్షంబు లాస్థానభువిని గురిసె
అంతలంతల కన్నుల అవనిజాత
నిన్ను తిలకించి పులకించి నిలిచిపోయె. 158

## జానకీ స్వయంవరము

సీ. బంగారుజలతారు పట్టుపావడ గట్టి
చిట్టిముత్యాల జాకట్టు తొడిగి
కలహంసకులశిల్పకళ మించు సంవ్యాన
మవకుంఠనంబుగ అవధరించి
పిడికిట నడగు నెన్నడుము క్రిక్కిరిసిన
చనుదోయి వయ్యెద దాటువలచి
కటిభారమున మందగతి మించ రాయంచ
నడకల బెడగుతో నడచివచ్చి
చెలిమికత్తెలు ఇరువంక చేరి కొలువ
సిగ్గు దళుకొత్తు శృంగారసీమ సీత

కమ్మపూదండ కోమలకరము లెత్తి
వీరశృంగారమూర్తి దీపించు నీదు
కంఠసీమను వైచె నుత్కంఠమీర
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 159

## దశరథునకు శుభవార్త నందజేయుట

గీ. జానకీదేవి— శ్రీరామచంద్రునకును
లక్ష్మణున కిత్తు నా యూర్మిళాకుమారి
తమ్ముడైనట్టి మా కుశధ్వజుని సుతల
మాండవీశ్రుతకీర్తికుమారికలను. 160

గీ. భరతశత్రుఘ్నులకు నిచ్చి పరిణయంబు
సలుపువాడను నాదు నిశ్చయ మిదోయి !
అనుచు మునితోడ బలికె నా జనకవిభుడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 161

గీ. ఉభయపక్షంబులకు నెన్న ఓ మునీంద్ర !
కార్యసంధానకర్తవు గావె నీవు
మంచి సుముహూర్తమును నిశ్చయించి నీవె
పెండ్లికార్యంబులన్ నడిపించుమయ్య. 162

గీ. ఓయి మునిరాజ ! వేగ నయోధ్య కిపుడె
పంపు దూతల ఆహ్వానపత్ర మిచ్చి
దశరథేశుండు బంధుసంతతులతోడ
తాను రావలె సుతుల కల్యాణమునకు. 163

గీ. వాయువేగంబునన్ బోవు వారువముల
దూత లేగిరి వేగ సాకేతపురికి
పంక్తిరథుఁ గాంచి చేరి సద్భక్తి మ్రొక్కి
పరగ సందించి రాహ్వానపత్రికలను. 164

గీ. అందుకొని ఱేఁడు మిగుల నానందమంది
పసదనం బిచ్చి వారలఁ బంపి కూర్మి
రాణులకు నెల్ల సుతుల కల్యాణవార్త
తెలుప వారలు సంతోషకలితలైరి. 165

దశరథుఁడు కుమారుల పెండ్లికి తరలి వెళ్ళుట

గీ. హితుల మంత్రుల గురు పురోహితులఁ బిల్చి
వారి కెల్లర కీ శుభవార్త దెల్పి
"తరలిపోవలె జనకుని పురికి రేపు
తగిన సన్నాహములకు నుత్తరువు లిండు." 166

గీ. అని— వసిష్ఠుని గాంచి ఓ మునివరేణ్య
తేరుపై మీ రరుంధతీదేవితోడ
వాద్యఘోషలు పుణ్యాహవాచనముల
అరణులగ్నులు గొని ముందు నడుగవలయు. 167

సీ. చతురంగబలములు సైన్యాధిపతులును
తూర్యనాదంబులతోడ నడువ
సర్వతోలంకృతస్యందనంబులమీద
మంత్రులున్ సుతులు సామంతు లేగ
స్వర్ణమౌక్తికరత్నచతురంతయానాల
అంతఃపురాంగన లందఱరుగ

రాజలాంఛనరత్నరమణీయరథముపై
దశరథేశుం డంత తరలిరాగ
పౌరముఖ్యులు పండితప్రౌఢకవులు
నటవిదూషకగాయకనర్తకులును
వందిమాగధకంచుకివైణికులును
అరిగి రెల్లరు సుచిత్రవాహనము లెక్కి. 168

## ఎదురుకోలు

సీ. మండలాధీశసామంతరాజేంద్రులు
దండనాథులును వేదండఘటలు
స్యందనాశ్వపదాతిచతురంగబలములు
తూర్యనాదంబులతోడ నడువ
పటహమర్దళశంఖపణవాదిబహువాద్య
ఘోషముల్ దిగ్గిరి గుహల దూర
పుణ్యాంగనల్ స్వర్ణపూర్ణకుంభంబులు
ధరియించి ముందర తాము నడువ
ఎదురుకోలిచ్చి జనకభూమీశ్వరుండు
స్వాగతము వల్కి దశరథేశ్వరున కంత
పురమునకుఁ దెచ్చి సత్కారపూర్వకముగ
భవ్యసౌధమ్ములను విడిపట్టుచేసె. 169

గీ. మహితభక్తిని సీవు లక్ష్మణుఁడు నేగి
తల్లిదండ్రుల పాదపద్మముల కెఱఁగ
శిరము మూర్కొని కౌగిట జేర్చి మిమ్ము
వారలానందముగ్ధులైనారు గాదె!
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 170

## మిథిలాపుర అలంకరణము
### (పెండ్లిపందిరి - కల్యాణమండపము)

సీ. బంగారుకంబాల పగడంపుపట్టెల
 పెండ్లికై పెద్దపందిండ్లు వైచి
పట్టుబట్టల మేలు కట్టులు సవరించి
 రత్నదీపాల నలంకరించి
తోరంపురత్నాల తోరణంబులు గట్టి
 రంబయిన జిలుగుజెండాల నిల్పి
కమ్మని చందన కస్తూరికల యింపి
 అలికి ముత్యాలముగ్గులను దీర్చి
మణిమయం బగు కల్యాణమండపమున
ధర్మనిర్మితమైన చప్పరము నిల్పి
రత్నమౌక్తికకలితతోరణము లెల్ల
చక్క[illegible] సేసి రం శిల్పచతురు లెల్ల. 171

[illegible]వృత్తైన వచ్చువారెల్ల రొకవంక
[illegible]ప్పు—పరుని బంధు లొక్క వంక
రమ్యకనకదివ్యరత్నాసనంబులం
గూరుచుండి రెల్లవారు ఠీవి. 172

## శ్రీరామచంద్రుడు కల్యాణవేదికకు వచ్చుట

[illegible]ఘటితదివ్యమణిఘృణిజాలముల్
 [illegible]రాజభావవిస్ఫూర్తి వెలుగ
కర్ణభూషణరత్నకనకకుండలకాంతి
 గండస్థలిన్ నూత్నకాంతి నింప

ఆజానులంబబాహాబద్ధకేయూర
రత్నముల్ కాంతివర్షంబు గురియ
కటిబద్ధపరిశుద్ధకనకచేలద్యుతి
విమలవిద్యుత్కాంతి వెల్లి గొలువ
కమనీయపీనవక్షమునందు నవరత్న
హారముల్ శబలశృంగార మొలుక
అతను సుందరమూర్తి తా నచ్చుపడగ
అనుజులను గూడి మధురకల్యాణమూర్తి
సఖుల కైదండ పెండిలిచవికె కీవు
వచ్చు టది నేను గాంచి తా వంకనుండి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 173

గీ. పెండ్లిపీటను గూర్చుండఁ బెట్టి నిన్ను
పుణ్యపుణ్యాహవాచనపూర్వకముగ
విఘ్ననాయకపూజాది విధులు దీర్చి
వధువు రాకకు అంద ఱా వైపు చూడ. 174

గీ. అచట సఖు లెల్ల వైదేహి నంతిపురిని
కనకకలశాల తెచ్చి సుగంధవారి
స్నానమాడించి పెండ్లిముస్తాబు చేయ
హారతిచ్చిరి పెద్దముత్తైదువులును. 175

గీ. నయవిదుండగు అల శతానందగురువు
క్రమము తప్పక ఉభయపక్షములవారి
ప్రవరలన్ దెల్పి జానకీవధువుచేత
గౌరిఁ బూజింపఁ జేసె బంగారుపూల
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 176

## సీతాదేవి కల్యాణమండపమున కేతెంచుట

చలువవెన్నెల కాయు జాబిల్లిదొరతోడ
వదనబింబం బేదొ వాదు సేయ
ఆకసంబున నేలు అంకంబల్లన రేగి
మోముదామరతోడ ముచ్చటింప
ఎదలోన నిండి పెల్లగసిన కోరికల్
ఎదిగిన చనుదోయి కెదురు తిరుగ
ఎదలోన గునిసి సందడిసేయు మల్లెమొగ్గ
[illegible] దంతపంక్తి నెయ్యంబు వేద
[illegible] దీపంప్రకళిక లెగయ
[illegible] తనువల్లిదీప్తి నిడంగ
[illegible] కైదంప తీయ
[illegible] సీతమ్మ తల్లివెంట
[illegible]సాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 177

[illegible] పట్టుపుట్టంబు
[illegible] గుత్తంపు రవికట్టు తొడిగి
[illegible]బంతులన్
[illegible] వాల్జడను పైచి
[illegible] కాటుక పెట్టి
[illegible] నాస ముంగరను దాల్చి
[illegible] కల్యాణతి[illegible]
[illegible] నుదుటిపై తీర్చి దిద్ది

మణిగణాంచితకల్యాణమండపముకు
సఖులు గొనితేర జనకాత్మజాత సీతఁ-
గాంచితిని నాదు కన్నుల కఱవుదీర
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 178

## సీతాకల్యాణము

గీ. పసిడిపళ్లెమ్మునన్ నీదు పాదయుగము
పైడిగిండియఁ దన సతి వారి వోయ
కడిగి తడియొత్తి త్వత్పాదకమలజలము
తలను ధరియించి జనకుండు ధన్యుఁడయ్యెఁ. 179

గీ. సీతమెత్తనికరమును- చేతఁబట్టి
సాక్షతోదకపూర్వకశాస్త్రవిహిత
దానవిధితోడ సీతమ్మ ధారవోసె
క్షీరవారాశి మున్ను లక్ష్మికుమారి. 180

గీ. విష్ణునకు ధారవోసిన విధము దోప
జన్మ ధన్యంబుగాగ నా జనకవిభుఁడు
దివ్యదుందుభు లంతట దివిని మ్రోగె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 181

గీ. వామదేవర్షికౌశికవరవసిష్ఠ
యాజ్ఞవల్క్యశతానందులాది మునులు
యాజ్ఞికులు నొచు దీర్ప కల్యాణవిధులు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 182

శ్లో. సీతా మమ సుతా తుభ్యం
నానాలంకారభూషితా,
దీయతే విష్ణురూపాయ
గృహాణ వరవర్ణినీమ్. 184

## వధూ పరిచయము

సీ. యాగార్థమై భూమి సాగుచేయుచునుండ
భూగర్భముననుండి పుట్టె నీమె
అమ్మహేశుని విల్లు– బొమ్మరిల్లును గట్ట
వలకేలఁ దాఁ బట్టి వంచె నీమె
సకలవేదపురాణశాస్త్రముల్ పఠియించి
చిననాడె జ్ఞానమార్జించె నీమె
లోకకల్యాణంబు చేకూర్పగానెంచి
పుట్టినట్టులుగఁ గన్పట్టు నీమె
శ్రీకరమ్మగు జానకిశ్రీకరమ్ము
పట్టుకొమ్మోయి నీ కీమె పట్టుగొమ్మ
అనుచు నందించె– తండ్రి సీతమ్మకరము
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 185

గీ. తనకు– ఔరసపుత్రిక వినుతచరిత
లలితగుణరూప శీలోర్మిళాకుమారి
మహితబలశౌర్యధైర్య లక్ష్మణున కిచ్చి
పరిణయము చేసె జనకభూపాలకుండు. 186

గీ. తనకు సోదరుఁడగు కుశధ్వజుని సుతల
మాండవీశ్రుతకీర్తికుమారికలను
భరతశత్రుఘ్నభవ్యసోదరుల కిచ్చి
పెండ్లిగావించె వాద్యముల్ పెల్లు మ్రోగ. 187

గీ. సుతల నల్వుర నల్వురుసోదరులకు
ఇచ్చె- వచ్చిన బాంధవు లెల్ల మెచ్చ
నీదు జనకుండు నెంతయు మోదమందె
ఎంత ధన్యుఁడొ జనకభూమీశుఁ డరయ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 168

## తలంబ్రాలు పోసుకొనుట

సీ. మందాక్షమందాక్షమధురాననంబుల
చిఱునవ్వువెన్నెల చివురు లెత్త
సురుచిరతరపరస్పరకరస్పర్శచే
తనువులు పులకాంచితములు గాగ
కరములమౌక్తికాక్షతము లెత్తెడు వేళ
స్వేదాంబువుల మేను చెమ్మగిల్ల
తలఁబ్రాల తరగదొంతరలందు తమిమీర
మోముదామరులు దోబూచులాడ
తమిని తలఁబ్రాలు వోయ- పందెముఁ బైచి
ఒకరి చేతులు తప్పించి ఒకరు వోయ
కంటి నా నాడు కనుదోయి కరవుదీర
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 169

గీ. తూర్యనాదంబుతోడ నాతోద్యములును
మ్రోసె దిక్కులు నభము మార్మ్రోయ నొకట
నర్తకులు నంత మిగుల విన్నాణ మొప్ప
పురులు విప్పిన మాయూరములను బోలి
నాట్యములు సేసి రెల్ల రానందమంద. 160

గీ. పసిడిపీటలు బంగారుపళ్లెరములు
బంతితీరిచి వచ్చిన బంధుతతికి
పంచభక్ష్యాన్నభోజనభాజనముల
విందు గావించె జనకభూపతి పేర్మి. 191

గీ. మంజుమంజీరకింకిణీశింజితములు
కనకకంకణవలయనిస్వనము లొలయ
హాస్యచతురోక్తులను మందహాసరుచుల
వారిజాక్షులు వడ్డించినారు గాదె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 192

## అరణము

సీ. మణిమయవస్తుసంభారమ్ము మౌక్తిక
హారముల్ దివ్యరత్నాంబరములు
ధాత్రీజనమ్మును దాసదాసీనివ
హమ్మును స్వర్ణభాండాదికములు
స్వర్ణభూషాంచితస్యందనగజవాజి
సాహస్రముల్ భటసంచయమ్ము
కామధేనుసదృక్షకాంతగోలక్షయు
నాడెంపు కోటిదీనారములను
అరణముగ నిచ్చి కూతుల కల్లురకును
జనకభూజాని దశరథేశ్వరుని బిగ్గ
కౌగిటనుఁ జేర్చి గద్గదకంఠుఁ డగుచు
తనయలంట్టుల కోదంండ్రుఁ దలపుమనియె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 194

గీ. దశరథేశున కతని బాంధవుల కెల్ల
రత్నమౌక్తికభూషాంబరమ్ము లిచ్చి
విమలసూక్తుల ధన్యవాదములు దెల్పి
వీడుకొల్పెను జనకభూవిభుఁడు పేర్మి. 195

గీ. గురుజనమ్మును— పూజ్యభూసురగణమ్ము
మునిజనమ్ముల భక్తిమై పూజచేసి
స్వర్ణభూషాంబరాదుల సత్కరించి
వినయవినమితగాత్రుఁడై వీడుకొల్ప
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 196

ఆ. బంతితీర్చి నేను బ్రహ్మర్షిగణముతో
పంచభక్ష్యభోజ్యభరితమైన
విందు లారగించి వియ్యాలవా రిచ్చు
చందనాంబరాదు లందుకొంటి
రమ్యసుగుణసాంద్ర! రామచంద్ర! 197

## తనయలకు ఉద్బోధ

సీ. జనకుఁడు సాశ్రులోచనుఁ డౌచు గద్గద
కంఠుఁడై మిగుల నుత్కంఠతోడ
తనయుల శీర్షముల్ తమితోడ మూర్కొని
చెక్కులు నొక్కి ఆశీర్వదించి
అమ్మలూ! ఉభయవంశమ్ముల కీర్తిప
తాకలమనుడి! ఉత్తలము విడుడి
శ్వశ్రూశ్వశురులకు శుశ్రూష గావింపుఁ
డతిభక్తి గురువుల నరయుఁ డమ్మ

పరుల కనుసన్న మెలగంగవలయు సుండి !
పరులు కోపింప నెదురాడవలదు సుండి !
దాసదాసీజనమ్ముల దయను గనుడి !
కలిమిగలదన్న గర్వమ్ము వలదు సుండి !
అనుచు నెన్నెన్నొ బోధించి అనిచె సుతల
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 198

## వీడ్కోలు సంబరము

ఉ. దంతితురంగభాసురశతాంగపదాతిదళప్రచారముల్
దంతురతూర్యనాదనినదంబులు దిక్కుల మారుమ్రోయ శు
ద్ధాంతజనంబు లందలు నుదాత్తగతి స్ఫురణంబుమీరగా
కాంతసువర్ణరత్నశిబికాముఖయానములందు సాగ - అ
త్యంతమనోహరాకృతి వియచ్చరకాంతలబోలు నర్తకుల్
కంతు విచిత్రసైన్యమటు క్రమగతిన్ నటియింప ముందు - సా
మంతనృపాలకోటియును మాగధులున్ నడువంగ మైథిలిం
డెంతయుఁ బేర్మి - తా దశరథేశ్వరు డల్లుర వీడుకొల్పినన్. 199

## మార్గమున ఉత్పాత దర్శనము

గీ. క్రొత్తకోడండ్ర - కొడుకులఁ గూర్మి గనుచు
ఆత్మ కౌసల్య తన్మయత్వమ్ము నంద
ముగ్ధుఁడగుచును మిథిలేశుపురము దాటి
దశరథేశుండు యోజనత్రయము నేగ. 200

గీ. దుమ్ము సుడిగాలి - కన్నుల ధూళిపడఁగ
సివముపట్టిన యట్టులు చెట్లులూగ
సేనలన్నియు నిటునటు చెదరిపోవ
ప్రళయమట్టులు వీచె - ప్రభంజనమ్ము. 201

గీ. గురువశిష్ఠుల దశరథనరవరుండు
గాంచి దుశ్శకునమ్ములు గను డిదేమి
చూడ మార్గాన నెదో కీడు మూడఁనేమొ
తలఁకు పుట్టెడు నాదు డెందమున మౌని 202

గీ. అన— వశిష్ఠుఁడు రాజేంద్ర! అశుభ వేదొ
గలుగు సూచన లున్నవి గాని పిదప
మేలె గలిగెడు నదె జంతుజాల మెల్ల
తాము పరుగిడుచుండెఁ బ్రదక్షిణముగ. 203

గీ. అనుచు వచియించుచుండంగ అంతలోనె
తామ్రనేత్రుండు- భయదకోదండపాణి
బ్రహ్మతేజస్వి- విస్ఫురత్-పరశుధారి
అగ్రభాగమ్మునందు ప్రత్యక్షమయ్యె. 204

## పరశురామ గర్వభంగము

సీ. భార్గవగోత్రసంభావితచరితుండు
రేణుకాజమదగ్నిప్రాణసుతుఁడు
కార్తవీర్యార్జునకరసహస్రచ్ఛేది
బాహులేయాదిసబ్రహ్మచారి
బ్రాహ్మ్యసుక్షాత్రసంరంభశుంభన్మూర్తి
క్షత్రియాంతకమహాశపథకర్త
ఏకవింశద్వారపృథ్వీశసంహర్త
విష్ణ్వంశసంభూతవీరమూర్తి

పరశురాముండు క్రోధసంభరితుఁ డగుచు
వచ్చినంతనె దశరథేశ్వరుఁడు భీతి
మౌనిచంద్రుని పాదపద్మముల వ్రాలి
వినయవినమితగాత్రుఁడై విన్నవించె. 205

గీ. వరతపోధన! నవవధూవరులు వీరు
వీరి నాశీర్వదింపంగ వేడికొందు
అనెడి మీ తండ్రిమాటలు వినక అతఁడు
నిప్పు లొల్కెడు కన్నుల నిన్ను గాంచి. 206

గీ. క్షత్రియాంతకుఁడైన ఈ జామదగ్ని
ఏకవింశతివారమ్ము లేకధాటి
క్షాత్రకులములఁ గూల్చి ప్రశస్తిగాంచె
రామ! ఎఱుఁగవె భార్గవరాము నన్ను! 207

గీ. ప్రాతపడి త్రుప్పుపట్టిన భవుని విల్లు
విఱిచినందుకు మదిని గర్వింపఁబోకు
హరిశరాసన మియ్యది అందుకొమ్ము!
దీని నెక్కిడ నీ శక్తి తెలియుగాదె. 208

గీ. అనిన నీవును మందస్మితాననమున
కోపరేఖలు సుంత కన్గొనలఁ దోప
అతని హస్తమ్మునందుండి హరిశరాస
నమ్ము గైకొన నతని విష్ణ్వంశశక్తి
అతని విడనాడి వచ్చి నీయందుఁ గలసె. 209

గీ. అమ్మహాచాపమున నీవు అమ్ముదొడిగి
రామబాణమ్ము మౌని వ్యర్థమ్ముగాదు
బ్రాహ్మణుఁడ వౌట నీయందు బరుపరాదు
దీని కెయ్యది లక్ష్యమో తెల్పుమనిన. 210

గీ. భార్గవుండెంతొ ఆశ్చర్యభరితుఁ డగుచు
విన్నదనమున మోమెల్ల వెల్లబాఱ
దేవ ! విష్ణుండ వీవు గుర్తించినాను
పరమపూరుష ! నా తపఃఫల మదెల్ల
లక్ష్యమౌ నీదు బాణకీలమ్మునకును
అనుచుఁ జేదోయిమోడిచి అంజలించి. 211

గీ. ఆదిమధ్యాంతరహిత ! వేదాంతవేద్య !
భక్తమందార ! నా తపఃఫలము నీకు
ధారవోసితి నా జన్మ ధన్యమయ్యె
భవ్యతావకనిర్మలపాదభక్తి
కలుగ వరమిమ్ము ! ఇదియె నా కాంక్షితమ్ము
అనుచు వేదోక్తఫణితుల వినుతి చేసి
ఏగె మోదమ్ముతోడ మాహేంద్రగిరికి. 212

## ఆత్మానుభూతి

సీ. మిథిలేశపురవీథి మెదలుచుండెడివేళ
సోరణగండ్ల నిన్ జూచినాను
జనకభూపాలుండు స్వాగత మ్మిడుతఱి
కౌతుకంబున నిన్ను గాంచినాను

శివధనుర్భంగమ్ము చేసి మించినవేళ
ముదమొప్ప నినుగని మురిసినాను
కమనీయజానకీకల్యాణమహమందు
శ్రీయని కైత నుతించినాను
హరిశరాసన మెక్కిడి అశ్రమమున
పరశురాముని గర్వమ్ముభంగపఱచి
మించు నిను గాంచి ఎంతొ స్తుతించినాను
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 213

## సాకేతపుర ప్రవేశము

సీ. పసుపుపట్టంబుల పచ్చనికోడండ్రు
తనయులు పసిడి అందలము లెక్క
బోయీలు "హెవ్వొకెవ్వొంపు" పాటల నడువ
అంతఃపురాంగన లనుసరింప
చతురంగబలపాళి సమ్మర్దమున రేగు
ధూళి-యుల్లాభంబుతోడ నడువ
భూసురాశీస్సులు భూనభోంతరసీమ
తూర్యనాదంబులతోడ నిండ
పురము వారెల్ల రెదురుసంబరము నడువ
కరము ముదమున సాకేతపురము చేరి
క్రొత్తకోడండ్రు కొడుకులు కోర్కె లెసఁగ
క్రొత్తవలపుల సొంపుల కూర్మినుండ
అకని మీ తల్లిదండ్రులు మురిసినారు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 214

## యుధాజిత్తు - తనమేనల్లుని భరతుని గొనిపోవుట

గీ. కేకయాధీశసుతుఁడు కైకేయిభ్రాత
శ్రీయుతుండగు నల యుధాజిద్విభుఁడు
భరతు మేనల్లు దనతోడఁ బంపు మనఁగ
దశరథేశుండు నతని కాదనగలేక
పంపె మాతులుతోడ నా భరతు బ్రీతి
భరతునిం గూడి క్షణ మెడబాయకుండ
సతత ముండెడి శత్రుఘ్నుఁ డతనితోడ
కదలి తానేగె ఆనందకలితుఁ డగుచు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 215

## ఆదర్శదాంపత్యము.

సీ. శ్రీజానకీదేవిచెక్కుటద్దములందు
నిజరూపరేఖలు నిండ చూచి
దిగి- అయోధ్యామందిరోద్యానసీమల
పూపొదరిండ్ల దోబూచులాడి
శ్రీమైథిలీసమాశ్లేషసౌఖ్యములందు
సోలి ఆనందాబ్ధి తేలియాడి
సరయూనదీతీరసైకతస్థలులందు
వైదేహి కౌగిట వాలి వాలి
ద్వాదశాబ్దంబు లిర్వు రద్వైతభంగి
ప్రకృతిపురుషుల కైక్యభావంబు చూపి
ధర్మరతినుంటి రాదర్శదంపతులుగ
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 216

క. రామా! రమణీయగుణా
రామా! సౌందర్యకామ! రణభువిభీమా!
రామాజనమణి సీతా
భామాహృద్రాజ్యసార్వభౌమా! రామా! 217

కాండాంతగద్యము

శ్రీమహాకుంద్యన్వయపవిత్ర, ఆత్రేయసగోత్ర మహాకవివేంకటకవి
ప్రపౌత్ర, జగన్నాథశాస్త్రిపౌత్ర ఉద్దండపండితగోపాలశాస్త్రి
పుత్ర, విద్వజ్జనవిధేయ ఉభయభాషాప్రవీణ –
సూర్యనారాయణశాస్త్రినామధేయ ప్రణీ
తంబయిన ప్రత్యక్షరామాయణ
మహాకావ్యమున బాలకాండము
సర్వము సమాప్తము
ఓం తత్ సత్
శ్రీరామచంద్రార్పణమస్తు

—౦—

శ్రీః

# శ్రీ ప్రత్యక్షరామాయణము

## ప్రత్యక్షాత్మానుభూతి రామాయణము

## అయోధ్యాకాండము

---

క. శ్రీరమణీమణిహృత్సర
సీరుహమధులుబ్ధభృంగ ! శ్రితమునిసంగా !
కారుణికోత్తమ ! రామా !
శ్రీరఘువంశాబ్ధిసోమ ! సీతారామా ! 1

గీ. దశరథాత్మజ ! రణధీర ! ధర్మవీర !
అవనిజానాథ ! సర్వలోకాధినాథ !
అవలి కథ నింక విన్పింతు నవధరింపు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 2

### నిత్యకృత్యములు

సీ. ప్రతిదినంబును రామ ! ప్రత్యూషమున లేచి
స్నానసంధ్యావిధుల్ సలిపి నియతి
నిజకులదైవమ్ము నిగమస్వరూపుని
భాస్కరు నత్యంతభక్తి గొలిచి
ధ్యానముద్రను నాత్మతత్త్వమ్ము పరికించి
ఆత్మానుసంధాన మరసి బుద్ధి

గురువులతో శాస్త్రగోష్ఠి చర్చలు సల్పి
మునిజనమ్ముల భక్తిపూజ చేసి
తల్లిదండ్రులపాదపద్మములు గొలిచి
తమ్ముకుఱ్ఱలయెడల నాదరము చూపి
తనువుదాల్చినయట్టి సద్ధర్మ మట్లు
సంచరింతువు నీ వెల్ల జనులు పొగడ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 3

సీ. జనకునితో రాజసభ కీవు చనుదెంచి
అఖిలసామ్రాజ్యకార్యమ్ము లరసి
సామంతనృపులతో సల్లాపములు సల్పి
మంత్రులతోఁ జేసి మంత్రణమ్ము
పౌరముఖ్యులు జానపదవాసు లొనరించు
మనవులున్ వారి సమస్య లెఱిగి
మృగయావిధిన్ క్రూరమృగహాని తొలగించి
కర్షకలోకరక్షణము సేసి
ప్రాజ్యసామ్రాజ్యరక్షణపాలనముల
జనకునకు నెల్ల రీతి విశ్రాంతి గూర్చి
అఖిలజనపాళిసన్నుతు లందినావు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 4

## పౌరప్రశంస

సీ. రాముండు జగదభిరాముండు – సౌందర్య
కాముండు జలధరశ్యామలుండు
చండదోర్దండ కోదండాభిరాముండు
పరిణతకోదండపండితుండు

వేదవేదాంగాది విద్యాప్రవీణుండు
సారశాస్త్రాంబుధిపారగుండు
వీరుండు - స్వర్ణాద్రిధీరుఁడు- శరధి
గంభీరుండు శాత్రవభీముఁడంచు
పౌరు లెల్లరు నిన్నెంతొ ప్రస్తుతింప
దశరథుం డాత్మ సమ్మోదవశుఁడు నగుచు
శిష్టకులగురువైన వసిష్ఠుతోడ
మంత్రణముచేసె నల్ల సుమంత్రుతోడ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 5

## వసిష్ఠ-సుమంత్రులతో దశరథుని మంతనము

గీ. మౌనిచంద్రమ ! మంత్రిసుమంత్ర ! వినుడి
భవ్యమౌ మీదు మంత్రణాబలము కలిమి
నేల ఏలితి అఱువదివేలయేండ్లు
వృద్ధుఁడను నైతి భాగ్యసమృద్ధిఁ గంటి. 6

గీ. సుతుల గంటిని ప్రజల సన్నుతులు గంటి
రాముఁ డగ్రజుఁ డఖిలసామ్రాజ్య మేల
దక్షుడయ్యెను పాలనాదక్షుఁడయ్యె
ప్రజల ఆమోద మన్నిట బడసినాఁడు. 7

గీ. రమ్యగుణరత్నఖని- పుత్రు రామచంద్రు
ప్రాజ్యరాజ్యమ్మునకు యువరాజు చేసి
రాజ్యభారమ్ము తీర విశ్రాంతిగొందు
అనుచు వారల ఆమోద మంది రాజు. 8

గీ. మఱుదినంబున ఆస్థానమండపమున
ప్రకటనము సేయగానెంచి పౌరవృద్ధ
మండలాధీశ సకలసామంతనృపుల
కంపు డాహ్వానపత్రిక లనుచు పనిచె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 9

## దశరథుని ప్రకటన

సీ. వేదవేదాంగాదివిదులార ! షట్ఛాస్త్ర
నిపుణులార ! షట్కర్మనిరతులార !
రఘువంశరాజన్యరాజ్యరక్షాదక్ష
మండలాధీశ – సామంతులార !
ధనధాన్యసంతతి కుబేరుని గేరు
వాణిజ్యనిపుణ సద్వణిజులార !
దుర్భిక్షదోషంబు తొలఁగ సస్యావళి
పండించు కర్షకప్రవరులార !
ఏలితిని రాజ్య మఱువదివేల యేండ్లు
నిండఁబండెను శిరము వృద్ధుండ నయితి
రాము యువరాజుచేసి విశ్రాంతి గొందు
ననుచుఁ బ్రకటించె నానందమంద ప్రజలు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 10

గీ. రాజు– ప్రకటింప సర్వసామ్రాజ్యప్రజలు
సచివసామంతమండలేశ్వరులు నెల్ల
అమితమై చెల్లు ఆనందమందినారు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 11

గీ. శిల్పవిద్యాప్రవీణులౌ శిల్పు లెల్ల
రాజు నానతి అత్యంతరమ్యముగను
పుర మలంకృతిసేయంగఁ బూనినారు
నూతనోత్సాహ మందె సాకేతపురము–
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 12

## కౌసల్య చెందిన ఆనందము

క. రాజితగుణు రాముని యువ
రాజును జేయంగ పౌరరాజన్యులతో
రాజసభన్ నేడు మహా
రాజులు ప్రకటించినారు రాజ్ఞీ వినుమా ! 13

క. అని చెలికత్తెలు దాసీ
జనమును వినిపింప నీదు జననియు మోదం
బున హారాదులు వెసఁ బస
దనముగ నందఱకు నిచ్చె దా నంతిపురిన్. 14

## పురాలంకరణము

సీ. తగడుబంగరుపోత స్తంభాలు నెలకొల్పి
తీరుగా పెద్ద పందిళ్లు వైచి
కలువడంబులు మేలు కట్టులు నవరించి
ధర్మాంబుపూర్ణకుంభములు నిల్పి
తోరంపు రత్నాల తోరణంబులు గట్టి
ముంగిట ముత్యాల ముగ్గు తీర్చి
పురవీథి సౌధగోపురవీథులం దెల్ల
మేలైన పట్టుజెండాల నెత్తి

లంతకళ మించ పురము నలంకరించి
పౌరులెల్లరు యువరాజపట్టభద్రు
నిన్ను జూడంగ రేయి నిర్నిద్రవృత్తి
గడపినార లెదెంతొ సందడులు మించ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 15

## దేవసభ

సీ. పద్మాసనాది సుపర్వు లెల్లరు సత్య
లోకంబునందు నేకైకమతిని
సభదీర్చి శ్రీరామచంద్రుఁడు యువరాజు
పట్టాభిషేకసంపన్నుఁడైన
రావణు లోకవిద్రావణు నే రీతి
వధియించు నెట్లు భూభార ముడుపు
నారాయణుండె తా శ్రీరాముఁడై పుట్టి
మన మొఱ్ఱలన్నియు మరచె నేమొ !
నారదుని వేగ మన రాయదారిగాగఁ
బంపి కార్యంబు నెట్లు సాధింపవలయు
అనుచు యోచించి నారదు ననిచినారు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 16

## నారదాగమనము

సీ. శ్రీజానకియు నీవు శ్రీరామ ! యేకాంత
మందిరంబున నుండ మహతి మీటి
నారాయణస్తుతి నారదుం దేతెంచి
అభిముఖస్థితుఁడు తానైన— అంత

భక్తితోడుత రామభద్ర ! ఆ సురమౌని
సింహాసనాసీను జేసి తమిని
రంగారుబంగారుభృంగారమున సీత
సరయూనదీ పుణ్యసలిలధార
పోయ నారదు పాదాబ్జములను గడిగి
తజ్జలంబును శిరమున దాల్చి, మౌని !
దయను జూపితి మా జన్మ ధన్య మనవె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 17

సీ. కమలాక్ష ! త్వత్పాదకమలనిస్రుతవారి
ముద్దుగా జడలలో ముడిచె శివుఁడు
పద్మాక్ష ! త్వత్పాదపద్మసంభూతాంబు
జలకుండికను జేర్చె జలజభవుఁడు
జలజాక్ష ! త్వత్పాదజలరుహోద్గతగంగ
సగరాత్మజులకు మోక్షం బొసంగె
వనజాక్ష ! త్వత్పాదవనజసంభవధార
త్రైలోక్యపావనత్వమున మించె
అట్టి శ్రీరామ నీ పట్టు లనఁగఁ దగునె !
మాయతో నన్ను ముంపంగ న్యాయ మగునె
దేవదూతగా వచ్చితో దేవ యనుచు
విన్నవించెను విబుధుల విన్నపంబు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 18

## సత్యదీక్ష

సీ. బ్రహ్మమానసపుత్ర ! బ్రహ్మాదిగీర్వాణ
వరుల కిచ్చిన వరము మరువలేదు
రావణాదికదుష్టరాక్షసులను జంపి
మునిగణంబును దేవగణముఁ బ్రోచి
శిష్టరక్షణ - దుష్టశిక్షణంబును జేసి
ధర్మంబు నాల్గుపాదముల నిలిపి
ధర్మరాజ్యంబు సంస్థాపనంబును జేసి
దేవకార్యంబు సాధించుకొంటె
జనకజాతను - తమ్ము లక్ష్మణుని గూడి
శ్వః ప్రభాతంబుననె వనస్థలికి నేగి
చక్కబెట్టెద సర్వంబు సత్య మనవె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 19

## మంథర - దురోధ

సీ. "మంథర"యను దాది మదిలోఁ బ్రవేశించి
వాణి ప్రేరేప నవ్వామనాంగి
కైకేయి గాంచి యేకాంతమందిరసీమ
దురోధగావించె దుష్టబుద్ధి
ఓ యమ్మ ! రాముండు తా యువరాజౌను
కౌసల్య కీ వింక దాసి వౌదు
భరతుండు యువరాజపట్టభద్రుండైన
రాజమాతగ నిన్ను రాజు చూచు

దశరథేశుండు మును వరద్వయము నీకు
ఇచ్చె గాదమ్మ ! సమయమ్ము వచ్చె నిపుడు
కోరుకొమ్మంచు చెవిలోన పోరుపెట్టె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 20

## దశరథుండు కైక నాశ్వాసించుట

సీ. మంథరాదుర్బోధ మతిచెడి కైకేయి
శృంగారవేషమ్ము భంగపఱచి
కోపమందిరమునకుం బోయి తలకట్టు
కొని నేలపై పండుకొనియె నంత
దశరథుం డేతెంచి దయిత నాలోకించి
తరుణి ! ఈ రీతి భూతలమునందు
శయనింపగా నేల ? సఖి ! నీదు మదిలోన
కోరిక లేవియున్న - కోరుకొనుము
ఏవి కోరిన నవి యెల్ల నిచ్చువాఁడ
సందియం బేల అడుగు నిశ్శంకవృత్తి
ఆడితప్పుట మా వంశమందు లేదె
అనిన కైకేయి లేచి అతనిని గాంచి. 21

## కైక వరముల గోరుట

గీ. దేవదానవులకు మున్ను దివమునందు
రాజ ! జరిగిన ఘోరసంగ్రామమందు
ఆర్యపుత్రుల కేను సాహాయ్యపడితి
అపుడు నను మెచ్చి మీరు నత్యంతప్రీతి. 22

గీ. రమణి ! ఇచ్చెద నీకు వరద్వయమ్ము
కోరుకొమ్మన్న నే నప్డు కోరుకొనక
అవసరంబైనచో అప్పు డడుగుదాన
న్యాసముగ నుండు మీవద్ద నంత దనుక. 23

గీ. అంటి నా నాడె అవసరంబయ్యె నేడు
గానఁ గోరెద నిప్పుడు కాదు నాక
సత్యవచనుండ వనుచుఁ బ్రశస్తిగన్న
వసుమతీనాథ ! ఆ వరద్వయము నిమ్మ. 24

గీ. మొదటి వరమున— నీ విప్డు మొట్టమొదట
భరతు నా పుత్రు యువరాజపట్టభద్రు
చేసి, రాముని అరణ్యసీమ కంపు
మచట నాతండు పదునాలుగబ్దములను
అజినవల్కలధారి - మున్యన్నభుక్తి
అవుచునుండుట ఇదియె రెండవ వరమ్ము
అట్లు పదునాల్గు వర్షము లచట గడపి
వసుమతీనాథ ! అతఁడు రావచ్చు పురికి. 25

గీ. అనిన తోడనె రాజు మూర్ఛను మునింగి
కొంతవడి లేచి ఎదుటను క్రూరదృష్టి
కైకయుండుట గాంచి దుఃఖమున క్రుంగి
నీదు జనకుండు కన్నుల నీరుకార
సాంత్వనోక్తుల నామె ప్రసన్నఁ జేయ
ఇట్లు వచియించె దీనత్వ ముట్టిపడగ. 26

## దశరథుడు కైకను వేడుకొనుట

గీ. భరతునకు నిత్తు రాజ్యమ్ము వరతనూజు
రాము నంపఁగఁ జాల నరణ్యములకు
అన్యవరమును గోరుకొ మ్మతివ! నీకు
రాముఁ డొనరించినట్టి నేరం బదేమి. 27

గీ. 'భరతుకంటెను నాయందు భక్తి కలిగి
రాముఁడుండు' నటంచును రాము నీవు
ఎపుడు పొగడెద వింతలో ఏమి వచ్చె
ఎవరు బోధించినారె నీ కిట్టి బుద్ధి
శత్రుభావంబు దగునటె పుత్రునందు
మగువ! యోచించి మనసును మార్చుకొమ్మ! 28

గీ. అనుచు ఎంతయు దా వేఁడుకొనుచుఁ బలుక
తరుణి కైకేయి విని ఆడుత్రాఁచువోలె
కస్సు మనుచును లేచి అక్కసు చెలంగ
సత్యవచనుండవగుదేని జాగుజెక
వసుమతీశ్వర! ఈ వరద్వయము నిమ్ము.
అటులు కాదేని నీదు ప్రత్యక్షమంద
ప్రాణముల వీడుదును విషభక్షణమున. 29

గీ. రాక్షసీ! కైక! నీకు శ్రీరాముఁ డేమి
కీడు చేసెనె? మౌర్ఖ్యమ్ము వీడవేమి?
రాము నెడబాసి నే నింక బ్రతుకలేనె
"రామ! శ్రీరామ! నను జూడ రావె తండ్రి!"
అనుచు నేలను వ్రాలె నీ జనకుఁ డంత. 30

గీ. తెల్లవారకముందె మంత్రివరుఁ డంత
వచ్చి అస్వస్థు దశరథేశ్వరుని గాంచి
అమ్మ ! ప్రభువులు తాము మాటాడ రేమి ?
అనిన కైకేయి రామ రామా ! అటంచు
రాజు మూర్ఛిల్లె వేవేగ రాము దెమ్ము
అనిన అతండు వేవచ్చి అంత దెలిపె
దివ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 31

## శ్రీరామచంద్రుని సత్యప్రతిజ్ఞ

గీ. మంత్రివరుఁడైన అల్ల సుమంత్రుఁ డంత
వచ్చి తెలుపంగ నీవు వే వచ్చి తండ్రి
నంకమున జేర్చి కారణం బడుగ– కైక
సర్వమును దెల్పెఁ దాన నిశ్శంకవృత్తి. 32

గీ. తండ్రి ! దీనికి ఇంత సంతాప మేల ?
అనుగుతమ్ముని యౌవరాజ్యాభిషిక్తుఁ
జేయు మే నేగుదును వనసీమ కిపుడ
తీర్తు నీదైన సత్యప్రతిజ్ఞ నేను. 33

గీ. రాజ్యమేలును భరతుం డరణ్య మేను
పాలనము నేతు నా కిమె మేలు చేసె
రాజ్యపాలన మన్న భారమ్ము గాదె !
ఒనక ! దుఃఖమ్ము నాకు లేశమ్ము లేదు
అనిన నిను గౌఁగిటను జేర్చి ఆర్తిచెంది
కనుల నశ్రులు గురియ దుఃఖమ్మునంది. 34

ఉ. మానితరూపశీలగుణమండన రామ! మనోభిరామ! నిన్
గానల కెట్లు లంపుదును కన్నసుతున్ విడనాడి యే గతిన్
ప్రాణముతోడ నుందు నిఁక పాపిని నే నతి కష్టజన్ముఁడన్
మానినికోడి యిట్లు దయమాని అకుంఠిత సత్యదీక్షకై
ప్రాణసమానపుత్రు నెడబాయుదు నెట్లు వరమ్ము లా గతిన్
దానము చేయు నవ్వ డయొ తత్పరిణామ మ దిట్టు లౌట నా
మానసమందు లేశ మనుమానము దోచ దికేమి చేయుదున్. 35

గీ. అనుచు నెంతయు విలపించు జనకుఁ గాంచి
దీనికై తండ్రి! ఇంత చింతింప నేల?
నీదు సత్యవ్రతంబును నిల్పువాఁడ
కాన కేగెద దుఃఖమ్ము మాను మనుచు. 36

గీ. తండ్రి సత్యంబు– కై కేయితల్లి కోర్కె
తీర్పగా నెంచి సత్యప్రతిజ్ఞ చేసి
తండ్రి నోదార్చి అతని సంతాప మడచి
తల్లి కౌసల్య కెఱిగింపఁ దరలినావు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర. 37

గీ. అచట మీ తల్లి కౌసల్య అంతిపురిని
మదిని నెంతయు తనయు నభ్యుదయ మెంచి
విప్రవరులను రావించి విష్ణుపూజ
చేయుచుండంగ నీవు విచ్చేసినావు. 38

గీ. తల్లి కౌసల్య పాదపద్మముల కెరఁగి
మందహాసమ్ము మోమున నందగింప
ధీరభావాబ్ధిశోభి గంభీరమూర్తి
ఇట్టు లంటివి కలతలేనట్టి ఫణితి 39

## శ్రీరామచంద్రుడు తల్లి నోదార్చుట

గీ. అమ్మ ! భరతుని యౌవరాజ్యాభిషిక్తుఁ
జేయ వరమును గోరె కైకేయి మాత
నయము తప్పక నే పదునాలుగేండ్లు
వనము నందుండ రెండవ వరము గోరె. 40

గీ. అనుచు వచియించితివొ లేదొ అంతలోనె
ధరణి వ్రాలెను కదళికాతరువు వోలె
మూర్ఛ పడి లేచి దుఃఖాబ్ధి మునిగి యామె
కంఠరుద్ధాశ్రు గద్గదకంఠి యగుచు, 41

గీ. అగ్రజుండవు నీవుండ అవరజునకు
రాజ్య మెట్లిచ్చె- కైక వరమ్ముఁ గోర
రాజ్య మిచ్చిన ఈగాక రాజు నిన్ను
అడవులకుఁ బంపఁ గారణం బరయఁజాల: 42

గీ. తనదు సుతునకు రాజ్యమ్ము తాను గోరె
కైక కానిమ్ము నా సుతు కాన కంప
ఆమె కధికార మెక్కడి దదియుగాక
జనకుఁ డెట్టులు దానికి సమ్మతించె ? 43

గీ. తనయ ! నిను వీడి నే నొక్కక్షణము గూడ
బ్రతుక- ననుగూడ గొనిపొమ్మరణ్యమునకు
తండ్రి యాజ్ఞను శిరమున దాల్తు వౌర !
తల్లి బ్రతుకును మదిలోనఁ దలప వేమి ? 44

గీ. తల్లి ! జనకుండు వృద్ధుఁ డాతని సపర్య
చేయు టది నీకుఁ దగును యోచింపుమమ్మ !
సత్యదీక్షావ్రతుండు మా జనకుఁడమ్మ !
దాని దీర్చుట పుత్రకృత్యమ్ము గాదె ! 45

గీ. ఏల చింతింతు విటు పదునాలు గేండ్లు
ఇట్టె గతియించునమ్మ ! నే నిట్టె వత్తు
రాజులకుఁ జూడ రాజ్య మ్మరణ్య మొకటె
అంపు మో యమ్మ ! ప్రేమ దీవింపు మమ్మ ! 46

గీ. అనిన నీ మాట సుతకు కాదనఁగలేక
కన్నుగవ అశ్రుజలములు కారి పార
ఎట్టకేలను మనసును గట్టిపఱచి
గొంతు గద్గదికము చెంద వంత మునిగి
తలను నిమురుచు దళము కొందలము నడచి
శిరము మూర్కొని ఇట్టు లాశీర్వదించె. 47

గీ. పంచభూతమ్ము లష్ట దిక్పాలవరులు
సూర్యచంద్రులు నాదివిష్ణుండు శివుఁడు
నిన్ను రక్షించుగావుత ! నిండు కూర్మి
అఱిగి రావో యిదే శుభమస్తు ! నీకు. 48

గీ. తల్లి నోదార్చి భక్తి ప్రదక్షిణించి
శీర్షమును వంచి ఆమె ఆశీస్సు లంది
జనకరాజన్యతనయ భూజాత సీత
చూడ నేగితి గాదె విశ్రుతచరిత్ర !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 49

## లక్ష్మణుఁడు కోపపారవశ్యమున ఆడినమాట

గీ. కైక కోరిన వరముల కాదునాక
సత్యదీక్షానువర్తి భూజాని యిడుట
తల్లికౌసల్య శోకసంతప్త యగుట
కాంచి కోపమ్ము చెంది లక్ష్మణుఁడు నంత. 50

సీ. అన్న! అగ్రజుఁడవు నీవ అవుదు గదె!
మహితపైతృకప్రాజ్యసామ్రాజ్య మెల్ల
జన్మతోడుతనే నీకు సంక్రమించె
కైక కది కోరుటకు నధికార మేది
తండ్రికైననుఁ ఈయ సాధ్యమ్మగునె? 51

గీ. ఖడ్గమును దూసి ఆ కైకకంఠ మిపుడ
ఖండనము చేసి తండ్రిని గట్టివైతు
మాతృహంతకుఁ డౌర! లక్ష్మణుఁ డటంచు
మచ్చ వచ్చిన అది నాకు వచ్చుగాక
అధివసింపుము రాజసింహాసనమున. 52

గీ. భరతుఁ డొకవేళ ఎదిరించి వచ్చునేని
దారుణంబైన ఈ ఖడ్గధారతోడ
వాని శిరమును ఖండించి వాని బంధు
వర్గమును గూల్తు ఈ కరవాలధార. 53

## శ్రీరాముఁడు లక్ష్మణుని కోపమును చల్లార్చుట

గీ. అనుచు కసరున బల్కు లక్ష్మణుని గాంచి
ఏమి తమ్ముడ! మతి చలియించె నేమి?
తల్లి కైకను జంప చిత్తమున దలప
తండ్రి బంధింపఁ దగునె సద్ధర్మమూర్తి. 54

గీ. మాతృపితరులకంటె సామ్రాజ్యలక్ష్మి
ఎక్కువంచును నీ మది కెట్లు తోచె!
ప్రాజ్యరాజ్యమ్ము బుద్బుదప్రాయ మరయ
తనువులా చూడ- ఇవి శాశ్వతములు గావు. 55

గీ. జరయు మృత్యువు ఎదుట తర్జనము చేయ
క్షణసుఖంబులు భోగభాగ్యములు గావె
ప్రబలకోపమ్ము నిరయకూపమ్ము సుమ్ము!
శాంతిమించిన ప్రాజ్యరాజ్యమ్ము లేదు
చాలు చాలింపు నీదు ప్రజ్ఞాబలమ్ము. 56

గీ. అనిన లక్ష్మణుఁ డెంతొ భయమ్ము నంది
అన్న! మన్నింపు మన్న! నీయందు భక్తి
అంటి నా రీతి కోపమ్ము నావలేక
అజ్ఞభావంబు నీదు దివ్యప్రబోధ
తొలఁగ మదిలోని కలతయు తొలఁగిపోయె. 57

గీ. తమ్ముఁ డా రీతిఁ బల్కి పాదముల వ్రాల
అతని భక్తికి మది మెచ్చి ఆదరమున
కౌఁగిటను జేర్చు టది నేను గాంచినాను
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 58

## శ్రీజానకీ నిరీక్షణము

సీ. శ్రీజానకీదేవి శృంగారసౌధగో
పురపాళి చెలిమిఫూఁబోండ్లు గొలువ
రాపుండు తా యౌవరాజ్యాభిషిక్తుఁడై
ఛత్రాదిరాజలాంఛనము లొలయ

మహితసామంతభూమండలేశులు గొల్వ
భటవర్గములు బరాబరులు సల్ప
విరుబోణు లిరువంక వీచోపు లిడుచుండ
రథికుఁడై బహుళ సంరంభమెసఁగ
ఎలమి నేతెంచునంచుఁ దా నెదురుచూడ
మోముదమ్మిని చిఱునవ్వు మొలకలెత్త
పాదచారిగ రావె భూపాలమౌళి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 59

## వనవాసమునకు రాఁదగదని రాముడు సీతను వారించుట

## సీత - అభ్యర్థనము

సీ. జానకీ ! నన్ను భూజాని దండకరాజ్య
పరిపాలనార్థంబు పంపుచుండె
పదునాలుగేండ్లట పాలించి మునికోటి
మరలి వచ్చెద మాటతిరుగ నెపుడు
శ్వశ్రూశ్వశురులకు శుశ్రూష - అతిథి భక్తి
చేయుమా ! అనుచు వచించునంత
ముఖపద్మమున కోపముద్ర యించుక తోప
మనుజేంద్ర ! పెక్కు రామాయణముల
వింటి నెందును సీతను వీడి రాముఁ
డొక్కఁ డడవికి పోయిన చిక్కు గలదె ?
కార్యసాధనమగుదునేఁ గష్టపెట్ట
ధర్మచారిణి వీడిపో ధర్మమగునె ?
నేను వచ్చెదననియె దా నిండుమదిని
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 60

గీ. అడవి కెట్టులు వత్తువో అవనితనయ !
ఘోరరాక్షసు లుందురు - క్రూరమృగము
లెల్లెడన్ సంచరించును యెఱుఁగ వకట
అంతిపురి గాదు సాంద్రమౌ అడవి సుమ్ము.
రాజభవనంబు గాదది రాళ్ల ముళ్ల 61

గీ. ప్రభులు మీరుండ నన్ ఘోరరాక్షసులును
క్రూరమృగములు దరికైన చేరఁగలవె !
ముళ్లు రాళ్లందు నంటిరి మునులు లేరె !
అనుమతించుఁడు మిమ్ము నే ననుసరింప. 62

గీ. నాథ ! మీ రేగ - పుర మరణ్యంబు నాకు
రామ ! మీరున్న వనమె పురమ్ము నాకు
కార్యముల్ దీర్తుగాక ! నన్ గాదు నాక
వనికి గొనిపొండు నాకు నీ వరము నిండు. 63

## లక్ష్మణుని అభ్యర్థన

గీ. అన్న ! నన్నును గొనిపొమ్ము ! అచట నేను
నిన్ను వదినెను సేవింతు నిండు భక్తి
నిన్ను విడనాడి ఒకఁడ నే నెన్నడైన
ఉన్నవాఁడనె ! మీతోడ నుందు వనిని. 64

గీ. అనుగు తమ్ముఁడ లక్ష్మణా ! ఔను గాని
పూజ్యమాత సుమిత్రను, పుణ్యశీల
లలితగుణరూపవతి యూర్మిళావధూటి
నడిగి వారల అనుమతినంది రమ్ము. 65

గీ. అంత సౌమిత్రి తా సుమిత్రాంబ కేరఁగి
అన్నతో నేను నేగెద నమ్మ ! వనికి
అనుమతింపవె ! ఆశీస్సు లమ్మ ! యీవె
అనుచు వేడంగ ఆ తల్లి అతని కనియె. 66

## సుమిత్ర అనుమతి - సందేశము

గీ. రాము గాంచుము దశరథరాజు నట్లు
సీతఁ గాంచుమ ! నన్నుగా మాతృబుద్ధి
ఓయి ! గనుమోయి వనము నయోధ్యగాను
పొమ్ము లక్ష్మణ శుభమస్తు ! పోయి రమ్ము. 67

గీ. అన్న లక్ష్మణ ! ఊర్మిళ చిన్నదోయి !
నీదు విరహంబు సహియింపలేదు గాదె !
నేను నీ కోర్కె యెట్లొ మన్నించినాను
కాని ఊర్మిళ ఒప్పునే కానకేగ. 68

గీ. బావగారన్న ఆమెకు భక్తి మెండు
అక్క జానకి తానును ఒక్క తనువు
కనుక ఊర్మిళ తా నొప్పుకొనునో యేమొ
ఆమె అనుమతి గొని మీద నరుగుమోయి ! 69

## లక్ష్మణుఁడు ఊర్మిళ అనుమతి గొనుట

గీ. అమ్మ అనుమతి ఆశీస్సులంది అతఁడు
ఊర్మిళాసతి నోదార్చి కూర్మి పలికె
బావగారన్న నీ కెంతొ భక్తి గాదె
అనుమతింపవె నే నన్న ననుసరింప. 70

గీ. వత్తు- ఊర్మిళ ! పదునాల్గువత్సరములు
దాటినంతనె నీవు నందాక- వినుమ
అత్త మామల సేవించు మమల భక్తి
ఇట్టె గడచును పదునాలుగేం డ్లదెంత ! 71

గీ. ఏను మీ దాన ఎదురాడుదాన గాను
అన్నవదినెల సేవింపఁ దధికభక్తి
అదను చిక్కిన వేళ మీ హృదయమందు
"ఊర్మిళ"ను గాంచుఁ డనుచు నిట్టూర్పు పుచ్చ
సాశ్రులోచన అగుచుఁ దా ననుమతించె. 72

## సీతారాములు వనవాసమున కేగునపుడు తమ ధనమును బ్రాహ్మణులకు- దాసదాసీజనమునకు దానము సేయుట

గీ. గురువసిష్ఠులవారిని గురుని సతిని
వేదవేదాంగవిదులైన విప్రతతిని
దాసదాసీజనంబు లందఱిని బిలిచి
జానకీదేవి నీవు లక్ష్మణుడు మువురు. 73

ఉ. మీ సకలార్థసంపదలు మీవగు మౌక్తికరత్నహారముల్
భూసురకోటి కందఱకు భూరిధనంబులు పంచి యిచ్చి ఆ
దాసజనాళి కందఱ కుదారగతిన్ ధనరాశు లన్నియున్
దోసిట నెత్తియిచ్చి పరితుష్టులఁ జేయుచు దండకాటవీ
వాసము చేయ మువ్వురును వచ్చిరి తండ్రిని కైక జూడగన్.

## కైకేయి మువ్వురకు వల్కలముల నిచ్చుట

ఆ. కైక యిమ్ము చూచి కఠినాత్మయై లేచి
వల్కలాజినములు వచ్చి యీయ
వాని నంది స్వర్ణవస్త్రముల్ విడనాడి
దాల్చినారు నీవు తమ్ముఁ డెలిమిఁ. 75

ఆ. కాని వానినంది జానకి నానచే
కట్టలేక నిన్ను గాంచుచుండ
నీవ ఆమె మేన నిండుగ జుట్టిన
చూచి దశరథుండు సొమ్మసిల్లె. 76

సీ. అంతిపురిలోన నున్న ఆ కాంత లెల్ల
కన్నుదోయిని అశ్రులు కార్చి పొక్క
గురువశిష్ఠుఁడు కనుగొని కోపమంది
కైక! రాముని నొక్కనిన్ గానకేగ
వరము కోరితి సీతకు వల్కలములు
తగునె యీయఁగ తా సతీత్వమునఁ జేసి
జనకనందిని పతితోడ వనికి నేగు
మహితసౌదర్యగరిమ లక్ష్మణుఁడు నేగు
వారి కీయంగఁ దగు నొకో వల్కలములు ? 77

సీ. అనెను మీ తండ్రి దశరథజనవిభుండు
అమితమౌక్తికరత్నహారాదులెల్ల
దాల్చి విమలంపు స్వర్ణవస్త్రములతోడ
జానకిస్నుష యేగ నాజ్ఞల నొసంగి
రథముతోడుత నేగు దరణ్యములకు

అని సుమంత్రుని గనుగొని ఆజ్ఞసేయ
రత్నరంజితమౌ స్వర్ణరథము తెచ్చి
ఎదుట నిల్పెను దుఃఖమ్ము మదిఁగలంప
నీదు జనకుండు కన్నుల నీరుజార
నిలువశక్తియు లేక తా నేల గూలె
అంతిపురినుండి నే నిదియంత చూచి
కలతచెందితి మిగుల దుఃఖమునఁ గుంది. 78

## దండకవన గమనము

సీ. సత్యవాచాబద్ధు జనకు నాశ్వాసించి
తల్లి కౌసల్య ఉత్తలమడంచి
క్షణకోపరూక్షలక్ష్మణుని శాంతిల జేసి
జనకాత్మజాత నిశ్చయ మెఱింగి
శ్రీమత్యరుంధతీ శ్రీవసిష్ఠులవారి
పాదాబ్జముల బ్రాలి ప్రణతి చేసి
శ్రీవామదేవాది శిష్టభూసురకోటి
సేవించి వారి ఆశీస్సు లంది
మంత్రివరుఁడైన అల్ల సుమంత్రుఁ డల్ల
రథము నడుపంగ ఆరణ్యరాజ్య మేల
జానకీదేవి అనుజులక్ష్మణులతోడ గూడి
వెడలితివి గాదె దారుణవిపినములకు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 79

## పౌరుల దుఃఖము

సీ. రాజాధిరాజు శ్రీరామభద్రుండదె
వల్కలంబులు దాల్చి వచ్చునేమొ !
శ్రీదేవి కెనయైన సీతామహాదేవి
పతివెంట నడచిరా కత మదేమొ !
శస్త్రాస్త్రములు దాల్చి సౌమిత్రి తలవార్చి
అగ్రజువెంట దాఁ నరుగునేమొ !
దశరథేశ్వరుని యంతఃపురమ్మున కైక
రోసించి విఘ్నంబు చేసెనేమొ !
అనుచు పౌరులు పురవీథులందు నిలిచి
తిట్టిపోసిరి కైకమ్మ తీరులెంచి
కంటి నదియెల్ల వీనుల వింటినయ్య !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 80

సీ. ఎండ కన్నెఱుఁగని ఇల్లాలు సీతమ్మ
నడివీథి పడి తాను నడచె నకట !
రాజవేషం బుడ్గి రామచంద్రుం డేమి
వల్కలంబులు గట్టి వచ్చె నకట !
లక్షణాన్వితుఁడైన లక్ష్మణుం డిది యేమి
వనసీమ కరుగంగ వచ్చె నకట
భరతుండు సద్గుణభరితుండు పురిలేమి
ఎట్టివి నగరులోఁ బుట్టె నకట !
ఏమి విధివైపరీత్యమ్ము ఎంత తెచ్చె
అనుచుఁ గన్నీరు కార్చినా రఖిలజనులు
రాముతోడుత మనము పురమ్ము వీడి
అడవి కేగుద మనుచు నాయత్తపడరె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 81

గీ. రథము నిల్పుమ ఓ సుమంత్రా ! యటంచు
రాజు వారింప తాను దూరముననుండి
రథము పోనిమ్ము వే సుమంత్రా యటంచు
హెచ్చరించుచు పురవీథి నేగినాడు. 62

గీ. అంతిపురికాంత లెల్ల సౌధాంతరముల
నిలిచి మీ రేగు రథము కాన్పించుదాక
కనుల దుఃఖాశ్రుకణములు క్రమ్మి జార
కాంచినారలు మిగుల దుఃఖించినారు. 63

గీ. పౌరులెల్లరు— శ్రీరామభద్ర ! యిట్లు
మమ్ము విడనాడి చనుట న్యాయమ్మె నీకు
ఏము వచ్చెద మాయరణ్యసీమ కనుచు
వచ్చువారల వారించి పుచ్చి చనవె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 64

గీ. రాజభవనంబులన్ దాటి రాజవీథి
దాట కిరుపంక పౌరులు బారుతీరి
పోరు పోరుస వీడ్చి కన్నీరు కార్చ
గవనులన్ దాటి శృంగాటకములు దాటి. 65

గీ. రాజవీథులు పురమందిరములు దాటి
వనములన్ దాటి ఉద్యానవనములు దాటి
పొలిమెన్ వీడు సాకేతపురము దాటి
రథము గమియించె గాంగతీరమ్ము చేర. 66

## గంగాతీరము – భాగీరథి స్వాగతము

సీ. కమలకల్హారసుగంధబంధురమైన
మందానిలంబును ముందు బంపి
కలహంసకోయష్టికవికులంబులు నల్పు
కలకల స్వనముల పలుకరించి
అలికులమ్ముల మంజు కలఝుంకృతమ్ముల
తనదైన పూర్వబాంధవము దెల్పి
రంగదుత్తుంగతరంగహస్తము లెత్తి
గంగాస్రవంతి స్వాగతము పల్క
చేరి యానందమెసఁగ తత్తీరభూమి
జానకీదేవి తమ్ములక్ష్మణులతోడ
స్యందనముడిగ్గి భక్తి జాహ్నవికి మ్రొక్కి
జలములన్ గ్రోలి కొంత విశ్రాంతి గొనవె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 87

గీ. ఓయి! దొర! వచ్చె రాము డయోధ్యనుండి
తమ్ము లచ్చన్న అలు సీతమ్మతోడ
తేరుదిగి గంగగట్టున– నీరుత్రాగి
కూడుచున్నారు లేమావిగున్న క్రింద. 88

క. అని తనవారలు దెల్పఁగ
వినినంతనె గుహుఁడు వచ్చె వినయం బెసఁగన్
తన దొరసానియుఁ జెలులును
జనుదెంచిరి పూలుపండ్ల సజ్జలతోడన్. 89

## గుహుని రాక

సీ. నెమిలి పింఛముల గుచ్ఛముల శీర్షములందు
 మురువుగా నుష్ణీషములను జుట్టి
వైయాఘ్రచర్మముల్ వల్కలాజినములు
 ముచ్చటగా గట్టి మొలకు జుట్టి
బిరుసైన యురముల గురివెంద దండలు
 గవ్వపేరులతోడఁ గలయ గట్టి
విల్లమ్ము లీటెలు విచ్చుకత్తులు బల్ల
 ములు కోలలున్ హస్తములను బట్టి
కాలుపోతుల కొమ్ము బాకాలతోడ
శబరయోధులు గొలువంగ సంభ్రమమున
నతులు సాష్టాంగదండప్రణామములను
సలుపుచును వచ్చె గుహుఁడల్ల శబరరాజు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! ౯౦

సీ. గుహుఁడు త్వత్పాదాంబురుహము లానందాశ్రు
 జలముల మునుముందు చక్క గడిగి
కమలసౌగంధసుగంధబంధుర మైన
 గంగాంబువులతోడఁ గడిగి యొత్తి
మందారకల్హారమల్లికామాలతీ
 పుష్పంబులను భక్తి పూజచేసి
మణిగణంబులు శుభ్రమౌక్తికంబుల నెన్నొ
 తెచ్చి బత్తిని కానుకలిచ్చి మెచ్చి
కమ్మదనమును గ్రమ్ము ఫలమ్ము లిచ్చి
కందమూలమ్ము లందించి విందుసేసి
మురిసిపోవుట గాంచి నే మురిసిపోతి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! ౯౧

గీ. రమ్ము శ్రీరామ ! మా మందిరమున కీవు
పావనము సేయుమయ్య నీ పాదధూళి
నీదు రాజ్యంబె ఇది గాదె నిర్మలాత్మ !
పాలనము సేయుమమ్ము భూపాలమౌళి ! 92

గీ. అనుచుఁ బ్రార్థింప నీవును అతని గాంచి
సఖుఁడ ! నీ భక్తి మెచ్చితే జనపదమున
వాసమును జేయ - పదునాల్గు వత్సరములు
నాదు వ్రతమిది నమ్ము మన్యమ్ము గాదు. 93

గీ. అంట నా రేయి దర్భశయ్యలను బండి
వేకువను లేచి స్నానాదివిధులు తీర్చి
స్నిగ్ధలేశంబులను వటక్షీరములను
జడలు సవరించినారు లక్ష్మణుఁడు నీవు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 94

## శ్రీరామచంద్రుడు - మంత్రి సుమంత్రుని అయోధ్యకు పంపివేయుట

సీ. మంత్రిపుంగవు నా సుమంత్రుఁ జేరఁగ బిల్చి
పిలపించు నతని చేతులను బట్టి
జలజలమని బాష్పజలము కన్నుల రాల
కంఠమ్ము గద్గదికమ్ము గదుర
జననీ - జనకులకు - సాష్టాంగనతు లేము
చేసినట్టులు మనవి చేయుమోయి !
మమ్ముగూర్చి దుఃఖాబ్ధిమగ్నులై విలపించు
తల్లిదండ్రులను ఓదార్చుమోయి !

పదియునాలుగేఁడ్లు వసియించి వనములోన
తిరుగ వచ్చెదమని నీవు చెప్పుమోయి !
మరలు మీరింక శోకమ్ము మానుమోయి !
అనుచు నాతని పురికి నీ వనిచినావు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 95

## గంగావతరణము

గీ. గంగఁ దరియించి అవ్వలిగట్టు కేగి
అల భరద్వాజు దర్శింపవలయు మేము
అనుడు గుహుఁ డేగి నౌక నాయత్తపఱచి
తెచ్చి నిల్పెను వేగ తత్తీరమందు. 96

గీ. జానకీదేవి నీదు భుజంబు నూని
నౌక దా ముందు నధిరోహణంబు సేసె
తమ్ముఁడున్ నీవు గుహుబాహుదండమాని
నావ నారోహణము చేసినారు గాదె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 97

సీ. శబరాధినాథుండు స్వయము తెడ్డును బట్టి
నడుప రాజోచితనౌక నెక్కి
రంగదుత్తుంగతరంగగంగను దాటు
నవసరంబందున— అవనిజాత
పసుపుకుంకుమపూలుఫలములు సర్పించి
"చల్లగా గంగమ్మతల్లి ! మేము
పదునాలుగేడులు వనవాసమును సల్పి
తిరుగ రా నాశీర్వదింపు మమ్మ"

అనుచు గురుభక్తి ప్రార్థించి అంజలించి
గాంగజలముల కన్నీరు కడిగికొనియె
ఓడ అంతట అవ్వలియొడ్డు చేర
అవతరించిరి మువ్వు రాయాన ముడిగి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 98

## గుహుని భాగ్యము

క. ఇనకులతిలకా ! రామా !
విను మీ లక్ష్మణునియట్లు విపినమ్ములకున్
నను గొనిపోవఁగ వేడెద
ఆనయము మీ సేవజేయ నానతి నిమ్మా ! 99

ఆ. అనుడు గుహునిభక్తి కాశ్చర్యమును జెంది
గాఢముగను నతని కౌగలించి
వత్తు మరల నిటకు వనవాసమును దీర్చి
ఆగు మనుచు నతని నాపి చనవె. 100

గీ. మునులకైనను ఎంతటి ఘనులకైన
అబ్బునే నీదు కౌగిలి అనఘచరిత !
గుహుని కబ్బెను నీ యుపగూహనమ్ము
ధన్యతను గాంచె నాతఁ డనన్యభక్తి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 101

## భరద్వాజాశ్రమము

సీ. పచ్చిపచ్చిక ... పచ్చిక మేయుచు
మోమెత్తి జానకిమోము చూడ
పురివిప్పి తమదు సొంపుం బెంపు రూపింప
నెమ్మలు నెమ్మి నృత్యమ్ము సేయ

పరిపక్వఫలములు భక్షించి చిలుకలు
రామ ! రామ ! యటంచు రక్తిఁ బలుక
కెంపాడు క్రొమ్మావి కిసలయమ్ములు మెక్కి-
గొంతెత్తికూయ పుంస్కోకిలములు
ఆశ్రమోపాంతభూమిగా నరసి మీరు
ద్వారముననుండఁ గని భరద్వాజమౌని
అర్ఘ్యపాద్యాదు లందిచ్చి అధికభక్తి
స్వాగతము పల్కెగాదె సుస్వాంతుఁ డగుచు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 102

సీ. తమితోడ నట భరద్వాజమౌనీంద్రుఁడు
తన శిష్యగణము సన్మునులు గొలువ
ఆశ్రమంబున మీకు ఆతిథ్యమును జేసి
తన జన్మ ధన్యమంచును వచించె
మునిజనగోష్ఠి నా దినమెల్ల గమియించి
మునియొద్ద సెలవు గైకొని కడంక
మరునాడు ముని శిష్యవరులతో వఱువాత
పయనించి యమునాస్రవంతి గాంచి
తరణయోగ్యంబు నౌదొక తరణి గాంచి
మునికుమారుల సాహాయ్యమునఁ దరించి
వారలం బంపి మువ్వు రా దారి నడచి
చిత్రకూటాద్రిపాదంబు చేరినారు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 103

## చిత్రకూటాద్రి

సీ. [illegible]సంగపక్షిలాస్యముల మించు
రాజవంశంబుల రాజసమ్ము
[illegible] తీవెల్లితమంజుకుంజమ్ముల
విహరించు భ్రమరాళి విభ్రమమ్ము
శ్యాపు భూమిజచ్ఛాయాశ్రితములైన
ఏణీగణంపు నిరీక్షణమ్ము
[illegible]సమ్రమతరుశాఖల రమించి
శుకశారికాముఖచుంబనమ్ము
[illegible]న కీచకరంధ్ర సంగీతరవము
గిరిశిరస్స్రుతవిమలనిర్ఝరుల మ్రోత
[illegible] [illegible]లార వీనుల వినుచు నిలచి
చిత్రకూటాద్రి శోభ కచ్చెరువు గనరె
[illegible]మ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 104

## వాల్మీకి ఆశ్రమము

సీ. [illegible]తమ్ము ఫలవృక్షకలితమ్ము శాంతమ్ము
శాంతవైరాశ్రిత జంతుగణము
మాల్యవతీతీర మంజుకుంజమ్ముల
విహరించు బహువిధ విహగగణము
[illegible]స్త్రకుశమూలకలితహస్తమ్ముల
చరియించు సత్బ్రహ్మచారిగణము
[illegible]ధ్యానసంస్థులై దరనిమీలితనేత్ర
ముద్రాంచితాత్మ సన్మునిగణమ్ము

అగుచు చెలువొందు వాల్మీకి ఆశ్రమమ్ము
చేరి తమరాక గురులకుఁ జెప్పఁ డనుచు
శిష్యులను బంప వాల్మీకి శీఘ్రగతిని
వచ్చి స్వాగత మతిభక్తి నిచ్చె గాదె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 105

సీ. శ్రీరామ ! రఘురామ ! శ్రీజానకీరామ !
ధన్యుండనైతి త్వద్దర్శనమున
పూర్వజన్మార్జిత పుణ్యంబు ఫలియించె
పావనంబయ్యె తపోవనంబు
బ్రాహ్మణబ్రువుఁడనై పతితుండనౌ నేను
త్వన్నామజపశక్తి తపసి నైతి
తావక నామప్రభావంబునకు సర్వ
జగతికి నేన సాక్ష్యమ్ము సుమ్మ
అనుచు స్వాగతమును బల్కి ఆదరించి
అర్ఘ్యపాద్యాదు లిచ్చి అర్చనేసి
కొంతకాలమ్ము అందుండఁ గోరెఁ గాదె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 106

పర్ణశాల

సీ. మొదలంటఁబండి గుమ్మన వాసనల్ గ్రమ్మ
పండ్లతో నిండిన పనసతరులు
నిండాపఁబండిన నిలువెత్తు గెలలతో
కమ్మవలపులు గొలుపు కదళికలును
దళమైనకొమ్మ నందుప్రేలు గోలలతో
చెలువారు చేయెత్తు చెన్నగులును

కష్మనివాసనల్ క్రమ్మి అసల రేపు
క్రమఫలమ్ముల ఆశ్రమములును
కుందమందారసిందూరకోవిదార
కనకకరవీరమాలతీకాంచనాది
తరులతాదులు వెలయు ప్రాంతమ్మునందు
ఆశ్రమమ్మున మునియాజ్ఞ నశ్రమమున
పర్ణశాలలు నిర్మింపఁబడియె మీకు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 107

## సౌమిత్రి పరిచర్య

సీ. మాల్యవతీనదీమధురాంబువులు దెచ్చి
ఫలపుష్పములు కోసి భద్రపఱచి
పరిపక్వపనసామ్రఫలములు గొనితెచ్చి
ద్రాక్షారసంబులు ద్రావనిచ్చి
కందమూలంబుల నెందెందొ గొనివచ్చి
తేనియ దొన్నెల తెచ్చియిచ్చి
చిపురుమొత్తమ్ముల సెజ్జలు సవరించి
ఐణేయచర్మమ్ములందు పఱచి
వదినె సీతమ్మ - తల్లిగా మదిని దలఁచి
అన్నవౌ నిన్ను జనకునియట్ల గొలిచి
భక్తిసేవించు సౌమిత్రి భద్రమూర్తి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 108

సీ. తెలతెలవార పక్షుల కలకలరావ
ముల మేలుకొని కాలకృత్యములను దీర్చి
అనతిదూరస్థ మాల్యవతీనదీ నిర్మ
లాంబుధారలను స్నానంబు చేసి

సవితకర్ఘ్యము లెత్తి సాంధ్యకృత్యము దీర్చి
పూజాదివిధులను బూర్తి నేసి
తమ్ముఁ జూడఁగనెంచి తమితోడ నేతెంచు
మునిపుంగవులతోడ ముచ్చటించి
పుణ్యమునిపల్లె సాకేతపురముగాగ
పర్ణశాలయె రాజభవనముగాగ
చిత్రకూటాద్రిచెత నిశ్చింతవృత్తి
నెమ్మిఁగడపరె కొంతకాలమ్ము మీరు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 109

## శ్రీ జానకీదేవి

సీ. రేపాడి పసుపాడి శ్రీజానకీదేవి
అర్ఘోదితాదిత్యు కర్ఘ్య మిచ్చు
తనుగాత్రి క్షౌమవస్త్రము నిండుగా గట్టి
శ్రీగౌరి తాను పూజించు భక్తి
మాలతీమల్లికామంజులమాలల
లలిమీరగా ని న్నలంకరించు
పూవుబెత్తులను గొప్పను జక్కనవరించు
హరిణపోతములతో నాటలాడు
శారికాకీరములపల్కు చక్కదిద్ది
రక్తి పలికించు 'శ్రీరామ రామ' అనుచు
అంతిపురిలోన నున్నట్లు చెంతనుండి
సరసవచనోక్తి నీకు విశ్రాంతి గూర్చు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 110

## సుమంత్రుఁ డేతెంచుట

ఖిన్నాననంబుతో స్విన్ననేత్రములతో
ప్రత్యక్షదైన్యభావంబుతోడ
భగ్నమనోరథశుష్కదృగ్వీక్షణ
మూర్తిభవద్దైన్యమూర్తితోడ
కంపమానాంగవైక్లబ్యభావోద్వేగ
సంక్లిష్టగద్గదస్వరముతోడ
శోకవేగోద్విగ్నశుష్కతాలోష్ఠప్ర
నష్టచైతన్యాననమ్ముతోడ
[illegible] అశ్రులు కన్నుల వఱదలెత్త
[illegible] దుఃఖమ్మువలన డగ్గుత్తిపడగ
వంత [illegible]ంప నంత రాజాంతికమున
[illegible]కుంపఁగఁ బలికె సుమంత్రు డిట్లు
[illegible]ణ్యసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 111

ఏమి చెప్పుదు దశరథభూమిపాల!
[illegible]డుగును జనులెల్ల [illegible]రుతీరి
[illegible] రాముని గాంచి కన్నీరుకార్చి
[illegible]నారలు చాలగా మ్రొక్కినారు. 112

[illegible] మారీతి పోయి సాయాహ్నమునకు
[illegible] చల్లని జాహ్నవీతీరభూమి
[illegible]ముదిగి వారు గాంగనీరమ్ము గ్రోలి
[illegible]ని ఆతిథ్యము నందుకొనిరి ప్రీతి. 113

గీ. గంగ-తరియించుముందు నన్ గాంచి రాము
డశ్రుకణములు కన్నుల నావరింప
తల్లిదండ్రుల ఆర్తి నోదార్చుమోయి
అతులభక్తిని సాష్టాంగనతులు మేము
చేసినట్టులు వారికి చెప్పుమోయి 114

గీ. అచట నారేయి దర్భశయ్యలను పండి
వేకువను లేచి సంధ్యాదివిధులు తీర్చి
గారవమ్మున నన్నటఁ గాంచి పలికె
కంఠమించుక గద్గదికమ్ము చెంద. 115

గీ. మాతృపితరుల పాదపద్మముల మేము
భక్తి గావించు ప్రణతులు పల్కుమోయి !
మా వియోగమ్ముచే శోకమగ్నులైన
తల్లిదండ్రుల చేరి యోదార్చుమోయి ! 116

క. అని కనుగొలుకుల బాష్పప్ర
కణములు దిగజార ననుపగా వచ్చితి నో
జనవర ! జానకి యా ల
క్ష్మణు లట్టులె పల్కి రశ్రుకణములు దొరలన్. 117

గీ. పదియునాలుగేండ్లు గడచిన పిదప మేము
తిరుగవచ్చెద మనుచును దెల్పుమోయి !
అని వచించుచు నన్ను దా ననిచె రాజ !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 118

గీ. రాముఁ డేమనె ! ఏమనె లక్ష్మణుండు ?
సీత కౌసల్య క్షేమని చెప్పుమనియె ?
ఒతుంభక్తిని సాష్టాంగనతులు మాకు
తెల్పుమనినారె ! ఎంతటి ధీరమతులు. 119

గీ. పాపకర్ముండ శ్రీరాముఁ బంపి వనికి
బ్రదుకు దెట్టులు నే నింక బ్రతుకజాల
అనుచు- కౌసల్యగాంచి బాల్యంబునాటి
అంధమునిశాపవృత్తాంత మంత తెలిపె. 120

## అంధముని శాపవృత్తాంతము

గీ. యౌవనంబున నే మృగయార్థ మేగి
మాపువేళను నే పొదమాటునుండి
ఆలకించితి బుడ బుడ మనెడి రవము
వేఁటతమకంబునన్ వెనువెంట నేను 121

గీ. జంతు వేదియొ నను దెంచె జలము గ్రోల
అనుచు మదినెంచి ఆ శబ్ద మనుసరించి
శబ్దభేదిని నే శితశరముఁ బరువ
ఆర్తనాదమ్ము వింటిని "హా" యటంచు. 122

గీ. పరుగునన్ బోయి నేనట పడిన వడుచు
మునికుమారుని గనుగొని తనువు వణక
ఎంత పాపిష్ఠుఁడను నైతి ఎంత పనిని
చేసి తనుచును మునిపుత్రు చెంతఁజేరి
దశరథుండను నే నయోధ్యాధిపుండ
తప్పు మన్నింపు మో మునితనయ" యనుచు
ప్రార్థనము సేయ అతఁడు పలికె నిట్లు. 123

గీ. రాజ! వేవేగ నీవు నీరంబుగొనుచు
దప్పిగొనియున్న నా తల్లిదండ్రులకును
ఇచ్చి వారికి జరిగినదెల్ల దెలుపు
అజ్ఞభావాన ఈరీతి అగుటఁజేసి
నీదు దోషంబు వారు మన్నింపగలరు. 124

గీ. జలము గొనిపోయి నే నెల్ల దెలుప వారు
పుత్రశోకాన మిక్కిలి పొక్కియేడ్చి
పుత్రుకడకును మము గొనిపొమ్ము రాజ!
అతనితోగూడ మమ్ము దాహమ్ము చేయు. 125

గీ. అనిన వారల గొనిపోయి అచట జేర్చి
చితిని బేర్చితి వారి యానతిని జేసి
అగ్ని జొచ్చుచు మునివృద్ధుఁ డంత నన్ను
గాంచి ఈరీతిఁ బలికె దుఃఖమున మునిగి. 126

గీ. పుత్రశోకమ్ముతో మమ్ము బోలిఁ నీవు
మరణ మొందెద వనుచును తిరుగలేని
శాపమిచ్చెను నే దది దాపురించె
దేవి! పోయెద నే నింక దివికి నేడె. 127

గీ. రామ! శ్రీరామ! రావె శ్రీరామ! యనుచు
తనయు నిన్నెంతొ మదిలోనఁ దలచి దలచి
మౌనమునసుండి తుదిని రామా! అటంచు
తనువు విడనాడె దశరథధరణివిభుఁడు
అంతిపురినుండి నే నంత అరసినాను
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 128

క. అంత వసిష్ఠుం డది విని
అంతఃపురి జొచ్చి రాణులందఱ దుఃఖా
క్రాంతల నోదార్చుచు దా
నెంతయు దుఃఖించె దశరథేశ్వరు మృతికిన్. 129

## దశరథుని మృతికి పౌరుల దుఃఖము

క. అత్యవసర సభదీర్చి- అ
మాత్యులతోఁ జర్చ చేసి మంత్రిసుమంత్రున్
అత్యవసరమగు నా యా
కృత్యంబులన్ జేయ బనిచె కృత్యవిదుండై. 130

చ. పురజనులందఱున్ మిగుల పొక్కిరి క్రుక్కిరి, రాణివాస మం
దిరములు చిన్నవోయినవి, దీనత యెల్లెడఁ దాండవించె, సుం
దరమగు నా పురం బపుడు నాథుడుపోయిన కాంతనా నలం
కరణవిహీనమయ్యెనట క్రందుసెడెల్ పురవీథులంతటన్. 131

క. తిట్టిరి కైకను గొందఱు
పట్టగరానట్టి కోపభారముతోడన్
కొట్టిరి మంథరఁ గొందఱు
అట్టుదికినయట్టు నగరమంతయు నయ్యెన్. 132

## వసిష్ఠులవారి ఆదేశము

శా. రాజత్కాంచనపేటికాంతరమునన్ రాజేంద్రుదేహంబు సద్
రాజశ్రీ చెడకుండ నుంచగవలెన్ రాసాయనప్రక్రియన్
రాజన్యులు బహుమండలాధిపులు- ఈ రాజేంద్రు దేహంబుపై
పూజాపుష్పములుంచి భక్తిమెయి దా పూజింతు రెంతేనియున్.

గీ. రాజు లేనట్టి రాజ్యమం దరాజకములు
పుట్టవచ్చును - శత్రువు లిట్టితరిని
ఎత్తిరావచ్చు రాజ్యమం దెల్లయెడల
సైన్యముల నిల్పుఁడయ్య విస్తారముగను. 134

క. రక్షాదక్షుల సైనిక
రక్షాదళముఖ్యులెల్ల రాజదయోధ్యా
రక్షార్థము నియమింపుఁడు
రక్షణతో భరతు వేగ రప్పించవలెన్. 135

గీ. అని వసిష్ఠుఁడు మంత్రుల కాజ్ఞ లీయ
అక్షరాలను పాటించి రతని యాజ్ఞ
భరతుఁ గొనితేర అశ్వికబలములోన
దక్షులగువారిఁ బంపి రుద్దండబలుల. 136

గీ. వాయుజవమున నేగెడు వారువముల
అశ్వికులు దాము వేవేగ నరిగినారు
భరతుఁ డచ్చట మాతుల భవనమందు
ఏదొ దుస్స్వప్నమును గాంచి యెరియుచుండె. 137

## భరతుని కలతపాటు

గీ. అనుజ ! శత్రుఘ్న ! నేడు నా మన మదేమొ
కలతపడఁజొచ్చె తెలియదు కారణంబు
ఓయి ! మన తల్లిదండ్రు లయోధ్యలోన
ఎట్టులున్నారో ! ఇక మన మేగవలయు. 138

ఉ. అంత నయోధ్యనుండి జవనాశ్వము లెక్కి-
హుటాహుటిన్ భటుల్
శ్రాంతియులేక కేకయపురంబు బిజాన గమించి చేరి, సా
యంతనమందు మాతులగృహంబున నా భరతున్ నమించి, సం
భ్రాంతినిపీడి వాకొనిరి భవ్యవసిష్ఠులవారి అనతిన్. 139

గీ. రాజధానికి వేవేగ రమ్మటంచు
శీఘ్రగతి బంచినారు వసిష్ఠగురులు
తడవుసేయక ఇపుడ మీ తమ్ముతోడ
రావలయునయ్య శీఘ్రమ్ము రాకుమార ! 140

గీ. భరతుఁ డంతట మిగుల విభ్రాంతి చెంది
తండ్రిదశరథరాజమూర్ధన్యునకును
ఏమి వచ్చెనొ ! తల్లుల కేమి యయ్యె !
రామచంద్రున కే కీడు రాదు గాదె ! 141

క. అని మనమున శంకించుచు
తన తమ్మునితోడ గూడి తక్షణమందే
చని భరతుఁడు మాతులు గని
వినిపించె వసిష్ఠు నాజ్ఞ విహ్వలుఁ డగుచున్. 142

## అయోధ్యకు భరతుని ఆగమనము

క. కరితురగమ్ములు రథములు
వరమణిగణభూషకనకవస్త్రాదులు నా
దరమున కైకకు మేన
ల్లురకును దా నిచ్చి పంపె లోకులు మెచ్చన్. 143

చ. కరిఘటలున్ విచిత్రమణి కాంచనభూషణభూషితమ్ములౌ
తురగములున్ రథమ్ములును తూర్యనినాదములొప్ప పెల్లుగా
సురుచిరవేషలౌ గణికసుందరు లెందఱొ నాట్యమాడ, ఆ
భరతుని బంపె మాతులుఁడు భర్మరథమ్మున బంధురాజితో.144

గీ. ఎదురుగాలులు వీచెడు ఎడమకన్ను
ఎడమభుజమును నదరెడు ఏమి కీడొ !
పుడమి కంపించు దిక్కుల పొగలు క్రమ్మె
పరగ చుక్కలు దివి పట్టపగలె దోచె
ఏమి అశుభమ్మొ తమ్ముఁడా ఎఱుగమోయి ! 145

క. అనుచున్ మన మురియాడఁగ
చని చని ముందటను పాఱు సరయూనది ని
స్వనములు రోదనమట్టులు
వినిపించిన మదిని జాల విచలితుఁడగుచున్. 146

గీ. గిరులు వనములు నదులు నిర్ఝరులు దాటి
జాగుసేయక మార్గవిశ్రాంతి గొనక
ఏడుదినములు పయనించి ఏకధాటి
తా నయోధ్యను జేరె - కొందలముతోడ. 147

చ. ఎదుట నయోధ్య చూడు మదియే సరయూనది, యూపకోటి, అ
ల్లదె, పురగోపురం బదియె, అంబరచుంబివిశాలసాల మ
ల్లదె, గను రాజవీథి పురమంతయు నేదొ విషాదమగ్నమై
ఎద కెదొ బాధగొల్పు, అది యేల పతాకల దింపినారటుల్. 148

## భరతుఁడు జననిమందిరంబునకు వచ్చుట

సీ. భరతుండు సద్గుణభరితుండు శత్రుఘ్న
సహితుఁడై వ్యాకులస్వాంతుఁడగుచు
స్యందనారూఢుఁడై చనుదెంచి నిజపురి
నష్టలక్ష్మికమౌ నగరు గాంచి

అంతఃపురమున నేకాంతమందిరసీమ
ఖిన్నయైయున్న కైకేయి గాంచి
అమ్మ ! ఇట్లేల ఏకాంతమందిరమందు
ఉద్విగ్నహృదయవై యుంటివేల
జనకు లియ్యెడ నున్నట్టి జాడలేదు
చిన్నవోయెను నగరెల్ల చెన్నుదరిగి
అన్న శ్రీరామచంద్రుఁడు అవనిజాత
లక్ష్మణుండును గానంగరా రిదేమి ? 149

ఆ. కన్నకొడుకు భరతు గనుగొని కైకేయి
హొకతిచ్చి వాని నక్కుఁజేర్చి
కేకయాధిపతుల క్షేమంబు పృచ్ఛించి
రాజు మైతి వీవు రమ్మటంచు. 150

గీ. జరిగిపోయిన కథ యెల్ల జనని దెలుప
క్రోధసమ్మూర్ఛితుండయి క్రూరురాల
జనని వెట్లాదు నీవు రాక్షసివి గాక
కనఁగ రాదింక నీదు ముఖమ్ము గూడ. 151

గీ. అమ్మ ! ఎందును శ్రీరామునంతవాఁడు
లేడు లేదని గదె కొనియాడుచుందు
అట్టి రాముని వనమున కంపి తేల ?
కొడుకుకై యిట్టు రాజ్యమ్ము కోరనేల ? 152

గీ. ఇట్టి దుర్బోధ చేసినా రెవరు తల్లి !
వారి శిరమును ద్రుంతు నెవ్వారు గాని
దాది మంథర ఎక్కడ దాగియుండె
కుటిలబుద్ధుల బోధ గైకొనఁగఁ దగునె ? 153

క. ఇంతకు మంథర కారణ
మంతయు నిదె చేసెనంచు అంతఃపురిలో
అంతట నందఱు దెలుపఁగ
సంతాపము చెంది యంత శత్రుఘ్నుండున్. 154

గీ. మంథరన్ గాంచి కోపించి మండిపడుచు
చంపఁబోయిన నది చూచి జనని కైక
అడ్డుపడి నిల్చి శత్రుఘ్న ! ఆగుమోయి
ఆడుదానిని జంపరా దనుచు నాపె. 155

## భరతుడు తల్లికైకపై కోపము నందుట

చ. భరతుఁడు కోపతాపములఁ బట్టఁగలేకటు లుస్సురస్సురై
చురచురఁ జూచి కైక నయొ ! సుంత విచారము లేకపోయెనే
పరగుణు రామచంద్రు వనవాసము సేయఁగఁ బంపినా వెటుల్
పరుసదనంబునన్ జనకుఁ బంపితి వెట్టులు స్వర్గసీమకున్ ? 156

ఆ. కేకయేశుకీర్తి గీడ్పడఁ జేసితి
సూర్యవంశయశము శూన్యమయ్యె
పుట్టినింటి కిటులు మెట్టిన యింటికి
ఎట్టి మచ్చ తెచ్చిపెట్టినావె ? 157

గీ. నీదు గర్భమ్మునందు జన్మించుకతన
నాదు కీర్తిప్రతిష్ఠలు నష్టమయ్యె
కష్టజన్ముండనైతి నో కన్నతల్లి !
ముఖము నెట్టులు చూపు దీ పురమునందు. 158

ఆ. జనని ! ఏగెద నేను లక్ష్మణుని యట్లి
వన్యచీరమ్ములన్ దాల్చి వనికి నిపుడె
భర్త యిచ్చిన ఈ రాజ్యపట్ట మెల్ల
కైకకొమ్మవె తలపైని పెట్టుకొమ్ము. 159

## భరతుఁడు కౌసల్య గాంచ నేగుట

మ. అని - కౌసల్యను జూడఁబోయి భరతుం డా తల్లిపాదమ్ములన్
తన శీర్షమ్మును మోపి భక్తి జననీ ! నా దోష మిం దేమియున్
గనలే దమ్మ! ఎఱుంగనమ్మ యెదియున్ గాదేని భూదేవియున్
జననీ ! తావకపాదపద్మములు సాక్ష్యమ్మమ్మ సూర్యాదులున్.

మ. నారచీరంబులు గట్టి నేను నిపుడే వన్యస్థలిం జేరి ఓ
జననీ ! అగ్రజు పాదము ల్గడిగి రాజ్య మ్మెల్ల నొప్పించి, రా
మునిఁ దోడ్తెచ్చెద - చూడు మమ్మ ! యిచటన్ మోసమ్ము
లేదమ్మ ! ఈ
తనయున్ దీవెన లిచ్చి పంపు మదె నా తల్లిన్ నన్ను
మన్నింపుమా ! 161

## కౌసల్య భరతునితో ఆడిన మాటలు - భరతుని శపథము

క. అని భరతుం డన విని - ఆ
జనని గని కౌసల్య యెత్తి తద్దయు దుఃఖం
బున నేడిచి తనయా ! నీ
కిన మ్మిట్టిద యగును వంతమానుము వినుమా ! 162

క. వసుదేవియు రాముని గన
పసమించకున్ నన్నుఁ గొనుమ వానిని జూడున్
తపియించి రాముని జూడని
దినమొక యుగమగును నాకు దీనన్ గనుమా ! 163

గీ. ఈవు లేనప్పుడో భరత! ఇట్టులయ్యె
ఆమె నీ తల్లి చేసిన దేమి లేదు
దైవనిర్ణయ మట్లుండె తనయ! వినుమ
విధిని తప్పింపఁ దరమె ఆ వేధకైన. 164

## వసిష్ఠులవారు భరతు నోదార్చుట

క. అంత వసిష్ఠుఁడు వచ్చిన
సంతాపము మీర భరతశత్రుఘ్నులు దా
స్వాంతమ్ములు బహుదుఃఖా
క్రాంతమ్ములు గాగ నశ్రుకణములు గురియన్. 165

గీ. అతులభక్తిని సాష్టాంగనతులు చేసి
బాష్పజలముల గురుపాదపద్మములను
కడిగి తడియొత్తి నిలిచిన కౌగలించి
వారి నోదార్చె వేదాంతవాక్యసరణి. 166

చ. భరతకుమార! మృత్యు వనివార్య మదెంతటివారికైన— ఈ
ధరణివిభుండు సర్వవసుధాస్థలి అర్వదివేల యేండ్లు సత్
గురుతర ధర్మనిష్ఠను అకుంఠిత విక్రమరూఢి నేలి తా
సురపురిఁ జేరె దానికయి శోకము చెందక, ధైర్య మూనుమా!

## దశరథునకు సాంపరాయిక క్రియలు జరుపుట

గీ. సాంప్రదాయిక దేహసంస్కారవిధులు
సార్వభౌమున కుచితమౌ సరణి దీర్చి
బంధుజనములతోఁ గూడి బంధురముగ
సాంపరాయికకార్యముల్ సలుపుమయ్య! 168

మంత్రివర్యులతో సభామండపమున
మంతనమ్మును జేసి సామంతనృపుల
కఖిలసైన్యాధిపతులకు నిఖిలవిధుల
ఆజ్ఞ లీయంగవలెను రాజాజ్ఞ గాగ. 169

రాజదేహంబు స్వర్ణవస్త్రములతోడ
రత్నభూషణములతో నలంకరించి
రాజరాజేంద్రయోగ్యమర్యాద లొప్ప
పుష్పమాలాద్యలంకృతపుష్పరథము 170

నందు జేర్చి పుష్పమాలాదు లుంచి
రాజవీథిని హయభటరాజి నిల్పి
అంత్యయాత్రకు సన్నాహ మాచరించి
వేశముకొసగ్గ తూర్యనాదములతోడ. 171

సకలసైనికరాజన్యసచివబంధు
సంకులమ్ముగ పురయాత్ర సాగవలయు
అని వచించె వసిష్ఠుడు నంత వింటి
దివ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 172

భరతుడా రీతి గుర్వాజ్ఞ జరిపి, బంధు
జనములన్ గూడి రాజశ్మశానమందు
జనకు దేహాని కగ్నిసంస్కారవిధులు
జరిపి శత్రుఘ్నుతో శోకభరితుడయ్యె. 173

ద్వాదశాహమ్ము షోడశదానవిధులు
భూమిదానమ్ములున్ జేసి భూరిసంఖ్య
స్వర్ణముద్రాన్నదానముల్ సలిపె భక్తి
బ్రహ్మవిదులైన ఉత్తమబ్రాహ్మణులకు. 174

## వసిష్ఠులవారు భరతుని రాజసభకు రప్పించుట

ఉ. రాజపురోహితుండు మునిరాజు వసిష్ఠుఁడు- మంత్రులున్ మహా
రాజులు మండలాధిపులు రక్షణదక్షులు వాహినీపతుల్
రాజితరాజ్యపాలనధురంధరు లెల్లరు దన్నుఁ గొల్వ వి
భ్రాజితసద్గుణున్ భరతరాజును బిల్వ సుమంత్రు బంచినన్.

గీ. మంత్రరక్షణదక్షసుమంత్రమంత్రి
భరతుఁ గొనితేరఁ జని రాజభవనమునకు
రాజమర్యాద మెఱయ దన రాక దెల్పి
భరతు దర్శించి యిటు విన్నపమ్ము చేసె. 176

చ. గురువులు- మిమ్ము రాజసభకున్ గొనితేరగఁ బంపినార లో
భరతకుమార ! మంత్రులును పండితవర్యులు మండలాధిపుల్
నరపతులున్ వణిగ్వరులు నాగరముఖ్యులు సైనికాధిపుల్
వరగుణ! మిమ్ముఁ గాంచుటకు వచ్చి సభాస్థలి నుండి రండటున్.

గీ. భరతుఁ డంతట- తలదాల్చి గురుల యాజ్ఞ
మంత్రితోఁ జేరె వరసభామండపమును
సంభ్రమము దోపగా సభాసదులు లేచి
స్వాగతము తెల్పినారు సుస్వాంతు లగుచు. 178

క. అంత వసిష్ఠుఁడు భరతుని
చెంతను గూర్చుండజేసి శ్రీదశరథభూ
కాంతుఁడు సత్యవ్రతుఁ డ
శ్రాంతము, నీ కిచ్చె సకలసామ్రాజ్యమ్మున్. 179

చేయవలె నీకు- పట్టాభిషేక మిపుడె
అఖిలరాజన్యులున్ మండలాధిపతులు
మంత్రివరులును నిఖిలసామంతనృపులు
పౌరముఖ్యులు నిదె వచ్చినారు గనుమ! 180

## భరతుఁడు తన అభిప్రాయమును సభలో ప్రకటించుట

ఉ. భరతుఁడు లేచి నమ్రత సభాసదులన్ గలయంగఁజూచి- ఈ
వివరములన్ సుమంత్రులును నాగరముఖ్యులు మండలాధిపుల్
వరగుణభూసురోత్తములు వంద్యులు శ్రీగురుపాదు లంద ఱీ
ధరణికి రాజుగాఁ దలప భావ్యమె శ్రీరఘురాముఁ డుండగా.

తే. రాజధర్మం బెఱింగిన రాజులార!
అగ్రజన్ముండె గాదె రాజ్యార్హుఁ డెపుడు
అగ్రజాతుండు ప్రాజ్యరాజ్యాధినేత
రాముఁ డుండగ నెట్లు నే రాజునగుదు? 182

ఉ. సోముఁడు చారుమూర్తి పరిశుద్ధపవిత్రచరిత్రుఁ డబ్ధిగం
భీరుఁడు మేరుధీరుఁ డరివీరభయంకరబాహువీర్యుఁ, డం
భోరుహలోచనుండు వరభూరిగుణుండు విశాలవక్షుఁ డా
శ్రీరఘురాముఁ డొక్కఁడె వశిష్ఠుఁడు దక్షుఁడు రాజ్య మేలఁగన్.

ఉ. కావున రామచంద్రునకుఁ గట్టుఁడు పట్టము నాకుఁ గాదు నే
నా వనసీమ కేగి యట నగ్రజుఁ బ్రార్థనచేసి తెచ్చెదన్
పోవఁగనున్నవాఁడను ప్రభాతమునందున తమ్ముతోడుతన్
రావలెనన్న వీరలును రండు ప్రయాణము గండు సత్వరన్.

చ. భరతుని భ్రాతృభక్తికి సభాసదులెల్లరు నిచ్చ మెచ్చి, ఆ
వరగుణు రామచంద్రు ప్రభువర్యుని దామును జూడనెంచి రా
మరుదినమంద యేగ వనమార్గము నెల్ల సమంబు సేయఁగా
త్వరితగతిన్ జనన్ సుభటవర్గము కాజ్ఞ లొసంగి రంతటన్.

## భరతుఁడు రాముని గొనితేర వనమున కేగుట

మ. వరశత్రుఘ్నుని నేతృతన్ సుభటు లవ్వారెల్ల సన్నాహముల్
జరుపన్ రాణులు మండలాధిపులు రాజస్యుల్ మహామంత్రులున్
పురముఖ్యుల్ గురుముఖ్యులున్ గొలువగా
పుణ్యస్వభావుం డహో
భరతుం డేగెను వన్యచీరముల తా భద్రాత్ముఁ డిస్సన్ గనన్.

క. చని గంగాతీరమ్మున
తన బలగముతోడ విడిసె తమ్మునితోడన్
వనచరు లిది యెల్లను గని
వినిపించిరి గుహుని కంత విస్తరఫణితిన్. 187

## గుహుని ఆశంక

గీ. భరతుఁ డా రీతి చతురంగబలముతోడ
వచ్చుటది చూడ అతని భావం బదేమొ
తల్లి రాజ్యమ్ము కోరగా– తాను నిట్లు
దండయాత్రకు వెడలె నుద్దండరీతి. 188

గీ. ఇతని భావం బదేదొ ముందెఱుఁగవలయు
తప్పుగా నెంచు టదియెల్ల తగదు మనకు
వన్యచీరంబులన్ దాల్చి వచ్చునేమొ
అన్నఁ గొనిపోవ వచ్చిన యట్లు తోచు. 189

గీ. అనుచు మదిని దలంచి ఆతని గనంబోయి
వినయభావ మెసంగ వినతి చేసి
తాను దెచ్చినట్టి కానుక లర్పించి
స్వాగతమ్ము పలికె శబరరాజు. 190

## భరతుండు గుహుని సంభావించుట – వారి సంభాషణము

క. భరతుం డంతట సంభ్రమ
భరితుండై లేచి రామభక్తుండ వోయీ !
వరగుణు రాముని కియ్యెడ
పరిచర్యలు చేసినావు భవ్యచరిత్రా ! 191

గీ. ధన్యుండవు నీవు గుహ ! రామధరణినాథు
గాంచి సద్భక్తి దోపం బూజించినావు
నా కారణమున జగన్నాథుం డతండు
రాజ్యమును వీడి వచ్చె నరణ్యమునకు. 192

గీ. లలితసుకుమారమృదులతల్పమ్మునందు
నిదురవోయెడు సుకుమారి వదినె అయ్యొ !
కటికుదర్భల గూర్చిన కఠినశయ్య
ఎటులు నిద్రించెనో కష్ట మెంత వచ్చె
క్రూరురాలైన మాతల్లి కారణమున. 193

గీ. తమ్ముండా లక్ష్మణుం డెంత ధన్యతముండో
తల్లిదండ్రుల – ఊర్మిళ ధర్మపత్ని
విడిచి వచ్చెనె అన్నం సేవింప వనికి
కష్టజన్ముండ నేనైతి – కఠినచిత్త
కైకకడుపున పుట్టిన కారణమున. 194

గీ. నన్నుఁ గొనిపొమ్మ! అన్న తా నున్న వనికి
వారి గొనిపోవ వచ్చినవాఁడ నేను
అన్యథా ఎంచఁబోకు మో అమలచరిత!
సఖ్యభావంబు చూపు మో శబరరాజ! 195

గీ. లక్ష్మణుని కంటె నీవె శ్రీరామునందు
భక్తిభరితుండ వౌదు వో భరతరాజ!
గంగ దాటింప వీరె నరంగు లెల్ల
వందనౌకలు వే గొని వచ్చినారు. 196

గీ. రాజవాహకమైన ఈ రాజనౌక
రాజమాతలు మీరును రాజగురులు
రోహణము సేయుఁ డయ్య నా బాహువూని
నడపువాడను నేనె యీ నౌక నోయి! 197

క. అని గంగను దాటించిన
చని రందఱు వేడ్క రామచంద్రుని జూడన్
తన తమ్ముఁడు శత్రుఘ్నుఁడు
వెనువెంటను గుహుఁడు రాగ వినయాన్వితుఁడై. 198

భరద్వాజాశ్రమము – భరతుని రాక

సీ. పరిపక్వసుమధురఫలభారమునఁ జేసి
ఆనమ్రశాఖలౌ ఆమ్రతరులు
మూలమ్ములందుండి వ్రేలాడు కమ్మని
ఫలముల నిండిన పనసతరులు
నిండార పండిన నిలువెత్తు గెలలతో
కదలాడు కర్పూరకదళికలును

కొమ్మసందుల వ్రేలు గోలలతో చేయెత్తి
కోయంగఁ జాలెదు కొబ్బెరలను
ఫుల్లపుష్పాభిశోభితపుష్పలతలు
పావనోదకపూర్ణ సరోవరములు
ఆనటి మునులకు ఆతిథ్య మాచరించు
అది భరద్వాజమౌనీంద్రు నాశ్రమమ్ము. 201

## భరత – భరద్వాజుల సంభాషణము
## భరద్వాజుని ఆతిథ్యము

భరతుఁ డా యాశ్రమముఁ జొచ్చి పరమభక్తి
మౌనిచంద్రుని పాదపద్మముల కెరగి
ఆనందబాష్పాంబుధార పాదములు గడిగి
వినయమున వంగి నిలిచిన మునివరుండు. 202

రాజమర్యాద చేసి అవ్యాజఘృణోక్తి
భరత! కుశలమె మీకు మీ ప్రజల కెల్ల
రాజ్య మేలుదు గదె ప్రజారంజకముగ
రాజ వయ్యును ఏల ఈ యోజ నుంటి? 203

అని ముని యడిగిన సంభ్రమ
మున భరతుఁడు కేలుమోడ్చి మునివర! సర్వం
బును దెలిసిన మీ రిటు లనఁ
గనునే! నే నేమనందు సర్వజ్ఞులతోన్. 204

ఉ. రాముఁడు శత్రుభీకరపరాక్రమభీముఁడు; భోగభాగ్యసు
త్రాముఁడు, రూపసంపదపరాజితకాముఁడు, సర్వసద్గుణ
స్తోముఁడు సుప్రసన్నముఖసోముఁడు, నిస్తులధాముఁడైన శ్రీ
రాముఁడు, రాజ్యపాలనధురంధరుఁ డుండగ నేను రాజనే! 205

గీ. అగ్రజన్ముండు పూజ్యరాజ్యార్హుఁడైన
రామచంద్రుని గొనిపోయి రాజ్యమునకు
భక్తితో నుత్సవపట్టాభిషిక్తుఁ జేసి
వారి పాదాబ్జముల గొల్చువాఁడ మౌని ! 206

క. అని పలికిన విని ముని తన
మనమున లక్ష్మణునికంటె మానితభక్తిన్
ఘనుఁ డీతం డని మెచ్చుచు
వినుతించి విశిష్టదృష్టి విందులు చేసెన్. 207

గీ. బ్రహ్మమానసపుత్రుండు బ్రహ్మవేత్త
శిష్టజనపూజ్యుఁడైన వసిష్ఠమునికి
అర్ఘ్యపాద్యాదివిధులతో అర్చ చేసి
దివ్యమృష్టాన్నభుక్తి నాతిథ్య మిచ్చె. 208

క. మునిరాజు భరద్వాజుని
అనుమతి గొని రామచంద్ర ! అగ్రజు నిన్నున్
గన - తల్లులు గురువులు పరి
జనములు తను గొల్వ భక్తిసంభ్రమయుతుడై. 209

శ్రీరాముని ఆశ్రమము

ఉ. దూరమునుండి గాంచె భరతుం డట పావనజాహ్నవీనదీ
వారితరంగవర్ధితసువర్ణలతాంతనితాంతకాంతిమద్
వీరుధమంజుకుంజకలవింకశుకాదిసుపక్షపక్షిసం
చారమునై, చారు పక్వఫలసారసుగంధతరుప్రవారమున్. 210

గీ. కాచి ఫలియించి వంగిన కల్పతరులు
పూచి పూవుల నిండిన పుష్పలతలు
ఏచి గంతులు వైచెడి ఏణగణము
చూచి గుహుఁ డంత భరతుని జూచి పలికె. 211

క. అదె గాంగనదీతీర
మ్మదె సుందరపుష్పవాటి, అదె వటవిటపం
బదె పండిన తరుషండం
బదె రాముని పర్ణశాల అదిగో గనుఁడీ ! 212

చ. అనుజుఁడు లక్ష్మణుం డడుగొ ఆతని పాదము లొత్తుచుండె, ఆ
జనకజ చెంతనే నిలిచి చామరమున్ గొని వీచుచుండె, ఆ
వనలత లెల్ల పుష్పములు వారి పయిన్ గురియించుచుండె, ఆ
మునివరు లెల్ల రాముఁ గని ముచ్చటలాడుచు నుండి రయ్యెడన్

క. అని నిన్నటఁ జూపించిన
గని భరతుఁడు మోదబాష్పకలితుండయ్యెన్
జననీవర్గము హర్షం
బున మేనులు పులకరింప ముగ్ధం బయ్యెన్. 214

చ. రథతురగప్రభూతచతురంగబలంబును నిల్పి యచ్చటన్
ప్రథితయశుండు నీదు పదభక్తుఁడు నా భరతుండు దా మనో
వ్యథ తొలగంగ— త్వచ్చరణపద్మశుభాంకసుశోభిసద్వనీ
పథమును గాంచి మోదభయభక్తిసమన్వితచిత్తవృత్తుఁడై. 215

## భరతుఁడు శ్రీరాముని దర్శించుట

గీ. పరుగునను వచ్చి నీదగు భవ్యదివ్య
చరణయుగమును జేపట్టి శిరము వంచి
బాష్పజలముల త్వత్పూతపాదపద్మ
ములను గడిగెను దనువెల్ల పులకరింప. 216

చ. భరతుని గాంచి నీవు నిజబాహువులన్ బైకెత్తి సందిటన్
జేరిచి కౌగిలించుకొని క్షేమమె మీకు సయోధ్యవారికిన్
గురులు వసిష్ఠులున్ సుఖులె కూరిమి మాతలు స్వస్థచిత్తులా
దురె'' అని యడ్గుడున్ గురుని తోడుత వచ్చిరి
మాత లందఱున్. 217

## శ్రీరాముడు తల్లులను - వసిష్ఠులవారిని పూజించుట

గీ. శుక్లవస్త్రాదిధారిణుల్ శుష్కతనులు
తిలకశూన్యలలాటలు దీనముఖులు
అశ్రుపూర్ణాక్షులై మాతలందఱంత
వచ్చినారలు శోకదేవతలు వోలె. 218

గీ. వచ్చు మాతలఁ గాంచి అవ్యక్తమైన
కలఁత యేదియొ మనసునుఁ గలఁచివేయ
ధీరభావంబుతో దానిఁ దెలియనీక
ఆత్మనిగ్రహశక్తిచే నణఁచి వైచి. 219

ఉ. మాతలఁ గాంచి లేచి బహుమానపురస్కృతి నీవు లక్ష్మణుం
డాతతభక్తి వారల పదాబ్జములం బడి మ్రొక్కినార లా
సీతయు వారి పాదముల చేతులు మోడ్చి నమస్కరించె సం
జాతవిషాదబాష్పములు జారగ కన్నులనుండి ధారలై. 220

క. గురులు వసిష్ఠుల్ వచ్చిన
పరవశతన్ వారి పాదపంకజములకున్
విరులన్ బూజలు సేయుచు
చరితార్థుడ వనవె మోదజాతాశ్రులతో. 221

## దశరథుని మరణవార్తను వసిష్ఠులవారు శ్రీరామునకు దెల్పుట – వారిని ఓదార్చుట

క. భరతుడు వచ్చుట – మాతలు
గురువులు విచ్చేయ నీవు గురుతరభక్తిన్
పరిచర్యలు సేయుటయును
వరగుణ! కనుగొంటి మౌనివరుడను నగుచున్. 222

ఆ. అంత మంత్రివర్యులాదిగ జనులెల్ల
వచ్చి చేరి నిన్ను భక్తిగొలువ
దశరథుండు స్వర్గధామమ్ము చేరుట
చెప్పె గురువు కనులు చెమ్మగిల్ల. 223

ఆ. తండ్రిమరణవార్త తల్లుల దైన్యమ్ము
విన్నయంత మీరు వివశులగుచు
ఘోరు మనుచు బాష్పధారలు గురియంగ
శోకభరముచేత సుక్కిపోవ. 224

గీ. చేర్చి యోదార్చి గురువు దుర్వారమైన
దుఃఖభారమ్ము సద్బోధ దొలఁగఁ జేసి
జ్ఞానఘనివైన శ్రీరామచంద్ర! నీకు
తగునె ఈ రీతి శోకసంతాప మంద. 225

ఉ. రాజితకీర్తిశాలి, త్రిపురద్రాజును మించిన భోగశాలి, వి
భ్రాజితవిక్రమక్రమవిభాసితుఁడై సురరాజుచేత సం
పూజితుఁడయ్యె యజ్ఞము లపూర్వగతిన్ శతసంఖ్య చేసె, ఆ
రాజును గోల్పోయి దుఃఖ మిటు రాఘవ! చెందుట నీకుఁ జెల్లునే!

చ. సురపతి తల్లడిల్లఁ - అతిఘోరత రాక్షసకోటి గెల్చి, ఆ
సురపతిపూజ లందిన యశోనిధి, యజ్ఞము లెన్నో చేసి, భూ
సురులకు భూరిదక్షిణలు శుద్ధసువర్ణము లిచ్చె మెచ్చగా
నఱువదివేల వత్సరము లనంతను నేల ననంతకీర్తి, దా
సురపురి జేరె నిన్నె మది జూచుచు నీ జనకుండు రాఘవా! 227

## వశిష్ఠుఁడు తండ్రి దశరథునకు పితృకర్మ చేయుమని శ్రీరామునికి చెప్పుట

గీ. జ్యేష్ఠుఁడవు నీవు పితృకర్మ చేయవలయు
గాన తమ్ములతోఁ గూడ గంగలోన
స్నానమును జేసి వన్యపిణ్యాకములను
పిండదానంబు గావించి పితరులకును. 228

గీ. అనుజులం గూడి యట నివాపాంజలిచ్చి
విమలభక్తిని పైతృకవిధుల తీర్చు
మనుడు రాముండు లక్ష్మణుం డనుజు లెల్ల
గంగలో స్నానమును జేసి గాంగతీర
మందు గురువులు చెప్పిన యట్టు లెల్ల
పైతృకమ్ముల దీర్చిరి భవ్యభక్తి
నార లెల్లరు నా దుపవాస ముండి
గడపి రా రాత్రి దశరథుకథలతోడ. 229

## భరతుఁడు రాముని పాదములన్ బడి ప్రార్థించుట

మ. మరునా డవ్వట మంత్రిపుంగవులు సామంతుల్ మునుల్ పౌరులున్
పరివేష్టించి భజింప నిన్నట సభాభవ్యస్థలిన్ భక్తి సం
భరితుండై భరతుండు త్వద్విమలసత్పాదాబ్జముల్ బట్టి, తా
శిరమున్ జేర్చి నమస్కరించి వినయశ్రీ మించగా నిట్లనెన్ .230

క. పూజ్యుఁడవు జ్యేష్ఠుండవు
ప్రాజ్యంబగు నీ యయోధ్య-రాజన్యులు సా
మ్రాజ్యజనుల్ జయవెట్టగ
రాజ్యంబును నేలు రాజరాజశ్రీతో. 231

చ. గురులు వసిష్ఠమౌనులును కోవిదులైన అమాత్యవర్యులున్
పురజనముఖ్యులున్ విబుధపుంగవులున్ జననీగణమ్ము నిన్
పురికి నయోధ్య కిష్ట గొనిపోవగ వచ్చినవారమోయి ! ఈ
భరతుని వేడుకోలు గుణభవ్య ! గ్రహింపుము కూర్మిపేర్మిమై.

## శ్రీరామచంద్ర - భరతుల సంవాదము

క. అది విని నీవును భరతుని
ఘనభక్తికి మెచ్చుకొనుచు కర మనురక్తిన్
విను మో తమ్ముఁడ ! జననీ-
జనకుల- ఆ యాజ్ఞ తప్పఁ జనునే మనకున్. 233

చ ధరణివిభుఁడు తా దశరథక్షితిపాలుఁడు పూర్వమందునన్
వరముల నిచ్చె రెండు జనవంద్యుఁడు కేకయరాజపుత్రి కా
వరములు న్యాసరూపమున వర్తిలె నింతకుఁ దండ్రియొద్దనే
భరతకుమార ! వాని వరవర్ణిని కోరుట దోష మేమిటన్. 234

గీ. జనని తా నంత నీకు రాజ్యమ్ము కోరె
వన్యవృత్తిని పదునాల్గువత్సరములు
వనమునం దుండ నన్నంపు మనియు గోరె
సత్యనిరతుండు తండ్రియు సమ్మతించె. 285

గీ. అన్న ! మన్నింపుమయ్య ! మా అమ్మ దొసగు
జన్మతోడనె వచ్చె రాజ్యమ్ము నీకు
అగ్రజుఁడవైన నీ వుండ అనుజుఁ డెట్లు
రాజ్యమును జేయ నర్హుండు రామచంద్ర ! 286

గీ. రాజు దశరథుఁ డన్ననో స్త్రీజితుఁడు
అతని ఆజ్ఞను గొనుట భావ్యంబు గాదు
అగ్రజన్ముండె ప్రాజ్యరాజ్యంబు సేత
మనువు చెప్పిన రాజధర్మమ్ము గాదె ! 287

క. స్త్రీజితుఁడు గాదు సత్య
శ్రీజితుఁ డాతండు విమలచిత్తుఁడు భరతా !
రాజన్యుఁడు దశరథుఁ డప
రాజితతేజుండు రాజరాజౌ గాదే ! 288

గీ. తండ్రి నిందింపఁ దగునె ? ఆతండు నిత్య
సత్యనిరతుండు పూజ్యసౌజన్యధనుఁడు
ప్రాణములకంటె సత్యవాక్పాలనమ్మె
ముఖ్య మని యెంచు రాజన్యముఖ్యుఁ డతఁడు. 289

గీ. రాజు నియమించె నిన్ను సామ్రాజ్య మేల
రాజె నను బంపె ఆరణ్యరాజ్య మేల
రాజు నాజ్ఞను మనము శీర్షమున దాల్చి
పాలనము సేయగావలె భవ్యచరిత ! 240

గీ. సత్యయుగమున మన అల హరిశ్చంద్రవిభుఁడు
సత్యవాక్ దీక్ష నైజరాజ్యమ్ము వీడె
సూర్యవంశీయు లేరైన సూనృతోక్తి
తప్పినారటె నే నెట్లు తప్పువాఁడ ? 241

గీ. తండ్రి యెదుటను నేను సత్యప్రతిజ్ఞ
చేసి వచ్చితి ఆరణ్యసీమ కిటు
పదియునాల్గేండ్లు నే జనపదము ద్రొక్క
ఆడితప్పుట వంశమర్యాద గాదు. 242

గీ. పదియునాల్గేండ్లు నిండిన పిదప గాని
నే నయోధ్యకు తమ్ముఁడా ! రా నటంచు
చెప్పినంతన భరతుండు చిన్నవోయి
నిరశనవ్రతమును బూన నిశ్చయించెఁ. 243

గీ. ప్రాఙ్ముఖమ్ముగ దర్భలు పఱచి యందు
దీక్షతోడను కూర్చుండె ధీరవృత్తి
అంత భరతుని ఆ నిరాహారదీక్ష
కంద తెంతయుఁ గొందల మందినారు. 244

## శ్రీరాముఁడు సాకూతముగ వసిష్ఠులవారిం గాంచుట

గీ. భరతుదీక్షను మదిని సంభ్రాంతి చెంది
గురువసిష్ఠుల వైపు సాకూతదృష్టి
గాంచినంతనె భరతు నేకాంతమునకుఁ
జీరికొనిపోయి యిట్లు వచించె గురువు. 245

ఉ. ఓయి కుమార! దీక్షవిడుమోయి! గ్రహింపుము రాము నాదినా
రాయణుఁ గాఁగ – అల్ల జనకాత్మజ శ్రీవరలక్ష్మిగాఁగఁ దా
మాయను బూని వార లిటు మానుషభావము బూనినారు దై
తేయులఁ గూల్చి ఈ వసుమతీభరమున్ దొలగింతు రీ గతిన్.

## భరతుఁడు రాముని పాదుక లిమ్మని గోరుట

ఉ. దేవరహస్య మియ్య దిటు దెల్పితి నేరికి దెల్పరా దిఁకన్
గావున దీక్షవీడు మనగా భరతుం డతి విస్మితాత్ముఁడై
పావనతావకీనపదపద్మములన్ శిరమందు దాల్చి, ఓ
దేవ! అయోధ్య నేల – భవదీయసుపాదుక లిమ్ము కూర్మిమై.

గీ. భవ్యమైనట్టి నీ దివ్యపాదుకలను
భద్రపీఠమ్మునందుంచి భక్తిమీర
పూజ సేయుచు నే నందిపురిని బ్రహ్మ
చర్యదీక్షను బూని రాజ్యమ్ము నేతు. 248

గీ. పదియునాల్గేండ్లు నిండిన పరదినంబె
నీ వయోధ్యకు రాకున్న నిర్మలాత్మ!
అగ్నిలో జొచ్చి నాదు దేహమ్ము విడుతు
శపథ మియ్యది వినుము రాజన్యగణ్య! 249

గీ. భరతుఁ డా రీతి గురుభక్తిభరితుఁ డగుచు
శపథమును జేయ ఆశ్చర్యచకితులైరి
భరతు పరివారమున నొక్క భటుడ నగుచు
కంటి నిది యెల్ల వీనుల వింటి నయ్య !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 250

గీ. సత్యనిష్ఠుండవగు నీవు సమ్మతించి
పాదుకల నిచ్చి భరతుని బంపినావు
మాతృగణమును- పౌరులు మంత్రివరులు
ఆర్ద్రనయనాలతో నంద ఉరిగినారు. 251

ఉ. తావకపాదుకల్ దలను దాలిచి నీకుఁ బ్రదక్షిణించి యెం
తో వగతోడ నేగె భరతుం డిఁక మంత్రులు తల్లు లెంతొ వా
పోవుచుఁ గన్ను లొత్తుకొని పొక్కుచు నిన్ విడువంగ లే కెటో
పోవగలేక తా మరలిపోయిరి ఏగిరి పౌరులున్ భటుల్. 252

## నందిగ్రామంబున భరతుఁడు శ్రీరాముని పాదుకల పూజించుట

క. నందిగ్రామంబున నిజ
మందిరమున రత్నరాజిమండితపీఠం
బందున పావనతావక
సుందరపాదుకల నుంచి శుచిహృదయుండై. 253

క. ప్రతిదినమును త్వత్పాదుక
లతిభక్తిని బూజచేసి ఆపై నీకున్
బ్రతినిధులుగ పాదుకలన్
మతి నెంచుచు దైనికములు మనవులు సేయున్. 254

తే.గీ. భూరిభోగానురాగానుభూతు లుడిగి
పండ్లుపాలును గొని నేల బండుకొనుచు
బ్రహ్మచర్యంబు పాటించు బ్రహ్మనిష్ఠ
భరతు నంతటి భక్తుఁ డీ ధరణి లేడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 255

క. దినములు లెక్కించుచు, దా
ననయము నీ పాదుకలను అర్చించుచు, న
జ్జను లెల్లరు మది మెచ్చఁగ
నినె ధ్యానించుచును నుండు నిరుపమభక్తిన్. 256

## శ్రీరాముడు చిత్రకూటమును వీడి దండకావనికి ప్రయాణించుట

ఉ. నిచ్చలయోధ్యనుండి తగ నీవును సీతయు లక్ష్మణుండు మీ
రిచ్చట నుండుటల్ దెలిసి ఎందఱొ పౌరులు బంధుమిత్రులున్
వచ్చుచుఁబోవుచుంట అనివార్యముగాఁ గొనసాగ గాంచి, మీ
రచ్చోటు బాసి నిర్జనమహావని కేగుచు మార్గమందునన్. 257

## అత్రిమహాముని ఆశ్రమము

ఉ. శాంతమృగప్రచారము, ప్రశాంతము పక్వఫలప్రశాఖికా
ప్రాంతము, ప్రాంతపర్వతశిరస్సరదూర్మివిలోలవాహినీ
కాంతము, కాంతపుష్పవనికాపరిపుల్లసుపుష్పవల్లికా
క్రాంతము, కాంచి రత్రిముని కమ్రతపోవనవాటి నయ్యెడన్.

గీ. గుజ్జులేమావిగున్నల కొమ్మలందు
'కో' యటంచును గూయు పుంస్కోకిలములు
లలితసుకుమారవిడుధలతిక లెల్ల
స్వాగతము వల్కె శ్రీరామచంద్ర ! మీకు. 259

## అత్రిమౌనీంద్రు దర్శించుట - సీత అనసూయన్ గాంచుట

గీ. తరులనీడల శాద్వలస్థలములందు
వేదపన్నంబులన్ వల్లెవేయుచున్న
మునికుమారుల చెంగట ముద్దుగురియ
గంతులిడుచున్న మృగమృగీగణము గాంచి. 260

గీ. ఆశ్రమద్వారదేశంబునందు నిలిచి
భాతృముఖమున మీ రాక అత్రిమునికిఁ
దెలియఁజేయంగ నాతఁ డుద్వేలభక్తి
స్వాగతము పల్కి గొనిచని స్వాశ్రమమున. 261

గీ. అర్ఘ్యపాద్యాదివిధులతో ఆదరించి
రామచంద్రమ! పరమపురాణపురుష!
మనుజవేషమ్ము ధరియించి మమ్ము జూడ
తరలివచ్చితె! మా జన్మ ధన్యమయ్యె! 262

గీ. అనుచు వేదోక్తరీతుల వినుతిసేయ
వినయవినతుండవై అత్రిమునిని గాంచి
సప్తఋషులందు మహితప్రశస్తిగన్న
ఋషివరుండవు మమ్ము వర్ణింపఁదగునె! 263

అని జానకిని గాంచి—

గీ. దేవి! లోనుండు-పరమసాధ్వీమతల్లి
అత్రిమునిచంద్రు గృహలక్ష్మి అమలచరిత
త్రిభువనారాధ్య- అనసూయ దివ్యచరిత
ఆమె దర్శించి ఆశీస్సు లందుకొమ్మ! 264

గీ. బ్రహ్మవిష్ణుమహేశ్వరప్రభుల మువుర
పుత్రులుగ గాంచి పెంచిన పుణ్యసాధ్వి
ఇనుపగుగ్గిళ్ల నుడికించి ఇంపుదుచుల
అమరముని కిచ్చె నామె భక్ష్యమ్ముగాగ. 265

గీ. ప్రణుతసాధ్వీమతల్లి ప్రపంచమందు
గణనసేయంగఁ జన నగ్రగణ్య యామె
సుకృతపరసీమ ఈ అనసూయ సుమ్మ
ఆమె దర్శింప జన్మధన్యమ్ము గాదె! 266

క. అని నీ వన- విఖ్యాతను
అనసూయను అత్రిమౌని అర్ధాంగి, తపో
ధన, సాధ్వీజనసన్నుత
గన సీతకుఁ గల్గె మిగుల కౌతూహలమున్. 267

క. మునిపత్నిని అనసూయను
గన లోనికి నేగి సీత కడు వినయమునన్
ప్రణతుల్ వినుతుల్ సేసిన
అనసూయయు నామె గాంచి సాదరమతియై. 268

ఆ. పుణ్యచరిత వీవు పూఁబోణులందున
పరమపురుషుఁ బతిగఁ బడసినావు
ఏది నీదు పెండ్లి ఎట్లయ్యెనో తెల్పు
వినగ మాకు చాల వేడుకయ్యె. 269

ఆ. అనిన జానకమ్మ అవనతవదనయై
సిగ్గు కనులలోన చిందులెత్త
మందమందమధురమంజులభాషల
ముచ్చటించె పెండ్లిముచ్చటెల్ల. 270

ఆ. సీతనోట నామె శ్రీరామ ! నీదగు
శౌర్యధైర్యవీర్యసౌకుమార్య
వినుతరూపశీలగుణముల నాలించి
మెచ్చి కౌగలించి మేను నిమిరి. 271

## అనసూయ సీతకు క్షౌమ_అంగరాగాదుల నొసంగుట

గీ. విశ్వకర్మవినిర్మిత విమలదివ్య
కర్ణభూషలు అంగరాగములు మరియు
క్షౌమవస్త్రమ్ము లొసఁగె ఆశానసముల
కంటి నది యెల్ల నే మునికన్య నౌచు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 272

గీ. కల్పవృక్షప్రదత్త మీ క్షౌమయుగము
అంగరాగమ్ము- ఇదియు దివ్యమ్ము సుమ్ము !
దీని ధరియింప ద్విగుణమౌ దేహకాంతి
తన్వి నీదగు తనుశోభ తరుగదనుచు. 273

గీ. మహితసాధ్వీజనోక్తధర్మమ్ము నూని
పతిని సేవించు దైవభావమ్ముతోడ
నియతి అరణ్యవాసమ్ము నిస్తరించి
విభునితోఁగూడ సామ్రాజ్యవిభవ మందు. 274

గీ. అనుచు దీవించి అనసూయ- అవనితనయఁ
గౌగిటను జేర్చి మూఁడు లోకముల నేలు
రాముఁ బతిగాగఁ బడసిన రామ వీవు
ధన్య వీ వమ్మ ! సాధ్వీమతల్లివమ్మ ! 275

క. అని వినుతించిన— జానకి
అనసూయకు వినతి చేసి అట్లనఁ జనునే
తనయులుగా ముమ్మూర్తులఁ
గనిపెంచిన తల్లి వీవు గాదే ! అనుచున్. 276

గీ. అతులభక్తిని సాష్టాంగనతులు సేసి
ఆమె అనుమతి గొనివచ్చె అవనిజాత
ఈవు సత్భక్తి అత్రిమౌనీంద్రుపాద
నళినములఁ బట్టి ఆమంత్రణమ్ము వడసి. 277

గీ. మునియు— శిష్యులతో మిమ్ము ననుసరింప
ఆశ్రమద్వారమందున నతని నిలిపి
మౌనిచంద్రమ దండకమార్గ మేది ?
అనుడు ఛాత్రుల నత్రి తాఁ బనిచె గాదె
అత్రిమునిశిష్యుడను నౌచు నంత గంటి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 278

మాలిని —

ఇనకులసుచరిత్రా ! ఇంద్రనీలాభగాత్రా !
ప్రణతదివిజమాత్రా ! పాపవల్లీలవిత్రా !
కనకవిమలచేలా ! కంధిగాంభీర్యహేలా !
జననుతగుణశీలా ! జానకీప్రేమలోలా ! 279

కాండాంతగద్యము

శ్రీమదాకుండ్యన్వయపవిత్ర, ఆత్రేయసగోత్ర మహాకవివేంకటకవి
ప్రపౌత్ర, జగన్నాథశాస్త్రిపౌత్ర ఉద్దండపండితగోపాలశాస్త్రి
పుత్ర, విద్వజ్జనవిధేయ ఉభయభాషాప్రవీణ
సూర్యనారాయణశాస్త్రినామధేయ ప్రణీ
తంబయిన ప్రత్యక్షరామాయణ
మహాకావ్యంబున అయోధ్యాకాండము
సర్వము సమాప్తము
ఓం తత్ సత్
శ్రీరామచంద్రార్పణమస్తు

—o—

శ్రీః

# శ్రీ ప్రత్యక్ష రామాయణము

## ప్రత్యక్షాత్మానుభూతి రామాయణము

## ఆరణ్యకాండము

---

క. శ్రీవల్లభ ! ప్రావృట్ఘన
లావణ్యతనూవిలాస ! రవిశతభాసా !
భూవల్లభ ! భూమీజా
తా వల్లభ ! దైత్యకోటిదర్పనిరాసా ! 1

క. అవలి కథ వినిపించెద
పావనగుణరూపశీల ! పాపవిదూరా !
భూవనితాతనయాహృత్
శ్రీవనజాతాధివాస ! సింధుగభీరా ! 2

### అత్రిమునిశిష్యులు- దండకవనమార్గమును చూపించుట

గీ. దండకావనమార్గసందర్శనార్థ
మత్రిమౌనీంద్రుఁ డంపిన ఛాత్రగణము
విమలసద్భక్తి మీకు మార్గమును జూప
ముందు నడువంగ మీర లానంద మెసఁగ. 3

గీ. వారివెంటను జనుచు నవ్వనమునందు
తటము లొరయుచుఁ బారెడు తటిని గాంచి
దీని దాటు నుపాయ మేదైన గలదె?
అనుడు వారలు నిట దృఢమైన నౌక
గలదు రాఘవ! దాటింపగలము మేము
నౌక యిదె మీర లధిరోహణమ్ము సేయుఁ
డనుచు మిమ్ములఁ గొనిపోయి రవలిదరికి
అందుకొనినారు మీ అభినందనముల
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 4

## దండకావన గమనము – ప్రకృతి రాముని సేవించుట

గీ. లక్ష్మణా! ఇదె దండకారణ్యసీమ
ఘోరరాక్షసగణములు క్రూరజంతు
జాల మిటనుండు ధనువు సజ్యంబుసేసి
జాగరూకులమై యికఁ జనఁగవలయు. 5

సీ. జడగుంపువనలతన్ ముడిచుట్టి శిరమైౖ
ముడిచుట్టు పూదండ పొదివిగట్టి
కమనీయమైన వల్కలచేలమును గట్టి
కటిచుట్టి రా శాటి గట్టిచుట్టి
దా కేల నిడుదకోదండంబు ధరియించి
భుజముపై నమ్ములపొదిని గట్టి
వలకేల తళుకొత్తువాలమ్ము కీలించి
గంభీరమైమించు గమనభంగి

ముందునడువంగ నీవు నందందు గనుచు
వెనుకతట్టున తమ్ముఁడు విలువట్టి
నడువ నడుమను సీతమ్మ నడువ గంటి
ఆత్మపరమాత్మమధ్య మాయావిధాన
రమ్యగుణశీల ! శ్రీరఘురామచంద్ర ! 6

గీ. రామ ! మీసోదరులమధ్య రమణి సీత
ఆత్మపరమాత్మమధ్య మాయావిధాన
నడచివచ్చెను నీవెంట నడుగుజాడ
మాయయే గాదె ! ఆ జగన్మాత సీత
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 7

సీ. కఱకురంపపు సూది గాజు రా నేలలు
శశికాంతమృదుశిలాస్థలములయ్యె
ముట్టినంతనె గ్రుచ్చు ముండ్లుల బాటలు
సదునైన శాద్వలస్థలములయ్యె
ఖరరశ్మినంత ప్తగురువాలుకాస్థలుల్
చల్లని కపురంపు సరణులయ్యె
అసిపుత్రికలవంటి అశ్మసంతతులెల్ల
చిగురాకుమెత్తని సెజ్జలయ్యె
కాలు మోపినయంత ఆ క్షణమునందె
పుడమిపైదలి యొడలెల్ల పులకలెత్త
అడుగులకు నెల్లతావుల మడుగులొత్తె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 8

సీ. కొమ్మసందుల నిల్చి కోకిల మ్మత్కంఠ
'కో కో' యటంచును కూతవెట్టు
నెమ్మి తండంబులు నిండుగా పురివిప్పి
నాట్యముల్ సల్పు విన్నాణమొప్ప

శుకసంతతులు మృదుసూక్తులన్ బచరించి
రామ ! రామ ! యటంచు ర క్తి బలుక
శారికాదికవన్యశకునసంతతులెల్ల
కలకలస్వనముల వలుకరింప
చండదండకవని– సాధ్వి జానకమ్మ
వెంటనడువంగ– తమ్ముఁ డావెంటరాగ
కోర్కె వనలక్ష్మి తా నెదుర్కోలు నడిపె
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 9

సీ. ద్విజరూపములు దాల్చి దివిజాళి యేతెంచి
కొమ్మకొమ్మల నిల్చి కోర్కె చూచు
ప్రకృతిపురుషులంచు భావించి లో నెంచి
మునికోటి మదిలోన మురిసిపోవు
శబరకాంతలు మీదు సౌందర్యమును గాంచి
కనుదోయి దొప్పల కాంక్షజుర్రు
తపకు పుత్తడిసీత తనుకాంతి– నిను గాంచి
నెమ్ములు పురివిప్పి నెమ్మియాడు
గిరులు సమ్మోదబాష్పముల్ ఝరుల విరియు
తరులు చలియించి కమ్మని విరుల గురియు
కూర్మి చేసాచి లతలు పూగుత్తు లిచ్చు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 10

సీ. గిరినిర్ఝరములు తా పరుగు పరుగున వచ్చి
అర్ఘ్యపాద్యంబుల నర్పలిచ్చు
వనజాతఘనవనస్పతులు శాఖలు సాచి
దట్టంపు నీడల తాపమడచు

తరువు లెల్లెడ కల్పతరులట్లు ఫలియించి
కోరినఫలములఁ గోర్కె నిచ్చు
మలయానిలంబులు మందంబుగా వీచి
శ్రమవారినార్చి విశ్రాంతిఁ గూర్చు
కొండకొమ్ముల విహరించు కోయదొరలు
తేట తేనియదొన్నెలు తెచ్చి యీయ
కొండగరితలు కమ్మపూదండ లీయ
కంటి నా నాడు నే బోయకన్నె నగుచు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 11

గీ. తరువులు శాఖాగ్రమృదులహస్తములు సాచి
మధురఫలములఁ గొమ్మ రామా ! యటంచు
భక్తితోడుత శీర్షముల్ వంచి యిచ్చు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 12

గీ. లతలు భృంగాళిమధురసల్లాపములను
పలుకరించుచు కమ్మపూవులను బత్తి
తలిరుచేతులు సాచి సీతమ్మ కిచ్చు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 13

గీ. మునులు మునికాంత లెదనెడ ముందునిలిచి
స్వాగతము పల్కి మధురవాగ్వైభవముల
ప్రకృతిపురుషుల మిమ్ము సద్భక్తి గొలిచి
అల్లనల్లన గొనుచు దు రాశ్రమముకు. 14

ఉ. గండకపుండరీకహరి ఖడ్గవరాహశృగాల మత్తవే
దండవిహారభీమమతి దారుణజంతువిహారఘోరము
ద్దండ–భుజంగ–భోగవిషదంష్ట్రివిలోలమహాగ్నికీలమౌ
దండక–భీషణాటవిని దాటుచు మీరు విశోషతాలురై. 15

గీ. ఇమ్మహాటవి గిరినిర్ఝరమ్ముగాని
వారిపూరమ్మునౌ సరోవరముగాని
కలదె లక్ష్మణ ! అనుచుండ- కమలసౌర
భమ్ముతో వీచె వాతపోతమ్ము సంత. 16

చ. ఫుల్లసరోజరాజిపరిపూర్ణ వినిర్మలవారిపూరమై
పల్లవపుష్పపక్వఫల భాసురభూరుహచారుతీరమై
సల్లలితప్రచారబహుసారసహంసరథాంగవారమై
ఉల్లము కెంతో హాయి నిడు ఒక్కసరస్సును గాంచి రయ్యెడన్.

గీ. వారిజాకరశీతలవారి గ్రోలి
తరులనీడల గూర్చుండ- తరులు కమ్మ
డులు గురిపించి పండుల విందుచేసె
శీతవాతమ్ము వీతెంచి సేదతీర్చె. 18

గీ. కమలకల్హారకుముదసుగంధరజము
వీచికాశీకరమ్ములు మోచి వీచు
మందపవనాంకురమ్ము లానందమెసఁగ
కొంత విశ్రాంతి గొనుచుండ నంతలోన 19

గీ. మనుజవాసన పసికట్టి మానవాదుఁ
డవ్వనంబున జరియించువాఁడు మిమ్ము
దూరమున గాంచి దొరకె నాహార మనుచు
వేగఁ జనుదెంచె ఆకాశవీథి తెగసి. 20

## విరాధ వధ

శా. ఘోరాకారుఁడు, మానవాదుఁడు మహాక్రూరుండు, శైలోన్నతా
కారుఁడు, జ్వలనేత్రగోళుఁడు, మహాకాలాంతకాలుండు నా
శూరుం డాహవదోహలుండు నిలిచెన్ శూలాయుధాగ్రిం దో
స్సారుం డొక్క నిశాచరుండు సవిధన్ సక్రోధరూక్షాక్షుఁడై. 21

ఉ. ఎవ్వరు మీర లిచ్చటకు నెచ్చటనుం డిటు వచ్చినా రహో!
ఇవ్వని వీడి మౌనిజను లెల్లరు పోయిరి మద్భయంబునన్
జవ్వనితోడ వచ్చితిరి సాహసమా గదె! న న్నెఱుంగరే!
ఇవ్వనభూమిఁ జొచ్చి జను లెవ్వరు ప్రాణముతోడఁ బోదురే? 22

గీ. మూఁడులోకమ్ము లొక్కముద్ద చేసి
మ్రింగఁజాలుదు బాలురు మీర లెంత!
చారుమోహనసుందరాకారులైన
మిమ్ము గని జాలిగొని నేను మ్రింగలేదు. 23

గీ. మునికుమారులు కాబోలు ఘనులువోలె
ధనువు కేలను బట్టి రుద్దండలీల
బ్రదుకఁదలఁచితిరేని ఈ పడతి విడిచి
పాఱిపోవుఁడు లేకున్న బ్రతుక రనిన. 24

గీ. ఏను రాముండ లక్ష్మణుం డితఁడు నాదు
భ్రాత — ఈ కోమలాంగి నా ప్రాణదయిత
తండ్రి దశరథు నాజ్ఞ నీ దండకమను
వనికి వచ్చితి నీవంటివారిఁ గూల్ప. 25

గీ. అటులు నీవన కహాకహార్భటుల నతఁడు
జానకిని బట్టి దీర్ఘహస్తములు సాచె
శాతశరముల వానిహస్తములు రెండు
ఖండితమ్ములు చేసి యుద్దండలీల. 26

గీ. క్రోధఘూర్ణితనేత్రుఁ డుగ్రుండు నగుచు
పాదఘట్టన ఫణిరాజు వదగలదఁగ
పరుగునను వచ్చు దనుజుని పాదయుగము
ఖండనముచేసినా వుగ్రకాండములను. 27

గీ. అసురుఁ డంతట ఆకాశమంత నోరు
తెఱచి సర్పంబు వోలె నేతేర వాని
శిరము ఖండించితివి వాడిశరముతోడ
దేవదుందుభు లొక్కట దివిని మ్రోగ. 28

## విరాధకృత స్తోత్రము

గీ. దనుజదేహమ్ము నుండి గంధర్వుఁ డొకఁడు
బయలువడి వచ్చి నీ పాదపద్మయుగము
పట్టి సాష్టాంగనతులు సద్భక్తి చేసి
కరములను మోడ్చి గద్గదకంఠుఁ డగుచు. 29

గీ. రామ ! పూర్వము నేను దుర్వాసమౌని
శాపవశమున ఘోరరాక్షసుఁడ నైతి
పూర్వజన్మార్జితంబైన పుణ్యగరిమ
శాపముక్తుండనైతి నీ శస్త్రమహిమ. 30

గీ. రామచంద్రమ ! నీవు నారాయణుండ
వఖిలలోకైకనాథుండ వాత్మరూప !
జన్మనాశాదిరహితవిజ్ఞానమూర్తి
ధన్యుఁడనునైతి దేవ ! త్వద్దర్శనమున. 31

గీ. త్రిగుణరహితుండవయ్యును సగుణమూర్తి
అవతరించిన మనుజదివ్యావతార !
ఇట్టి నీ దివ్యరూపమ్ము ఎల్లవేళ
ధ్యాన మొనరించుచట్టి విజ్ఞాన మిమ్ము. 32

గీ. చేతు లెప్పుడు నీ పూజ చేయునట్లు
కన్ను లేవేళ నీ రూపె కాంచునట్లు
వీనుగవ యెప్డు నీ కథల్ వినెడునట్లు
వరము దయచేయు మిదియె నా వాంఛితమ్ము. 33

గీ. అనుచు వినుతించి గంధర్వుఁ డమితభక్తి
విమలమౌ నీదు పాదపద్మముల వ్రాల
కరుణఁగన మొల్కు కన్నుల గాంచి యతని
నీదు భక్తికి మెచ్చితి నిర్మలాత్మ ! 34

గీ. దివిజలోకమ్మునకు నేగి వివిధ భోగ
భాగ్యముల నంది నిర్మలభక్తిగరిమ
జననమరణాదిరహితమోక్షమ్ము గనుమ !
అనుచు వర మిచ్చి పంపినా వతని దివికి
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 35

ఉ. దారుణఖడ్గచాపశరధారుల మిమ్ముల గాంచి భీతిమై
క్రూరమృగమ్ములున్ జెదరి కొండగుహల్ వడిఁజొచ్చుగాని మీ
చేరువకైన రావు గద ! చెంగునదాటి కురంగశాబముల్
దూరమునుండె పారెడిని దూరు భుజంగములెల్ల పుట్టలన్. 36

గీ. పట్టపగలైన రవిరశ్మిపడని కతన
చిట్టచీకటి గ్రమ్మెడు చెట్లనీడ
విశ్రమించుచు వీనుల విందుగొలుపు
వివిధపక్షుల రుతములు వినుచుఁ జనుచు. 37

## శరభంగమౌని ఆశ్రమము

గీ. సరసఫలభారనమ్రవృక్షములతోడ
లలితపుష్పితసుకుమారలతలతోడ
సవిధప్రవహించు విమలనిర్ఝరిణితోడ
వెలయు శరభంగునాశ్రమస్థలిని జేర. 38

గీ. మానసంబున నిన్నె సంస్మరణ సేయు
యోగనిరతుండు శరభంగయోగి మదిని
నిన్నుఁ గనుగొని సద్భక్తినిరతి వచ్చి
అర్ఘ్యపాద్యాదివిధులతో నర్చచేసి. 39

గీ. మానవాకృతి ధరియించి మాయఁబూని
శిష్టరక్షణమును - దుష్టశిక్ష సేయ
అవతరించిన - ఆదినారాయణుఁడవు
ధన్యుడను నేను దేవ ! త్వద్దర్శనమున. 40

శా. లీలామానుషవిగ్రహా ! నిజమహాలీలావిలీనా ! జగ
ల్లీలానాటకసూత్రధార ! విగుణా ! లేఖేశలోకేశ శ్రీ
లీలాజాలరహస్యముల్ దెలియగా లేరన్న నేనెంత ! ఓ
వేలాతీతమహానుభావ ! ఇటు నన్ వీక్షింప నేతెంచితే ! 41

గీ. ఎంత కాలమ్ము నుండియో ఎంతొ భక్తి
ఎదను నీ దివ్యరూపమ్ము చెదరకుండ
నిలిపి ధ్యానింతు సర్వత్ర నిన్నె గాంతు
ఎంత పుణ్యంబొ నా తపమెల్ల పండె. 42

గీ. ఎంత పుణ్యంబు చేసితి నేమొ గాని
నన్నుఁ జూడంగ నిటు వచ్చినావు నీవ
నేను జేసిన తపమెల్ల నీకు రామ!
అర్పణము చేసి ఇపుడ దేహంబు విడుతు. 43

గీ. నిన్నె ఎదుటను గాంచుచు నిన్నె మదిని
ధ్యానమున నిల్పి నీలోన లీనమగుదు
అనుచు యోగాగ్ని దేహదాహంబు చేసి
జననమరణాదిరహిత మోక్షమ్ము గాంచె. 44

గీ. యోగవహ్నిని బుట్టించి యోగశక్తి
ఆహుతిని జేసి ఆత్మదేహమ్మునందు
దివ్యదేహమ్ము ధరియించి దివికి జనుట
అచటి మునినైన నేను గన్నార గంటి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 45

## దండకారణ్యవాసులైన మునులు శ్రీరాముని జూడవచ్చుట

మ. శరభంగుం డటు ముక్తిగాంచుట మహాశ్చర్యంబు సంధింప దా
శరథిన్ నిన్ను గనంగ - దండకతపస్వ్యానిష్ఠులౌ నస్మదీ
శ్వరులెల్లన్ జనుదేర మీరలు నమస్కారంబులన్ జేసి త
చ్చరణాబ్జంబులఁ బట్టి వారలను నాశాసించుచున్ భక్తిమై. 46

క. నరరూపము ధరియించిన
పరమాత్మవు రామ ! నీకు భావ్యమె యిటు మా
చరణంబులఁ బట్టుట నిన్
స్మరియించుచు ముక్తి గనఁడె శరభంగుఁ డిటన్. 47

గీ. నాడు తాటక నొక్క బాణమునఁ గొట్టి
శాపముక్తను జేసి తాశ్చర్యమెసఁగ
రామ ! నే డిట ఘోరవిరాధ దనుజు
శాపముక్తుని జేసె నీ శస్త్రవహ్ని. 48

గీ. శాపవశమున అటులు పాషాణమైన
అల్ల గౌతమపత్ని నహల్య నపుడు
పాదధూళిని శాపంబు బాపినావు
పాదరజమును నీ శాత బాణ మొకటె ! 49

గీ. రామ ! దండకమునిజనాశ్రమము లెల్ల
పరమపావన త్వత్పాదపద్మధూళి
పావనము సేయ రావోయి ! పరమపురుష
మునిజనమ్ముల ఆతిథ్యములను గొమ్మ ! 50

గీ. మునుల వెంటను జనుచు నవ్వనమునందు
ఎంపప్రోవులఁ గని యివి యే మనంగ
రఘుకులోత్తమ ! ఈ అస్థిరాశులెల్ల
అసురభక్షితమౌనిజనాస్థిచయము. 51

గీ. మనుజభుక్కుల నెల్ల భస్మమ్ము సేయ
శక్తి గలిగియు మును లిట శాప మీరు
శాప మిచ్చిన నిజ తపశ్శక్తి యెల్ల
పోవునని శాప మీయంగఁ బోము మేము. 52

గీ. రాక్షసులఁ జంపి మునిజనరక్ష సేయ
అవతరించితి వీవు రామావనీశ!
కాన శ్రీరామ! సకల రాక్షసుల గూల్చి
సకలసజ్జనమౌనిరక్షణము సేయు. 53

చ. అని మునులెల్లఁ బల్కఁగ మహాకరుణాన్వితమానసుండవై
దనుజుల నెల్లఁ జంప శపథంబును జేసి మునీంద్రులార! మీ
మనమున భీతిశంకలను మానుఁడు దండక నిర్భయమ్ముగా
మనుఁ డని పల్కి మౌను లిడు మన్నన లందితి గాదె రాఘవా!

గీ. జనకనందిని - అనుజలక్ష్మణుల తోడ
అమ్మునీంద్రుల పుణ్యాశ్రమమ్ములందు
కొన్ని వర్షంబు లట నుండి కోర్కెదీర
మునుల అనుమతి వడసి అవ్వనము వీడి. 55

## శ్రీరాముడు - సుతీక్ష్ణాశ్రమమునకు ఏగుట

గీ. అటులు సని సని అల సుతీక్ష్ణాశ్రమమ్ము
చేర నాతండు మిము గాంచి శీఘ్రగతిని
వచ్చి కడుభక్తి తన్మయత్వమ్ము చెంది
అర్ఘ్యపాద్యాదు లిచ్చి సమర్చ చేసి. 56

గీ. ఆశ్రమమ్ముకుఁ దెచ్చి దర్భాసనముల
సముపవిష్టుల గావించి సన్నుతించి
దివ్యఫలమూల ఐతతి నాతిథ్య మిచ్చి
భక్తి గద్గదకంఠుఁడై పలికె నిట్లు. 57

గీ. రామ! త్వన్మంత్రజపము నిరంతరమ్ము
చేయుటను జేసి యిటులు వచ్చేసినావె!
పూర్వభవముఁ జేసిన పుణ్యమెల్ల
పండె నాడగు జన్మ సాఫల్యమందె. 58

## సుతీక్ష్ణునకు మోక్షప్రదానము

గీ. వేదవేదాంతములె నిన్ను వినుతిసేయఁ
జాలవన నేను వినుతింపఁ జాలు దెట్లు?
నీదు భక్తుండ నిరతమ్ము నిన్నె గొలుతు
నిన్నె ధ్యానింతు మదిలోన నిన్నె గాంతు. 59

క. అనుచు సుతీక్ష్ణుఁడు జలజల
కనుగొలుకుల మోదబాష్పకణములు రాలన్
నిను గాంచుచు రామా! నా
మనమున నీరీతి నుండుమా! అని వేడన్. 60

క. మునిభక్తికి మది మెచ్చుచుఁ
గనుగొని కరుణార్ద్రనేత్రకలితుఁడ వగుచున్
వినుము సుతీక్ష్ణా! నీ వక
జననాదులు చెనియట్టి సద్గతి గనుమా! 61

చ. వర మిటు లిచ్చి ఓ పరమపావనజన్మ! సుతీక్ష్ణ! మేము మీ
గురుని నగస్త్యమౌని గనఁ గోరికమై యిటు వచ్చినార మా
తెరువును జూపుమన్నఁ జనుదెంతును నేనును రామ! రేపు మా
గురువరు జూడఁ బోవుదము కూర్మి వసింపుము నేడు మా కుటిన్.

గీ. అనుచుఁ బ్రార్థింప నాతని ఆశ్రమమున
నాడు సద్గోష్ఠి గడపి మర్నాడు మీరు
కాల్యకృత్యమ్ములను దీర్చి కదలినారు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 63

## అగస్త్యభ్రాతను దర్శించుట

గీ. అటుల నేగుచు మార్గమధ్యమ్మునందు
అల అగస్త్యుని భ్రాతృ సదాశ్రమమ్ముఁ
గాంచి ఆతని దర్శించి కరము భక్తి
అతఁడు గావించు ఆతిథ్య మందుకొనిరి. 64

గీ. శాంతిపదమౌచు మిగుల విశ్రాంతి గూర్చు
అమ్మహాముని రమ్యాశ్రమమ్మునందు
నాటి దినమెల్ల మౌనిజనమ్ము గోష్ఠి
గడపి మఱునాడ ఏగి రగస్త్యుఁ జూడ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 65

## అగస్త్యమౌనీంద్రుని ఆశ్రమము

చ. సురుచిరపత్రపుష్పఫలశోభిత వృక్షలతావితానమున్
సరసఫలావనమ్రసురసాలవిశాలవనప్రదేశమున్
పరమపవిత్రమున్ - వరతపస్విజనాంచిత పర్ణశాలమున్
కరము మనోజ్ఞమై తగు నగస్త్యమునీంద్రు తపోవనం బటన్.

సీ. ఒకచోటఁ గాన్పించు - ఉన్నతస్థాయిని
వేదముల్ సెప్పెడు వేదవిదులు
ఒకవంకఁ గన్పడు - ఉచ్చైస్స్వరమ్మున
గానమ్ము సేయు నుద్గాతృవరులు

ఒక త్రేవఁ గనిపించు హోమవేదికలందు
హోమముల్ చేసెడి హోతృగణము
ఒక దెసఁ గనవడు ఉత్తరమీమాంస
మంత్రార్థములు దెల్పు మంత్రవిదులు
బ్రహ్మలోకమ్మొ ! అది పరబ్రహ్మపదమొ
భువికి వచ్చిన అల సప్తభువనచయమొ
అనఁగ చెలువొందు ఆ అగస్త్యాశ్రమమ్ము
గాంచినారలు మీర లుత్కంఠమీర
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర !

గీ. సహజశత్రుత్వమును వీడి జంతుగణము
కలసి చరియించు నచట సఖ్యంబుతోడ
ఛాత్రగణములతో నెల్ల శాస్త్రములను
చర్చ చేసెడు నట శుకశారికములు.

గీ. తరుల నీడల అందందు గురులయొద్ద
వేదవేదాంగశాస్త్రాదివిద్య లెల్ల
చదివి చర్చింతు రయ్యెడ ఛాత్రగణము
ఆశ్రమ మ్మది విశ్వవిద్యాలయమ్ము.

గీ. శాంతిపదమైన యట్టి ఆశ్రమము చూపి
అదియె జానకి ! కను మగస్త్యాశ్రమమ్ము
పుణ్యపురుషుండు త్రైలోక్యపూజితుండు
అతని చరితంబు వినుము మహాద్భుతంబు.

## అగస్త్యమౌనీంద్రు మహిమాదులు

సీ. మేరువుపై తీర్ష్య మిన్నంట నెదిగిన
వింధ్యాద్రిగర్వంబు విరిచె నితఁడు
అంభోధిగర్భంబునందు దాగిన క్రూర
దనుజులతో వార్ధిఁ ద్రావె నితఁడు

ఇంద్రపదవి గాంచి ఇంద్రాణి గోరిన
నహుషుని శపియించినా డితండు
మునులవేషము దాల్చి మునులను హింసించు
వాతాపి మ్రింగినవాఁ డితండు
అఖిలలోకేశు లెల్ల వియచ్చరులును
అచ్చెరువు చెందునట్టి కార్యంబు లెన్నొ
చేసి లోకమ్ము లెల్ల రక్షించె నితఁడు
ఇతని కీడైన మునిచంద్రుఁ డెందులేఁడు. 71

## శ్రీరామచంద్రుడు అగస్త్యమునీంద్రుని దర్శించుట

క. అనుచు సుతీక్ష్ణుం గనుగొని
మునిచంద్రమ ! మీ గురూత్తములకున్ మా రా
కను దెల్పుడి— అనగాఁ దాఁ
జని సాగిలి మ్రొక్కి గురుల చరణంబులకున్. 72

క. మునిపూజిత ! శ్రీరాముఁడు
జనకజసౌమిత్రి గూడి చనుదెంచెను— పా
వనచరితుఁడు మిముఁ జూడగ
ననినంత నగస్త్యమౌని అతిమోదమునన్. 73

గీ. అర్ఘ్యపాద్యాదులం గొని అరుగుదేర
మునినగస్త్యుని గనుగొని ముందునిలిచి
అతులభక్తిని సాష్టాంగనతులు మీరు
సేయఁగా నిన్ను గౌగిటఁ జేర్చి మౌని. 74

గీ. పరమకారుణికోత్తమా! పరమపురుష!
శిష్టరక్షార్థమును – దుష్టశిక్ష సేయ
అవతరించిన ఆదినారాయణుఁడవు
మనుజరూపమ్ము దాల్చిన మాధవుఁడవు. 75

గీ. ఆదిలక్ష్మియె సీతయై అవతరించె
ఆదిశేషుఁడె లక్ష్మణుండయ్యె గాదె!
లోకకల్యాణకాంక్ష – త్రైలోక్యనాథ!
అవతరించినవాఁడ వీ వజుఁడు వేద. 76

గీ. ఎఱిఁగి యెఱుగనె యట్టులె ఏము నుందు
మతిరహస్యము పరమగోప్యంబు నగుట
రమ్ము దయచేసి మా ఆశ్రమమ్ము నెల్ల
పావనము సేయుమోయి! నీ పాదధూళి. 77

క. అని మిమ్ముల తన యాశ్రమ
మునకున్ గొనిపోయి పీఠములనిడి విధిమై
ఘనభక్తిని ఆతిథ్యం
బొనరించె నగస్త్యుఁ డాత్మయోగముతోడన్. 78

## అగస్త్యుడు శ్రీరామునితో నాడిన మాటలు

సీ. రామ! ఈ దండకారణ్యసీమను నీవు
వసియింపవలె శేషవత్సరములు
ఈ వనినుండి నీ వింక నెన్నెన్నియో
దేవకార్యములు సాధింపవలయు
ఓ దేవ! ఇటనుండి యోజనద్వయ మేగ
వన మున్నదట పంచవటి యనంగ

ఆ వనిశ్రేవ గోదావరి ప్రవహించు
దివ్యవాఃపూర్ణ నదీమతల్లి
ప్రకృతిసౌందర్య విలసితభవ్యసీమ
అవనిజాతకు నెంతొ ప్రియమ్ము గూర్చు
అచట వసియుంచి ఎల్లకార్యములు దీర్చు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 79

ఉ. రాక్షసకోటిఁ ద్రుంచుటకు రామున కిమ్మని- ఇంద్రుఁ డిచ్చె ఈ
అక్షయబాణతూణయుగ మాహవభీమధనుఃకృపాణముల్
రూక్షతరాస్త్రశస్త్రములు రూథమహాకవచాదులన్నియున్
దక్షుఁడ వీవ ! వీని గొని దారుణరాక్షసులన్ వధింపుమా ! 80

క. అని తెచ్చి ఇంద్రుఁ డిచ్చిన
ఘనకార్ముకశస్త్రతూణకవచాదికముల్
ముని యిచ్చిన వానిని గై
కొని, వా రాశీస్సు లీయఁ గొంటివి గాదే ! 81

## జటాయువుతో పరిచయము

క. మునిచంద్రుని ఆమంత్రణ
మును గొని చనుదెంచు మీరు ముందట నొకచో
గనుగొంటిరి శైలము నా
ఘనదేహముతోడ నొప్పు కంకఖగేశున్. 82

క. కని దనుజుండని కేలన్
ధనువును గొనునంత నేను దనుజుఁడ గా నో
ఘనసుందర ! నే దశరథ
జననాయకుసఖుడ, గృధ్రజాతిని గనుమా ! 83

క. అన- గృధ్రము గని నే నా
జననాథుని సుతుఁడ- రామచంద్రుఁడ విను మీ
జనకాత్మజ నా సతి, ఇతఁ
డనుజుఁడు నీ వెవరవోయి ! అండజరాజా ! 84

గీ. అనిన ఆ గృధ్రవల్లభుం డధికభక్తి
అనఘ ! కనుగొంటి నిన్ను పుణ్యమ్ముకలిమి
ఏ జటాయువు ననువాఁడ ఇనకులేశ !
సూర్యసారథియైన- అనూరుసుతుఁడ. 85

గీ. ఇటకు మీ తండ్రి దశరథుఁ డెపుడు వేడ్క-
వేటకై వచ్చి పోయెడి వేళలందు
అతనితోడను గూడె సఖ్యంబు నాకు
పంచవటియందు నేను వసించువాడ. 86

గీ. మీర లెపుడైన వేటకై దూర మేగ
జనకజాతకు నేను రక్షణగ నుందు
అని జటాయువు పల్కఁగా నతని గాంచి
అటులె చేరువుగా నుండుమంటి వీవు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 87

## పంచవటి - పర్ణశాల

గీ. అరుణపుత్రు జటాయువు ఆమతించి
అతని వీడ్కొని చని చని అమలవారి
పూరగోదావరీనదీతీరభూమి
సాంద్రతరుషండశీతలచ్ఛాయ నడచి. 88

ఉ. అంచితపత్రపుష్పఫలహారిలతాతరుశోభితమ్ము, ప్రా
పంచిక చింతనామలినభావవిదూరము, పుణ్యనీరమున్,
సంచితపుణ్యమౌనిజనశాంతము, కాంతమృగప్రచారమున్
కాంచనవృక్షశోభితము, కాంచిరి పంచవటీప్రదేశమున్. 89

సీ. ఒకవంక– ప్రవహించు ఉజ్జ్వలతలూగుచు
దక్షిణగంగ గోదావరమ్మ
ఒకచోట– గనిపించు ఒయ్యారపుం గతి
తాండవించు మయూరమండలమ్ము
ఒకత్రోవ– వినుపించు శుకశారికాస్వర్ణ
కలవింకకుల కల కల రవమ్ము
ఒకచోట– నినదించు ఒలసి కొండలబాఱు
నిర్ఝరీపాత నిస్వనమ్ము
ప్రకృతిసౌందర్యవిలసితభవ్యసీమ
అరసి అచ్చట నిర్మించె నాశ్రమమ్ము
లక్షణమ్ముగ అనుజుండు లక్ష్మణుండు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 90

సీ. అన్నకు– వదినెకు అందమ్ముగా నందు
ప్రాక్పశ్చిమమ్ముగా– పర్ణశాల
తీరిచి, దక్షిణోదీచిగా తన కొక
పర్ణకుటీరము భవ్యమతిని
నిర్మించి, చుట్టును నెలకొల్పి కంచెను
రమణీయమైన ద్వారమ్ము నెత్తి
మల్లికాకురవకమాలతీవకుళాది
బహుపుష్పలతలను పాదుకొల్పి

సారకర్పూరకదళీరసాలపనస
నారికేళాదివృక్షసంతతుల నాటి
అందములు చింద మీర లానంద మంద
ఆశ్రమము దీర్చె లక్ష్మణుం డశ్రమమున. 91

## పంచవటిలోన శ్రీరాముని దినచర్య

సీ. ప్రతిదినంబును నీవు పావనగౌతమీ
జలముల వేకువాత స్నానమాడి
అర్ధోదితుండైన ఆదిత్యునకు మ్రొక్కి
అతిభక్తి వెలయ అర్ఘ్యంబు లిచ్చి
సాంధ్యకృత్యము దీర్చి సావిత్రి జపియించి
పూజాదికమ్ములు పూర్తి చేసి
అఖిలలోకమ్ముల కాదర్శమూర్తివై
నిత్యకర్మాచారనిష్ఠ నిలిచి
సకలమౌనులతోడుత సభను దీర్చి
వేదవేదాంగచర్చ గావింతు వెపుడు
పంచవటి మీ కయోధ్యగా పరిణమించె
పర్ణశాలయె శ్రీరాజభవనమయ్యె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 92

## సీతాదేవి - దినచర్య

సీ. రేపాడి వసుపాడి శ్రీజానకీదేవి
తిలకమ్ము నుదుటను - దీర్చి దిద్ది
తగడు బంగరుకాంతి తళుకులీనెడు మేన
రమణీయ క్షౌమచీరంబు గట్టి

గంధాక్షతముల సౌగంధ్యపుష్పమ్ముల
　　లలితాంబికాపూజ నెలమిఁ జేసి
నీ పాదములపూజ నిండుభక్తిని జేసి
　　సేవించు మఱది నాశీర్వదించి
తన్నుఁ జూడంగవచ్చు తత్రత్యలైన
మునులకాంతలతోడుత ముచ్చటించి
అంతిపురిలోనఁ దా నున్నయట్లె యుండ
కంటి నా నాడు నే మునికాంత నౌచు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 93

## లక్ష్మణుఁడు గావించు పరిచర్య

గీ. వన్యఫలములు - గౌతమీవారి దెచ్చి
పూజ గావింప - కమ్మనిపూలు తెచ్చి
వదినె సీతకు నీకు సేవలను జేయు
అనుగుఁ దమ్ముఁడు లక్ష్మణుఁ డనుదినమ్ము. 94

ఉ. తేనియలూరి కారు కడు తీయనిపండులు కమ్మనైన పూ
దేనియపట్టుదొన్నెలును తీయని ద్రాక్షఫలంబు లిక్షువుల్
కానల కోనలన్ వెదకి కమ్మని ఆమ్రఫలంబు లెల్ల నెం
తేనియు భక్తితోడుతను దెచ్చును లక్ష్మణుం డెల్లవేళలన్. 95

ఉ. అన్నవు నీకు నా వదినె కాత్మరభావముతోడ నిచ్చలున్
క్రొన్నన మొత్తముల్ నునుపుఁ గ్రొంజిగురాకులు దెచ్చి సెజ్జలన్
విన్నను వొప్పగా నిదురవేళ కమర్చుచు రాత్రులందుఁ దాఁ
గన్నును మూయకుండ మిముఁ గాచును గాదటె
　　లక్ష్మణుం డటన్. 96

గీ. అనఘ సౌమిత్రి మిమ్ము నహర్నిశంబు
అట్లు సేవింప పంచవట్యాశ్రమమున
హాయిగా నుండిరటఁ గొన్ని హాయనములు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర !

## శూర్పణఖ రాముని గాంచుట

సీ. మాహేంద్రమణినీలమంజులదేహుండు
ఇందీవరశ్యామసుందరుండు
సద్యోవినిర్భిన్నసరసిజమ్ముల నేలు
అంభోజపత్రనేత్రాంచితుఁడు
కరికరంబుల నేలగా జాలు దీర్ఘమౌ
ఆజానులంబి బాహాద్వయుండు
భావజభాసురభద్రపీఠము నేలు
చారుశృంగారవక్షస్థలుండు
రవికి నీడైన తేజోవిరాజితుండు
ఎంత చక్కనివాఁ డహో ! ఈతఁ డెవఁడొ ?
కందుఁడౌ నేమొ లేక వసంతుఁ డేమొ
ఈతనిం బోలు సుందరుం డెందు లేఁడు. 8

గీ. పూర్ణచంద్రుని– పుడుడించు మోముతీరు
కమలదళముల నేలును– కనులసొబగు
కాముపీఠమ్ము గెలుచు వక్షమ్ముసొంపు
తీవి చూడంగ తోచు కంఠీరవమ్ము. 9

గీ. అనుచు నిను జూచి మోహమ్ము నాపలేక
సిగ్గు విడనాడి దివి నుండి డిగ్గివచ్చి
కామరూపమ్ము గొని దివ్యకాంతవోలె
చెంత నిలిచిన ఆ వింతకాంతిఁ గాంచి
అంటి విట్టులు సుంత హాస్యమ్ము దోప. 100

గీ. భువనసుందరి ! దివి నుండి భువికి డిగ్గి
వచ్చుటది చూడ ఆ సురవనిత వేమొ !
ఎవరిదానవు ? నీ మది నేమి గోరి
వచ్చితివొ తెల్పు తెల్పుగా వచ్చునేని. 101

గీ. అనుచు నీ విట్టు లడిగిన- అంత నామె
భువనసుందరి అనుచు సంబోధనమ్ము
చేయుటను జేసి మొగమంత చేసికొనుచు
సొలుపుఁ జూపుల నిన్నుఁ దాఁ జూచి పలికె. 102

గీ. రాక్షసేశ్వరుఁడైన- ఆ రావణునకు
అనుగుసోదరి నగుచు ననంతమూర్తి !
శూర్పణఖ అంద్రు నన్ను నో సుందరాంగ !
నీదు చరితమ్ము చెప్పుమా నీరజాక్ష ! 103

గీ. అనిన నీవును మందస్మితాననమున
ఓ యసురకాంత ! విను నే నయోధ్య నేలు
దశరథేశ్వరు తనయుండ ! తండ్రియాజ్ఞ
వనము నేలంగ వచ్చినవాఁడ నేను. 103

గీ. రాముఁడను నేను, ఈమె నా రమణి సీత,
అనుజుఁ డాతండు— లక్ష్మణుం డఁడ్రదు వాని
అఁపుచు నీ వంటి వాసురవనితతోడ
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర !

గీ. అంత నా శూర్పణఖ కొంత చెంతఁ జేరి
కామపరవశనై తి నిన్ గాంచి నంత
రామ ! నాతోడ విహరింప రమ్మటంచు
సిగ్గు విడనాడి పల్క విస్మితుఁడ వగుచు.

గీ. పడతి ! నే నేకపత్నీవ్రతుఁడను, నాదు
తమ్ముఁ డాతఁడు నీకును దగినవాఁడు
లక్ష్మణుం డాతఁ డెంతో సులక్షణుండు
అతనిఁ గోరుము పోయి నీ వనుచెతదవు

లక్ష్మణుఁడు శూర్పణఖ ముక్కు సెవులు గోయుట

గీ. లక్ష్మణున్ డాసి ఆమె సులక్షణుండ !
వలచివచ్చినదాన నో వన్నెకాడ !
రమ్ము క్రీడింత మిందు నీ రమ్యభూమి
అనిన నాతండు నవ్వుచు ననియె నిట్లు.

గీ. అతఁడు రారాజు— నే నన్న అతనిపాద
దాసుఁడను, తన్వి ! ననుజేరి దాసివగుదు
రాజరా జాతఁ డేలిన రాణివగుదు
మరలఁ బ్రార్థించు మతని నో మగువ ! అనిన.

ఆ. మరులుగొన్నదగుట మరల నీ దరిఁజేరి
కామవశను నన్ను గాదునాక
ఏలుకొమ్ము రామ ! ఇంక నిన్ విడఁజాల
మగువ బాధపెట్టఁ దగునె ? యనుచు. 110

ఉ. కామపరీత శూర్పణఖ కామము మోహము నాపలేక, ఓ
కామసహస్రసుందర ! సకామను నన్గని ఏలుకొమ్ము, ఈ
భామిని యున్నదంచు మది భావనసేయుదువేని ఇప్డు డీ
భామను మ్రింగుదే ననుచు రాక్షసి సీతను బట్టవచ్చినన్. 111

ఆ వె అంత లక్ష్మణుండు అన్నవౌ నీ యాజ్ఞ
మొగుద జుట్టుపట్టి ముందుకీడ్చి
ముక్కుఁ జెవులు గోసి రక్కసి ! పొమ్మంచు
కసరి మెడనుపట్టి విసరినెట్టె. 112

## శూర్పణఖ ఖరదూషణాదులతో తన భంగపాటును చెప్పికొనుట

ఉ. బోరున నేడ్చుచున్ జెవుల ముక్కున నెత్తురులోడి గిల్లుచున్
ధారలుగట్టి జార అతి దారుణరూపము దాల్చి సోలుచున్
దూరమునందు నున్న ఖరదూషణసోదరు లున్న కానకున్
పారెను వేగ శూర్పణఖ బంధురకోపభరాభిభూతయై. 113

క. ఉరమును శిరమును దబ దబ
కరములతో మోదుకొనుచు ఖరదూషణసో
దరులను గాంచి వగర్చుచుఁ
బరుషంబుగ నిట్లు కోపభరమునఁ బల్కెన్. 114

ఉ. అన్నలు ! మీర లెన్నఁగ మహాబలవిక్రమబాహుదర్పసం
పన్నులు — మీర లుండఁగను మానవుఁ డొక్కఁడు కిన్నుగాని
తెన్నున ముక్కునున్ జెవులు తేకువతోఁ దుత కోసినాఁడు ఁ
చ్చన్నటి వాఁడు — వాని నటు ఆ ఖలు రాముని జంపుఁ
డీ వెసన్.

ఆ. చేతగానివారు చెంతన యున్నట్టి
మానవులను జంప మరచినారు
రామ-లక్ష్మణు లను నామముల్ గలవారు
రాముఁ డందు — తా విరాధుఁ జంపె.

ఆ. ఇంత యెఱుకలేక ఇన్నాళు లుంటిమి
కాంతతోడ దండకావనమ్ము
చేరి దనుజకోటి శిక్షింప శపథమ్ము
చేసె రాముఁ డంట చెప్ప వింటి.

క. అని యేడ్చుచు వినిపించిన
ఘనరోషాక్రాంతులగుచుఁ గార్ముకధరులై
విను మిప్పుడ ఆ నరులను
దునిమెద మింతింత తనువు తునియలు గాఁగన్.

### ఖరదూషణాదులు దండు వెడలి వచ్చుట
### రామచంద్రుడు వారిని వధించుట

ఉ. వారలు క్రోధమూర్తు లనివార్యపరాక్రమశాలు లందఱున్
దారుణఖడ్గశూలములు దాల్చి వెసన్ — పదునాల్గువేలకున్
మీరిన సైన్యమున్ గొనుచు మిన్నును మన్నును నాక్రమించి, దు
ర్వారరణాభిలాషులయి వచ్చిరి మీపయి దండయాత్రకున్. 119

మ. అదిగో- లక్ష్మణ! ధూళి రేగె దివిపై ఆ దిక్కునన్ గాంచుమా!
అదె- కోలాహల మాలకింపు మదిగో- ఆ రాక్షసీప్రేరణన్
కదనావేశను- క్రూరరాక్షసులు వేగన్ వచ్చుచున్నారు-. మీ
వదినెన్ జూడుము నీవు, నేను దనుజవ్రాతమ్ము గూల్తున్ వెసన్. 120

క. అని అనుజున కానతి నిడి
ధనువును జేపట్టి మేరుధరణీధర మో
అన నిలిచి యెదురు దనుజుల
ఘనశస్త్రాగ్నులను గాల్పఁగాఁ గని కినుకన్. 121

చ. ఖరుఁడును దూషణుండు ఘనకార్ముకముల్ ధరియించి వీఁకమై
ఖరతరశస్త్రముల్ గురియగా వెస వానిని దున్మి నీవు భీ
కరమగుమూర్తి ఉగ్రుఁ డగఁగాఁ దగి దివ్యమహాస్త్రజాలముల్
వరపి క్షణమ్ములో సపరివారముగా ధరఁగూల్చి నంతటన్. 122

క. కనుగొని త్రిశిరుఁడు వీఁకన్
ఘనశూలము పట్టి నిన్నుఁ గవిసిన యంతన్
సునిశితశరమున శిరమును
దునుమగ దివి మ్రోగె దేవదుందుభు లంతన్. 123

గీ. క్షణములో నీవు సర్వ రాక్షసులఁ గూల్చి
వచ్చినంతనె- జానికి మెచ్చి నిన్ను
గాఢముగఁ గౌగిటను జేర్చి గారవించె
లక్ష్మణుండును నిన్నెంతొ ప్రస్తుతించె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 124

## శూర్పణఖ రావణుని యొద్దకు వచ్చుట

క. అది గని ఆ శూర్పణఖయు
మదిలో భయమంది మింటిమార్గము వెంటన్
పదములు తొట్రిలఁ జని దశ
వదనుని పాదముల సోలి వాలెన్ వెతమై. 125

క. వచ్చిన శూర్పణఖను గని
అచ్చెరువును జెంది రావణాసురుఁ డెదలో
నొచ్చి, యిదేమని యెంతయు
రెచ్చిన కోపమున సోదరిం గని పలికెన్. 126

క. ఎవఁ డిటు సోదరి ! నీదగు
చెవులును నాసయును గోసెఁ జెప్పుమ నాకున్
వివరంబుగ— ఆతని యమ
భవనంబున కతిథిగాగఁ బంపెద నిపుడే. 127

## శూర్పణఖ రావణునకు తన పరిభవాదులను చెప్పుట

సీ. దశరథేశ్వరు జ్యేష్ఠతనయుండు రాముండు
జనకాజ్ఞ దండకవనికి వచ్చి
త్రైలోక్యసుందరి తన సతి సీతతో
అనుజన్ముఁడైన లక్ష్మణునితోడ
చారుగోదావరీతీరంబునందున
వటవృక్షవృతపంచవటిని జేరి
చక్కఁగ నట పర్ణశాలను నిర్మించి
తమ్ముండు సతియును దన్ను గొల్వ

హాయి నుండగ నేను విహారమునకుఁ
బోయి గాంచితి నాతని పుణ్యసతిని
అమరగంధర్వసిద్ధసాధ్యాదిదివిజ
కాంత లేరును బోల రా కాంత కెందు. 128

క. అపురూప మ్మా రూపము
త్రిపురమ్ముల మనుజనాగదేవాంగన లే
రుపమింప సాటిగాగా
నృపవల్లభ కహహా ! ఆమె నీకుం దగుగా. 129

క. అట్టి తరుణిని నీకు నర్ధాంగి సేయ
అపహరింపఁగ డాసితి- అన్న యాజ్ఞ
అతని తమ్ముఁడు లక్ష్మణుం డంత నాదు
ముక్కు సెవులను గోసె నా పుష్కరుఁడు. 130

చ. పరిభవ మంది ఆ గతిని పాటి ఖరాదుల కెల్ల దెల్పగా
ఖరఖరదూషణత్రిశిరు లఖర్వపరాక్రమఘోరమూర్తులై
పరిఘగదాత్రిశూలఘనపట్టిసకార్ముకశస్త్రధారులై
అరిగిరి వే చతుర్దశసహస్రబలంబులతోడ శూరతన్. 131

ఉ. వచ్చిన రాముఁ డొక్కరుఁడె వారలతోడుత పోరు సల్పగా
వచ్చి ధనుర్ధరుండయి అవార్యపరాక్రమశౌర్యధుర్యుఁడై
వ్రచ్చె మహాస్త్రశస్త్రముల వారల నెల్లర నొక్కవ్రేట్మిడిన్
అచ్చెరు వంది దివ్యులు జయధ్వనులన్ వినుతించి రాతనిన్.

గీ. ఇంత జరిగిన నీ వేమి ఎఱుఁగ వయ్యొ
చారు లెవ్వరు తెలుపంగ లేరె నీకు
ఘోరరణమునఁ జచ్చిరి వార లెల్ల
ఔర ! రాజువు నీ వెట్టు లౌదొ చెపు. 133

గీ. రాముఁ డాతండు ఘోరవిరాధుఁ జంపి
మునులు ప్రార్థింప తమ కష్టములను దెల్పి
శపథముం జేసె సర్వరాక్షసులఁ జంప
పాపమత్తుఁడవయి ఏమి గాన వీవు. 184

క. అనినంతనె దశకంఠుఁడు
కనుగొనలందుండి అగ్నికణములు రాలన్
విను సోదరి ఆ నరులను
ఘనఖడ్గముతోడ ఖండఖండము సేతున్. 185

గీ. అట్టి ఖరదూషణాదుల నాతఁ డొకఁడె
క్షణములోఁ జంపె నతఁడు సాక్షాచ్ఛివుండొ!
రాముఁ డాతండు చూడ నారాయణుండొ!
అతని నెదిరింప నీకు సాధ్యంబు కాదు. 186

క. ఆ వనజాక్షిని సీతను
కావలుఁగు వారిఁ జంపి కదకన్ దెత్తున్,
పో విడువుము దుఃఖమ్మును
రావణుఁడను లెక్కసేయ రామున్ గీమున్. 187

గీ. మూఁడు లోకాల గెలిచినవాఁడ నేను
వీరవరుఁడను అనుచు గర్వింపరాదు
మూఁడులోకాలు ఏకమై మొనసివచ్చి
రాముఁ గెలువంగలేవు దుర్వారుఁ డతఁడు. 188

గీ. రామ-లక్ష్మణు లుండంగ రమణి సీత
అపహరింపంగ నీకు శక్యమ్ముకాదు
బూమెచే వారి నెటొ దూరభూమి కంపి
మాయచే నామె నపహరింపంగవలయు. 189

అని సోదరి పల్కఁగ నా
మెను దా నోదార్చి పంపి మీదున్ గనుచున్
జని మారీచుని ఆశ్రమ
మునకున్ మాయావి గాంచె మునివేషధరున్. 140

## రావణ మారీచుల సంవాదము

రావణుని గాంచి అతఁడు సంభ్రాంతి చెంది
ఎదురుగాఁ బోయి ఆసన మిచ్చి నిలిచి
అర్ఘ్యపాద్యాదివిధులతో అర్చనేసి
భయము భక్తియు— పెనగొనఁ బలికె నిట్లు. 141

రాక్షసేశ్వర ! ఏమి కార్యంబు గలదొ !
అరుగుదెంచితి విట్లు స్వయముగాగ
కబురు పంపిన రానె ఏకాంతమునకు
ఆజ్ఞ దయచేయుఁ డేమి సేయంగవలయు. 142

అనిన మారీచ ! కలదు కార్యం బొకండు
రాముఁ డనువాఁడు దశరథరాజసుతుఁడు
తండ్రి యాజ్ఞను దలఁ దాల్చి తరుణితోడ
అనుజుఁడౌ లక్ష్మణునితోడ నరుగుదెంచి 143

దండకాటవి నుండె ఆ చండబలుఁడు
అతఁ డీనాడు క్రొవ్వి నిర్హేతుకముగ
నాదు సోదరి ఆ శూర్పణఖను గొట్టి
ముక్కు చెవులను గోయించె ఉక్కలుండు. 144

గీ. ఈవు మాయామృగమ్మవై ఇపుడ పోయి
మాయలం బన్ని రామలక్ష్మణుల నెట్లొ
దూరభూమికి గొనిపొమ్ము తోడ నేను
అపహరింతును మాయచే నతని సతిని. 145

గీ. అసురవల్లభ! పరదార నపహరింపఁ
దగునె యిట్టులు? పరతపోధనుఁడ వీవు
ఓయి దనుజేంద్ర! నీ కీ ఉపాయ మెవరు
చెప్పినారయ్య! దీనిచే చేటు వచ్చు. 146

సీ. కౌశిక యజ్ఞరక్షణము సేయఁగ వచ్చి
పదునాలుగేడుల ప్రాయమందు
నా తల్లి తాటక నాగాయుతబలాఢ్య
లీల నాతం డొక్క కోలఁ గూల్చె
బలశాలియైన సుబాహు నా తమ్ముని
శస్త్రాగ్ని నితఁడు భస్మమ్ము చేసె
వాయవ్యాస్త్రమున నన్ను వారిధిఁ బడఁద్రోసె
క్షణములో సకల రాక్షసుల జంపె
పూర్వవైరమ్ము మదిలోనఁ బూని నేను
దండకాటవి వారిట నుండ పొంచి
మాయచే వానిఁ జంపంగఁ బోయి అతని
శస్త్రఘాతమ్మువడి వనస్థలినిఁ బడితి. 147

గీ. రాము నెఱుఁగుదు నేను పూర్వమ్మునుండి
అజుఁడు ప్రార్థింప ఆదినారాయణుండె
దుష్టరాక్షసులను జంపి శిష్టరక్ష
సేయ భువి పుట్టె ననుచును చెప్పవింటి. 148

గీ. మానవుఁడు గాఁడు రాముండు - మాధవుండు
అవతరించెను దనుజవధార్థ మతఁడు
రాముతోడుత నిట్లు వైరమ్ము గొనుట
కొఱవితోడుత తల గోకికొనుట గాదె ! 149

గీ. అతని పే ర్విన్నయంత భయంబు గదురు
రాముతోడుత నీకు వైరమ్ము తగదు
అతని భార్యను మాయచే నపహరించి
దాపు కొనితెచ్చుకోకు రాక్షసగణేశ ! 150

మ. అని మారీచుఁడు వల్క రావణుఁడు కోపావేశరూక్షాక్షుఁడై
పనమం దించుక శంకలేక యిటులన్ మా శత్రువర్ణింతు నీ
జననిన్ దమ్ముని జంపి, వారినిధి నిన్ జావన్ద్రోసి కారించు నా
మనుజున్ స్తోత్రముచేయు దిట్టు లహహా మా ముందె నీచాత్మకా!

గీ. రాముఁ డాతండు నిజము నారాయణుండె ?
మమ్ముఁ జంపంగ వచ్చిన మాధవుండె ?
అయిన నాతఁడు మ మ్మవశ్యమ్ము చంపు
మానవుండైన ఆ సీత మాకుఁ దక్కు. 152

గీ. పొమ్ము శీఘ్రమ్ము మాయామృగమ్ము వౌచు
మాకు నీతులు సెప్పట మాను మింక
ఆలసించిన ఈ చంద్రహాసధార
శిరము ఖండింతు నింక దుశ్చింత మాను. 153

గీ. రావణుం డింక వినఁడు దుర్మార్గగామి
ఇతనిచే నింక నిపుడు నే హతుఁడనైన
నిరయలోకమ్ముఁ జేరుట నిశ్చయమ్ము
కానఁ బోయెద మాయామృగమ్ము నగుచు. 154

గీ. రాముఁ డాతండు తాను నారాయణుండ
అతని బాణాగ్నిచే నేను హతుఁడనైన
జననమరణాదిరహితమోక్షమ్ము గందు
అనుచ దలపోసి మారీచుఁ డనియె నిట్లు. 155

గీ. రాక్షసేశ్వర! ఇదె పోదు, రాముచేత
చావుతప్పదు నాకు నిశ్చయము నేడు
ఎంత చెప్పిన వినవు నే నేమి సేతు
సీతఁ దెచ్చిన లంకకే చేటువచ్చు. 156

క. అని తా నంతర్ధానం
బును జెంది గమించి మాయ పుత్తడిమృగమై
తనుకాంతులు విరజిమ్ముచు
వనమున దిరుగాడి పంచవటికిన్ వచ్చెన్. 157

## శ్రీరామచంద్రుడు భావి నెఱింగి సీతతో ఆడిన మాటలు

గీ. రామచంద్రమ! నీవు సర్వంబు నెఱింగి
జానకిం గాంచి అతిరహస్యంబుగాగ
పలికె ఈరీతి- భిక్షురూపమ్ము దాల్చి
రావణుఁడు వచ్చు నిన్ గొనిపోవు నింక. 158

గీ. వసుమతీపుత్రి! నీ వొక్క వత్సరమ్ము
పావకునియందు నైజరూపమ్ము నిల్పి
మాయమైపోయి ఛాయగా మాత్ర ముండు
రావణుని జంపి ఆమీద పావనాంగి!
పావకుని నుండి గ్రహియింతు పరమసాధ్వి! 159

గీ. లక్ష్మణుఁడు గూడ నెఱుగంగరాదు దీని
అతిరహస్యమ్ము పరమగోప్యమ్ము సుమ్మ !
అని వచించితి సీత కీ వంత కథను
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 160

గీ. అటులు నీ వన్న- అంతనె అవనిజాత
తనదు రూపమ్ము అగ్నిహోత్రమున నుంచి
మాయమైపోయి ఛాయగా మాఱిపోయె
ప్రకృతి-పురుషులు మీ కిది ప్రకృతి గాదె ! 161

గీ. అదుగొ మారీచుఁ డపుడె మాయామృగమ్ము
రూపమును దాల్చి వచ్చెను- పాపబుద్ధి
మనము నటియింపవలె నింక మాయబూని
నాంది ఆరంభమయ్యె నీ నాటకమున. 162

## మాయామృగమ్ము రాక

ఉ. బంగరుమేను రౌప్యమయభాసురబిందులు- ఇంద్రనీలపుం
రంగుల జిమ్ము శృంగములు- రత్నఖురంబులు- నీలికన్నులున్
హంగగు నింద్రచాపము విహాయసమున్ దిగివచ్చినట్టు లా
బంగరులేడి వచ్చె నటు పంచవటిం దగు పర్ణశాలకున్. 163

సీ. తగడు బంగరుమేని ధగధగదీప్తులు
విద్యుదుద్యత్కాంతి వెల్లిగొలుప
రౌప్యబిందుచయమ్ము రంగారుమేనిపై
వజ్రముల్ పొదిగిన వడుపు దోప
నీలశృంగము లింద్రనీలకాంతుల నీన
రత్నంపు ఖురముల రంగు లొలయ

పృచ్ఛమ్ము బహురత్నపుంజకాంతిచ్ఛటా
వలయమై ఇంద్రచాపమ్ము విరియ
చెంగు చెంగున దాటుచు నింగి కెగసి
రత్నదీధితి దిశల వర్షమ్ము కురియ
పూర్వ మెన్నడు లేని అపూర్వమృగము
పంచవటిలోన- అందందు సంచరించె. 164

సీ. ఒకచోట- మో మెత్తి ఒయ్యారముగ నిల్చి
నీలాలకన్నుల నింగి చూచు
ఒకతరి- జిగిమించు నొజపు బంగరు తళ్కు
తొరసి దిక్కులఁ బర్వ నురుకువెట్టు
ఒకపరి- కుప్పించి యుబికి నింగికి రత్న
ఖురములకాంతి దిక్కులకుఁ జిమ్ము
ఒకమాటు- లేతపచ్చిక మేయునట్టులు
నటియించి వచ్చి చెంగటను నిల్చు
సీత దగ్గర కించుక చేరవచ్చు
పట్టఁబోయిన సంతంత పరుగువెట్టు
కొమ్ములను కొమ్మ రెమ్మల చిమ్మి రేఁగు
పొదలచాటున నిలుచుండి పొంచి చూచు. 165

## సీత బంగరులేడిని పట్టి తెమ్మని గోరుట

గీ. నాథ! కనుగొమ్మ! అదిగొ యెన్నఁడుగాని
అట్టి మృగమును జూడ మీ అడవియందు
తగడు బంగరువన్నెను తెగడు మేను
శృంగమ్ము లవి యింద్రనీలమణులె. 166

సీ. కుప్పించి యెగసిన ఖురచతుష్కమునుండి
రమణీయ రత్నవర్షంబు గురియు
పరుగులు పెట్టుచో బంగారుజిగిమేను
మెఱపుతీవలు వోలె మెఱసిపోవు
నింగికి దాటుచో నీలంపు శృంగముల్
ఇంద్రనీలపుకాంతు లెల్ల జిమ్ము
నిలిచి మీదికి జూడ నీలంపుఁ గన్నులు
నల్లకలువలదండ లల్లుచుండు
ముద్దు లొల్కెడు ఆ చిట్టిమోము సొంపు
ఎంత చక్కని దహహ! ఈ వింతమృగము
నెమ్మి గొనితెమ్ము క్రీడామృగమ్ము గాగ
అనుచు జానకి నివ్వేడినంత నీవు. 167

## ఇది మాయామృగము – మారీచుడు కావచ్చును అని లక్ష్మణుడు హెచ్చరించుట

గీ. క్షణములోఁ దెత్తు ననఁగ– లక్ష్మణుఁడు వచ్చి
అన్న! ఈ వన్నెమృగ మిందు నెన్నడైన
కాంచినారమె! ఇద్ది రాక్షసులమాయ
అనుచుఁ దోచెడు నాకు నీ వరయు మయ్య! 168

గీ. ఎన్ని మృగములఁ జూడలే దిందు నందు
కాని కనలేదె ఎందు బంగారులేడి
ఆసలను గొల్పి మనలను మోసగింప
వచ్చె– మారీచుఁ డితఁడు కావచ్చునేమొ! 169

## శ్రీరామచంద్రుడు బంగారులేడిని గొనిరా బయలుదేరుట

గీ. ఇంతవఱ కీమె నన్ను దా నేమి గాని
కోరి యెఱుఁగదు లక్ష్మణా! కోరె నిపుడు
కానఁ - గొనిదెత్తు క్రీడామృగమ్ముగాగ
ఆమె కోర్కెను దీర్ప భావ్యమ్ము గాదె! 170

గీ. అనుజ! లక్ష్మణ నే వచ్చునంతదాక
వదినె సీతను రక్షింపవలయు సుమ్మ
మాయరక్కసు లెయ్యెడ మలయుచుంద్రు
జాగరూకుఁడవై వారి జాడ గనుము! 171

గీ. రక్కసులమాయ లెయ్యెడ నెక్కువయ్యె
పాపచిత్తులు మారురూపములు దాల్చి
వచ్చి మాయల వంచింపవచ్చు జుమ్మ
ధనువు చేబూని యిచట సిద్ధముగ నుండు. 172

క. అని హెచ్చరించి తమ్ముని
ధనువును జేపట్టి జనకతనయన్ గనుచున్
విను జానకి మాయామృగ
గనుమా! ఇదె పట్టి తెత్తు కాంచనమృగమున్. 173

చ కదలక అట్లె చేరువను గన్పడి చెంగున దాటిపోవు – పూఁ
బొదలను జొచ్చి దాగుచును పుట్టల గట్టుల నెక్కి పాఱుచున్
వదలకవచ్చు నిన్ను గని వాయుజవంబున దౌడు తీయుచున్
తుద కది ఆశ్రమమ్మునకు దూరముగాఁ గొనిపోయె నిన్నటుల్.

క. అది మాయామృగమే యని
మదిలోఁ దలపోసి వాడిమార్గణ మేయన్
వదలుచుఁ బ్రాణంబుల - ఆ
అదనున హా కావు లక్ష్మణా అని అఱచెన్. 175

గీ. అట్లు మాయావి హా లక్ష్మణా అటంచు
ప్రాణములు వాసి నైజరూపమ్ము దాల్చె
నొచ్చి రాజాజ్ఞ పాలించి చచ్చెఁ దుదకు
పుట్టువున వచ్చు బుద్ధులు పోవ వెపుడు. 176

క. మాయామారీచుం డటు
మాయామృగమౌచు నిన్ను మాయాతీతున్
మాయల దూరముగాఁ గొని
పోయెన్ దుది చచ్చి కలసిపోయెన్ నీలో. 177

గీ. నీదు భయమున నెపుడు నిర్నిద్రవృత్తి
నిన్నుఁ దలచుచు సర్వత్ర నిన్నె గనుచు
నీదు బాణాహతుండయి నిన్ను గలసె
నీదు మాహాత్మ్య మెవరు వర్ణింపఁగలరు ?
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 178

## సీత లక్ష్మణుని నిందాలాపమ్ము లాడి పంపుట

క. ఆ యఱపును విని జానకి
'హా' యని భువి వాలి లేచి హా లక్ష్మణా నీ
వా యఱపును వినలేదా
ఆయది మీ యన్న గొంతె అరుగ విదేమి ! 179

క. అమ్మా! దనుజుం డెవ్వఁడొ
ఇమ్మాదిరి అఱచి చచ్చె ఈరేడొ లో
కమ్ములు ఏకమ్మయి నమ
ఠమ్మున నిలువంగలేవు రాముని కెదురై. 180

ఆ. భయము వలదు రాము బలము నీ వెఱుగవే
అన్న వచ్చువేళ అయ్యె నమ్మ!
ఏను బోయినంత దానవుం డెవఁడేని
వచ్చెనేని కీడు వచ్చునమ్మ! 181

మ. అనినన్ – కోపమునంది సీత అవురా 'హా లక్ష్మణా కావు న'
న్ననె మీ యన్నయె కేకవెట్టె వినలేదా! అన్న కీడెంచవే!
చను శీఘ్రమ్ముగ – పోవవేని ఇదె – నీచా! కేళపాశమ్ములన్
వినుమే నిప్పుడ పోసికొందు నుఱి నీవే గొంతు విప్పట్టునన్.

క. లని తా కోపావేశ
మ్మునఁ బల్కఁగ భక్తియుక్తి ముకుళితకరుఁడై
చను దివ్వెద అన్నంగన
జననీ నీ కిట్టు లనఁగఁ జనునే యనుచున్. 183

గీ. మంత్రరేఖాత్రయమ్మాశ్రమమ్ము చుట్టు
గని ఓ తల్లి! దాట కీ గీటు ననుచు
అఖిల వనదేవతల కామె నప్పగించి
రాముఁ గొనితెత్తు నీకు శ్రీరామరక్ష! 184

గీ. అనుచు మనమున – అన్న ఏమనునొ అనుచు
భయముచే మేను చమరి కంపమ్ము నొంద
కనుల బాష్పాంబుకణములు గ్రమ్మి జార
లక్ష్మణుం డేగె మోము విలక్షణముగ. 185

## రావణుఁడు భిక్షురూపమ్మున వచ్చుట

గీ. లక్ష్మణుం డేగి నంతనే రావణుండు
చెట్ల చాటున నుండి ఆ సీతఁ గాంచి
ఇట్టి రూపసి లోక మందెందు లేదు
అదను వచ్చెను నే నీమె నపహరింతు. 186

సీ. పున్నమచందురున్ పురుడింపగాఁ జాలు
అందమ్ములను జిందు ఇందువదన
ఉత్ఫుల్లపద్మమ్ము లుపమింపఁ జాలని
నిడుద వాల్గన్నుల నీరజాక్షి
అపరంజి బంగారు నుపమింపఁ బోలని
ద్యుతిమతిస్నిగ్ధవిద్యుల్లతాంగి
రాజహంసల నడల కోజ తాననఁ జాలు
అందంపు నడకల హంసయాన
ఇంత చక్కని కాంత నే నెందుఁ జూడ
లలితలావణ్యసౌందర్యలక్ష్మి యీమె
సుదతు లందరి చక్కని చుక్క యీమె
కారిగోటికి సాటి కాజాల రెవ్వ. 187

గీ. భిక్షురూపమ్ము ధరియించి భిక్ష కొఱకు
ఆశ్రమోపాంతవీథికి అరుగుదెంచి
'భవతి భిక్షాం ప్రదేహి సౌభాగ్యమస్తు'
అనుచు నిలిచెను – పర్ణశాలాంగణమున. 188

గీ. అవనిజాతయు అది విని అతులభక్తి
పక్వఫలమూల గంధపుష్పములతోడ
అర్ఘ్యపాద్యాదులను దెచ్చి అర్చ సేయ
వచ్చి గాంచెను అద్భుతవ్యక్తి నెదుట.

సీ. తామ్రవర్ణపు జడల్ తలనిండ ముడిచుట్టి
గడ్డమ్ము మీసముల్ గలసి వ్రేల
పసిమి బంగరుకాంతి పరిహసింపఁగఁ జాలు
మేనికాంతులు మిఱుమిట్లు గొలుప
వక్షమునందు రుద్రాక్షమాలలు గ్రాల
కర్ణమ్ములందు చౌకట్టు లూగ
జేగురురంగునన్ జెలువారి మడమలఁ
బడుచు జీరాడు కుప్పసము దాల్చి
బూది మెయిఁ బూసి నొసటను బొట్టు తీర్చి
కక్షకకపాల ధరియించి కరములందు
దండ - జలకుండికలు దాల్చి తపసి యొకఁడు
ఆదిభిక్షువు వోలె ప్రత్యక్షమయ్యె. 190

## సీత మాయాభిక్షువునకు స్వాగతము పల్కుట పూజాద్రవ్యముల గొనివచ్చుట

గీ. స్వాగతము మీకు - ఓ పుణ్యజనవరేణ్య!
ఆర్య! దయచేసి పూజాదు లందుకొనుఁడు
నాదు నాథుండు వచ్చు క్షణమ్ములోన
అంతదనుకను వేది విశ్రాంతి గొనుఁడు. 191

గీ. పుణ్యజన! అంచుఁ బల్కె నీ పూవుబోడి
మాయ బయలయ్యెనేమొ సుమ్మా! యటంచు
మదిని తడబాటు చెంది ఆ మాయజోగి
తరుణి! చెప్పుమ! నీదు వృత్తాంత మేమొ. 192

క. అని యడిగిన– ఓ పూజ్యా!
విను లేఁ బుట్టితిని యజ్ఞవేదిన్ సీతన్
జనకుం డా మిథిలేశుడు
జనవంద్యుడు దశరథాగ్రజన్ముఁడు పతియౌ. 193

గీ. తండ్రి యాజ్ఞను– తలదాల్చి ధర్మదీక్ష
దండకారణ్యభూమికి తరలివచ్చె
నాదు నాథుండు త్రైలోక్యనాథుఁ డెన్న
నీదు చరితమ్ము చెప్పుమా నిగమవేది! 194

గీ. రమణి! లంకాధిపతిని నే రావణుండ
నిన్ను– కామించి వచ్చితి నీరజాక్షి!
బడుగు పతితోడ నిడుమలు పడగనేల
రమ్ము గొనిపోయి నిన్ను నా రాణి సేతు. 195

గీ. మూఁడు లోకాలు గెలిచినవాఁడ నేను
రాణిపై నాదు ప్రేమసామ్రాజ్య మేలు
మానవుఁడు– రాజ్యహీనుండు– హీనబలుఁడు
రాముతోడుత పనియేమి రామ! నీకు. 196

గీ. పాపచిత్తుఁడ భయమేది పలికె దిట్టు
సాధ్వి– నను ముట్టగా నీకు శక్యమగునె?
మూఁడులోకమ్ము లేకమై ముట్టివచ్చి
రాము గెలువంగలేవుగా రాక్షసేశ! 197

గీ. తమ్ము లక్ష్మణు తోడుత దాడివచ్చి
నిన్నుఁ బరిమార్చు వ్రేల్మిడి నీచహృదయ !
చెఱటి శునకమ్ము సింహమ్ము - చెనకఁగలదె
పొమ్ము ! పోకున్న చావు నిక్కమ్ము సుమ్మ ! 198

## రావణుఁడు సీత నపహరించుట

గీ. అనెనఁ గోపించి పర్వతమంత యెదిగి
పది శిరంబులు వింశతి బాహువులను
దాల్చెనంతనె భూదేవి దద్దరిల్లె
భీతి భూతమ్ములెల్ల స్తంభించిపోయె. 199

గీ. భూమి పెకలించి వింశతి భుజము లెత్తి
ధరణిఖండమ్ముతోడుత ధరణితనయ
రథము నందుంచి లోకజిద్రావణుండు
నతిజవంబున నేగె విహాయసమున. 200

గీ. మఱది లక్ష్మణ ! నిన్నట్టి మాటలాడి
పంపివైచితి ఆ పాపఫలము గంటి
ఈవె యిటనున్న నన్ జేర నెవరి వశము ?
నన్ను మన్నించి కావ నో యన్న రావె. 201

## సీత - ఆర్తనాదము

సీ. హా రామ ! కావవే హా లక్ష్మణా ! రావె
రావణుండట ఘోరరాక్షసుండు
నను గొనిపోవుచున్నాఁడు శీఘ్రమ రారె
నాథుఁ డుండియు నే ననాథనైతి

వనదేవతలు ! మీరు ననుగూర్చి చెప్పరే
    మహిజులౌ రామలక్ష్మణులతోడ
చోరుఁడౌ ఈ దురాచారు రాక్షసరాజు
    దండింపఁబేరె భూతమ్ములార !
అడ్డపడరారె వేగ ఓ అమరులార !
పాపు శిక్షింప రారె దిక్పాలులార !
వేగ సన్గావరే ఇలువేల్పులార !
చారణులు ! రారె ఓ సిద్ధసాధ్యులార ! 202

గీ. జనకరాజేంద్రుసుత రామచంద్రు పత్ని
దశరథేశుని కోడ లీ దశకు వచ్చె
పట్టపగ లిట్టు స్త్రీజాతి భంగపఱచు
రాక్షసుల పీడ తొలగింప రాజు లేడె ! 203

## జటాయువు రావణునితో పోరుసల్పుట

క. అను సీతారోదనమును
విని వచ్చెను పక్షిరాజు వినువీథి వెసన్
దనుజాధమ ! ఎట కేగెదు
జనకాత్మజఁ గొనఁగ నీకు శక్యంబగునే ! 204

క. ఎదురై చని పీకన్ దన
పదములఁ బడఁ దన్ని విఱచి పదగల్ గోడుగుల్
విదళించి తనువు నఖముల
పదిశిరములు దన్ని మకుటపంక్తిని రాల్చెన్. 205

క. శ్రీరాముని సతి నిట్టులు
చోరుని గతిఁ గొనుట యిద్ది శూరతె? విను ల
జ్జారహిత! బలము గలిగిన
పోరుము నా తోడ నీదు పొంక మడంతున్. 206

ఉ. ముక్కునఁ జీర్చి పాదముల మూర్ధము దన్ని పరాక్రమించి వే
ఱెక్కలతోడఁ గొట్టి అరరే దనుజాధమ! ఎందుఁబోవు దే
దిక్కును లేని దంచుఁ గొనితెత్తువె! చోర! జటాయు వుండఁగా
దక్కునెఁ రాఘవేంద్రు సతి దానవ! ప్రాణముతోడఁ బోవుదే!

గీ. అనుచు వే వచ్చి ఆతని ధనువు తునిమి
రథ్యములఁ జంపి ఱెక్కల రథము విఱచి
అక్కజంబైన శౌర్యధైర్యములఁ జూప
అసురుఁ డంతట క్రోధతామ్రాక్షుఁ డగుచు. 208

గీ. సమరదుర్వారచంద్రహాసమ్ము పట్టి
పక్షముల్ రెండు తెగనేయ పక్షిరాజు
పక్షహీనుండు తా నొట పడియె ధరణి
రక్తధారలు నింగి వర్షమ్ము కురియ. 209

గీ. దనుజ రాజంత అన్యరథమ్ము నెక్కి
సీత నందుంచి పాఱెను శీఘ్రగతిని
అవనిజాతయు పక్షిరా జట్లు నేలఁ
గూలుటను జూచి మదిలోనఁ గుందె మిగుల. 210

క. నీలాకాశము మీదను
నీలసముద్రమ్ము క్రింద నీలవనంబుల్
నీల మదంతయు నీవని
నీలాలక గాంచు నిన్నె నీలశుభాంగున్. 211

గీ. సీత యేడుపు రాముని చెవిని పడిన
వచ్చు నాతండు వేగ బోవలయు ననుచు
అరుగుచుండంగ నొక్క నగాగ్రమందు
కాంచె జానకి వానర పంచకమ్ము. 212

గీ. చీరచెరగును వే చించి సీత కొన్ని
నగలు ముడివైచి విడిచె నా నగమునందు
రావణుండును వేవేగ లంకఁ జొచ్చి
శోకసీతను నుంచె నశోకవనిని
కాంచి తదియెల్ల నే వనకాంతనగుచు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 213

## మాయామారీచుని వధించి శ్రీరాముడు మరలివచ్చుట లక్ష్మణుడు ఎదురగుట

ఆ. మాయలాడి లేడి – మారీచుఁడే యిటు
లాశ్రమమ్మునుండి అవనయించి
నన్ను దెచ్చి తుదకు నా బాణహతిఁ జచ్చు
నపుడు నాదు గొంతు ననుసరించి 214

ఆ. అఱచె– మాయలాడు 'హా సీత! హా లక్ష్మ
ణా!' యటంచు అచ్చునన్ను బోలె
ఇట్టి అఱపు విన్న ఏమౌనో నా సీత
తమ్ముఁ డచటనుండి తరలెనేమొ! 215

క. అని మరలి నీవు వచ్చుచుఁ
గని ఎదురుగ వచ్చుచున్న గాదిలితమ్ముఁన్
చనునే లక్ష్మణ! ఈఁగతి
జనకజ నొక్కతెను వీడి చనుదెంతు విటుల్? 216

క. ఏమయ్యెనో నా ప్రియసఖి
ఏ మాయాదనుజు లామె నెటకుం గొనిరో!
నా మాటను పాటింపక
ఆమెను ఏదనాడి వచ్చితాహా! తగునే. 217

గీ. అట్లు మాయావి 'హా లక్ష్మణా' యటంచు
అఱచినంతనె భయమంది ఆమె పంపె
అన్న! ఏమందు వదినె తానన్న నుడులు
ఎన్ని చెప్పిన నమ్మదే దేమిసేతు. 218

గీ. స్త్రీలు మితిమీరి కోపమ్ము చెందినపుడు
మనసు నొవ్వంగ కఠినఁపు మాటలంద్రు
వాని పాటింపఁదగునె ఎవ్వారుగాని
అనుచితమ్మును గావించి తనుజ! నీవు. 219

రామలక్ష్మణులు – సీత నన్వేషించుట

గీ. త్వరితగమనమ్మునన్ పంచవటికి వచ్చి
జానకీశూన్యమౌ పర్ణశాల గాంచి
అయ్యొ! లక్ష్మణా! సీత ఏమయ్యెనోయి!
మాయదానవు లెటు గొనిపోయినారొ! 220

గీ. జానకీ ! పర్ణశాలను గానరావె !
ఎచట నుంటివి గౌతమి కేగినావె
పొదలమాటున ఎందేని పొంచియుండి
ఇంతి ఈగతి నను బరీక్షింతువేమొ ! 221

గీ. అకట ! ఏమైతి కానరా వయ్యె యెచట
అట్లు మాయావి మారీచుఁ దఱచినంత
భయము నందితె ! లక్ష్మణు బంపినావె !
రాక్షసులు నిన్ను గొనిపోవ రారు గాదె ! 222

గీ. వనదేవతలు ! మీరు వనమందు నెందేని
కాంచిరే నా దేవి— కాంచనాంగి !
భూతమ్ములార ! ఆ భూజాత నా సీత
చూచితిరే మీరు సుందరాంగి !
మల్లికామాలతీమాధవీలతలార !
మీలోన దాగెనే నా లతాంగి !
గిరిరాజులార ! హే తరులార ! ఝరులార !
కన్నారె ఇందు నా సన్నుతాంగి
కమలగంధిని గనరె భృంగమ్ములార !
క్రమకలకంఠి కనరె పికమ్ములార !
మృగవిలోచన చూడరే మృగములార !
కలసుభాషిణి గనరె శుకమ్ములార ! 223

గీ. దివ్యగోదావరీ ! నీదు తీరమందు
వచ్చి విహరించు గాదె నా వనిత సీత
ఆమె నీనాడు గాంచినావమ్మ ! ఇందు
సాక్షిభూతవు నీవొచు సాగిపోదు. 224

గీ. కర్మసాక్షివి మా వంశకర్త వీవు
తరణి! గాంచితె ఎందు నా తరుణి సీత
ఈవు గానని చోటు లేదెందు గాదె!
కాంచియుందువు చెప్పవే కరుణ బూని.

క. హా సీతా! హా జానకి!
హా సన్నుత సుగుణశీల! హా సుచరిత్రా!
హా సహధర్మిణి! ప్రేయసి!
హా సతి! ఎందుంటి రావె హా మము గనవే!

## లక్ష్మణుఁడు అన్న నోదార్చుట

సీ. తల్లిపోలిక అమిత వాత్సల్య మెనఁగ
తన్నుఁ గాంచెడు తల్లి సీతమ్మ గనక
అడవి గ్రుమ్మరి ఓ వదెనా! అటంచు
ఎల్లదిక్కుల నరసి గొంతెత్తి పిలిచి
కాన కెందును మిగుల లక్ష్మణుఁడు గుంది
శోకభారాన కనుల నశ్రువులు గురియ
నీమవెంటనె చనుచుఁ గన్నీరు గురిసి
ధైర్యమును దాల్చి నిన్ను నోదార్చె నిట్లు.

గీ. మేరుశైలేంద్రధీర! గంభీరమూర్తి!
అన్న! ఈరీతి దుఃఖింపఁ నగునె నీకు
వనమునం దెల్లయెడలను వదినె వెదకి
తీసికొనివత్తు తల్లి ధాత్రీతనూజ.

గీ. అసురు లెవరైన మాయచే నపహరించి
లేని వారల నిదె సంహరించి దెత్తు,
త్రిభువనంబుల న న్నెదిరింపఁగలరె !
బ్రతుకు నెవ్వఁడు మన కపకృతిని జేసి
శాంతి వహియింపుమన్న విశ్రాంతి గొనుమ ! 229

## రాముని శోకమును గాంచి ప్రకృతి కన్నీరు గార్చుట

గీ. రామ ! ఆ రీతి దండకారణ్యసీమ
సీత గానక యెందు నిస్సీమదుఃఖ
భారమునఁ గ్రుంగు మిము గాంచి ప్రకృతియెల్ల
కార్చె కన్నీరు మిగుల దుఃఖమున- కుంది
కంటి నదియెల్ల నే వనకాంత సగుచు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 230

## రామలక్ష్మణులు నేలఁగూలిన జటాయువు గాంచుట

గీ. కదఁగి జానకి వెదకు చా యదవియంద
పడిన గొడుగులు రథమును సిరపు గాంచి
తరుణికై యిందు నెవరో యుద్ధమ్ము చేసి
జానకిన్ బట్టి చనిరి లక్ష్మణ ! నిజమ్ము. 231

గీ. అదిగో లక్ష్మణ ! కనుగొమ్మ ! అసురుఁ డెవఁడో
పండుకొనియుండె హాయి నీ కొండచరియ
సీత భక్షించెనేమొ ! ఈ ఘాతుకుండు
దనువు గొనితెమ్ము వధియింతు దనుజు నని చ. 232

గీ. రఘుకులేశ్వర ! మాయావి రావణుండు
సీతఁ గొనిపోవుచుండ నే శీఘ్రగతిని
వాని నెదిరించి పోరాడి వానిచేత
హతుఁడనైన జటాయువు నరయు మయ్య ! 233

గీ. నిన్నుఁ గనుగొని ఈ వార్త నీకుఁ దెలుప
ఉంటి నిట్టులు రామ ! కుట్టుసురుతోడ
నీదు కరమున ముట్టవే నీరజాక్ష !
అంతమున నిన్ను జూచు భాగ్యమ్ము గలిగె. 234

గీ. అనిన నీవును కరమున నతని నిమిరి
ఆయు విచ్చితి వీవు జటాయు ! మాకు
బంధు వౌటను - ఇక రామబంధు లనుచు
నీదు జాతికి నామమై నెగడు గాత ! 235

గీ. అనఘ ! ఎవ్వఁడు జానకి నపహరించె ?
దెలుపవే వాఁడు పోయె నే దిక్కుపట్టి
అనిన శ్రీరామ ! రావణుం డపహరించె
దక్షిణాశకు నేగె రథమ్ముతోడ. 236

## రామచంద్రుఁడు జటాయువునకు మోక్ష మొసంగుట

గీ. మాటలాడంగలేను 'రామా !' అటంచు
ప్రాణములు వాసె దయనీయ పక్షిరాజు
కనుల బాష్పమ్ము లొలుక దుఃఖమ్ముతోడ
వగచితివి గాదె నీవు నా ఖగము గూర్చి. 237

గీ. అతని కంతట దహనకృత్యమ్ము తీర్చి
పక్షికులరాజ ! స్వర్గాది భవ్య దివ్య
లోకముల మించు వైకుంఠలోకమునకు
పోయెదవు గాక ! అని వర మిచ్చినావు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 238

## జటాయువు రామచంద్రుని స్తుతించుట

గీ. పాంచభౌతిక దేహమ్ము భస్మమయిన
దివ్యదేహమ్ము ధరియించి దీవ్యమాన
నవ్యనవరత్నమయ విమానమ్మునుండి
ప్రస్తుతించెను నిన్నిట్లు పక్షిరాజు. 239

గీ. రఘుకులాధిప ! నీవు పరాత్పరుండ
వఖిలలోకాధినాథ ! నారాయణుఁడవు
భవ విరించి సుపూజితపాదపద్మ !
వేద వేదాంగవినుత ! ఓ విశ్వమూర్తి ! 240

గీ. నిన్ను వినుతింప శక్తుండనే రమేశ !
ఆగమమ్ములె వినుతించి మూగవోయె
సత్త్వగుణపూర్ణ ! నీ కరస్పర్శ వలన
ముక్తి గాంచితి నీ దివ్యమూర్తి గంటి. 241

గీ. అని జటాయువు వినుతించి అంజలించి
అరిగె వైకుంఠమునకు— నీ యాజ్ఞ వడసి
ప్రాణదానమ్ము చేసిన పక్షి కీవు
మోక్ష మిచ్చితి కరుణాసముద్ర రామ !
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 242

## కబంధోపాఖ్యానము

గీ. మరల మానుష భావంబు మదిని దాల్చి
హా సఖీ! జానకీ! అని అవనిసుతను
వెదకుచున్ బోయి వేరొక్క విపినమందు
కాంచితిరి మీరు వికృత రాక్షసుని నొకని. 243

గీ. పాద-మస్తకహీన కబంధుఁ డతఁడు
యోజనాయామసుదృఢబాహుద్వయుండు
అతని ఆయత బాహుమధ్యమ్మునందు
ఓక్కి లక్ష్మణ! ఇతఁడు భక్షించునేమొ! 244

గీ. ఒక్కసారిగ నితని బాహుద్వయమ్ము
తీక్ష్ణకరవాలధార ఛేదింత మనుచు
అతని బాహుల ఖండింప నంత నతఁడు
బాహుబలదర్పయుత-మహాబాహులార!
దేవదానవులకును నా దివ్యబాహు
ఖండనము సేయ శక్యంబు కాదు గాదె!
మీరు మానవమాత్రులు గారు చూడ
మీర లెవ్వరో చెప్పుఁడీ మీ చరిత్ర! 245

గీ. రాముఁడను నేను దశరథరాజ సుతుఁడ
తమ్ముఁ డీతండు- నేను నా తరుణితోడ
తండ్రియాజ్ఞను వచ్చి యీ దండకవని
పంచవటియందు నుంటిమి పర్ణశాల. 246

గీ. ఏము వేటకునై దూర మేగినపుడు
అవహరించెను నా సతి నసురుఁ డెవఁడొ!
ఆమె వెదకుచు వచ్చి ఈ అడవియందు
పడినవారము నీ బాహు బంధమందు. 247

గీ. నీదు ప్రాణ రిరక్షచే నీ భుజమ్ము
లసిని ఖండించితిమి తెల్పు మెవఁడ వీవు
అనిన ఆశ్చర్యమంది ఆ అసురుఁ డంత
రామ ! వచ్చితె నీవు నారాయణుఁడవు
అరుగుదెంచితె- ఇట్లు మహానుభావ !
ఆలకింపుము నా కథ ననుచుఁ బలికె. 248

సీ. రామ ! నే గంధర్వ రాజేంద్రుఁడను మున్ను
రూపయౌవనదర్పరూఢమతిని
సకలలోకంబులు సంచరించుచు భూమి
గాంచి తష్టావక్ర ఘనతపస్వి
అతని రూపము గాంచి అవహేళనము సేయ
కోపించి ఆతండు క్రూరచిత్త !
గంధర్వ ! సౌందర్యగర్వాంధ ! మూఢాత్మ !
గర్వమ్ము తొలఁగ రాక్షసుఁడ వగుము
అనుచు శపియింప భయమంది అతని పూజ్య
చరణముల వ్రాలి వేడ- ప్రసన్నుఁడగుచు
రాముఁ డను పేర త్రేత నారాయణుండు
అవతరించును దుష్టశిక్షార్థ మవని. 249

గీ. యోజనాయతమౌ బాహుయుగము నతఁడు
తీక్ష్ణనిస్త్రింశధార ఛేదించునంత
శాపముక్తుఁడవై నైజరూప మంది
అంతమందున మోక్షమ్ము నందగలవు. 250

క. అని పల్కి మునిప్రవరుఁడు
చనినంతనె నాకు రాక్షసత్వము వచ్చెన్
ఘనదేహము వికృతాసన
మును వచ్చెను ఘోరమైన మునిశాపమునన్. 251

గీ. దానవుఁడనైన నే సురరాజు గాంచి
వెంట తరిమితి నొకనాడు - వేల్పుఱేఁడు
అదరి శిరమున వ్రేయ వజ్రాయుధమున
ఉదరమునఁ జొచ్చె నా పాదయుగము - శిరము. 252

గీ. ద్రుహిణు వరమున నే నవధ్యుండనగుట
దివిజులెల్లరు తెల్పగ దేవవిభుఁడు
యోజనాయామదీర్ఘబాహుద్వయమ్ము
జఠరమందున ముఖ మిచ్చి చనియె నతఁడు. 253

గీ. అంత నే నాదు బాహుమధ్యమునఁ బడిన
ప్రాణికోటిని భక్షించి బ్రతుకుచుంటి
నేడు నా కరచ్ఛేదము నీవు చేయ
శాపముక్తిని గాంచితి సచ్చరిత్ర! 254

గీ. అనఘ! నా దేహ మగ్నిదాహమ్ము సేయు
భవ్యమౌ నాదు నైజరూపమ్ము దాల్తు
అనిన మీ రట్లు సేయంగ నంత నతఁడు
తనదు గంధర్వరూపమ్ము దాల్చి నిల్చె. 255

గీ. త్వత్పదమ్ముల వ్రాలి నిస్తంద్రభక్తి
నతిశతమ్ములు సాష్టాంగనతులు సేసి
పూర్వభవకృతవిపులమౌ పుణ్యగరిమ
నిన్ను గనుగొంటి ధన్యుండ నీరజాక్ష! 256

## కబంధకృతస్తోత్రము

ఉ. పావనతావకీనపదపద్మపరాగము గోరి నమ్రులై
భావజవైరిపద్మభవవాసవ వాసుకి నారదాదులే
కేవలభక్తి గొల్చి నిను కీర్తన సేయఁగలేక మూకలై
పోవఁగ నే నదెంత! నను బ్రోవుము దేవ! త్వదీయభృత్యుఁడన్.

ఆ. నిగమసూక్తులెల్ల నిను వర్ణనము సేయ
నేరవన్న దేవ! నేను నేర్తె?
భావమంద నిన్ను భక్తిమై గొల్చెద
నుతులు సేయఁ జాల నతులు సేతు. 258

క. ఈ నీ రూపము నా మది
ధ్యానమునన్ నిలుచునట్లు దగ వరమిమ్మా!
దీనజనావన! పావన!
మానవరూపమున నున్న మాధవ! వినుమా! 259

ఆ. ఇటకు... కొంతదూర మేగిన- తావక
భక్తురాలు శబరి భవ్యచరిత
కలదు నిన్నుఁ జూడ కలకాలముననుండి
ఎదురుచూచుచుండె- ఏగు మటకు. 260

ఆ. శబరి మీకుఁ దెల్పు సర్వమ్ము రాఘవ!
సర్వవిదుఁడవైన- శబరిఁ గనుమ!
ఆజ్ఞ యిచ్చెదేని అరిగెద నో రామ!
అనుచు నీదు నాజ్ఞ- అరిగె దివికి. 261

## రామలక్ష్మణులు శబరిన్ గనఁబోవుట

మ. మరలన్ మానుషభావ మూని మది రామా! నీవు సౌమిత్రి భీ
కర జంతువ్రజఘోరపన్నగ సమాక్రాంతాతిసాంద్రాటవీ
సరణిన్ బోవుచు- సాధుజంతుగణసంచారాభిరామమ్ము, సుం
దరపుష్పౌఘసుగంధవాసితము శాంతమ్మౌ వనం బయ్యెడన్.

క. కని- ఆశ్రమమని లోనికి
జని- ముందట నొక్క పర్ణశాలాంగణ మం
దున- గాంచిరి నీ నామ
మ్మును జపముం జేయుచున్న ముదుసలి శబరిన్.

క. అనయము నీ నామమ్మును
మనమున స్మరియించుచున్న మానితమూర్తిన్
కను లానందము చెందగఁ
గని రయ్యెడ పలితవలితకబరిన్ శబరిన్.

ఉ. కామసహస్రసుందరుని, కంజవిలోచను, నీలనీరద
శ్యాముని, స్వర్ణచేలుని, విశాలలలాటు, జటాకిరీటునిన్,
కోమలదేహు, రాజితకకుత్సకులాంబుధిసోమునిన్, పరం
ధాముని నిన్నుఁ దా గని పదంబులు తొట్రిల వచ్చి భక్తిమై.

## శబరి భక్తి – ఆతిథ్యము

గీ. స్వాగతము పల్కి స్వాశ్రమస్థలికిఁ దెచ్చి
ఆసనము లిచ్చి అర్ఘ్యపాద్యమ్ము లిచ్చి
మంచిఫలములు రుచి చూచి యెంచి యిచ్చి
పదము లొత్తుచు దగ్గుత్తి పలికె నిట్లు.

ఆ. పట్టు పిండి యొడ్చి పెట్టిన దీ తేనె
క్రమకందమూలకమ్ము లివ్వి
చెట్టులందె పండి చిలుకైన ముట్టని
పనసకదళికామ్రఫలము లివ్వి.

ఆ. అడవియెల్ల తిరిగి ఆకలిదప్పుల
వచ్చినారు చాల నొచ్చినారు
రామచంద్ర ! నీవు లక్ష్మణ ! గొనుడయ్య !
అనుచు తెచ్చి యిచ్చె అమలభక్తి. 268

ఆ. పరమనిర్మలమ్ము పంపాజల మ్మిది
త్రాగుఁడయ్య ! చేయు దాహశాంతి
పల్లవములు పూలు పఱచిన మెత్తని
శయ్యలందుఁ గొంత శ్రాంతి గొనుఁడు. 269

గీ. నీదు మసృణాతిమృదుపాదనీరజములు
కంటకావృత కర్కశ కాననమున
ఎంత నొచ్చెనొ ! ఈ నూది యినుపఱాల
పదము లొత్తెద రామయ్య పట్టనిమ్ము
నరగవచ్చితె ఈ వృద్ధశబరిఁ జూడ. 270

గీ. చదువుసంధెలు లేని దీ శబరి రామ !
అక్షరజ్ఞానశూన్య నే నజ్ఞురాల
అక్షరబ్రహ్మ నీవు ప్రత్యక్షమైన
ఎట్లు వర్ణింతు చదువన్న దేమి యెరుగ. 271

ఉ. చీమచిటుక్కు మన్న యదె శ్రీరఘురాముఁడు వచ్చె నేడు నా
కామితముల్ ఫలించెనని కాంక్షను జూడగ వత్తు నిచ్చలున్
రామ ! త్వదీయరూపమును వ్రాయుచు పూవుల పూజచేయుదున్
కామసహస్రసుందరసుగాత్ర ! స్వయమ్ముగ వచ్చినావటే. 272

గీ. రామనామమ్ము తక్కన్యనామ మెఱుఁగ
గూఢభక్తిని నీ నామమున్ జపింతు
అయిన వచ్చితి వీవు స్వయమ్ముగాగ
అహహ ! నాదైన పూర్వపుణ్య మ్మదేమొ ! 273

గీ. నాదు గురువులె నిన్ను గానంగలేక
అరిగి రందఱు నేన ఈ యాశ్రమమున
పాడుగుడిసెను కునుకు దీపమ్మువోలె
ప్రాణములనూఁడి నిన్గంటి పరమపురుష !
బ్రదికియుండిన శుభముఁ బడయవచ్చు. 274

గీ. ఆడుదానను అందును అడవి నుంటి
శబరకులమునఁ బుట్టితి – చదువు లేదు
నీదు నామమ్మె జపియింతు నాదు మదిని
అదియే నేఁ జేసినట్టి పుణ్యమ్ము రామ ! 275

గీ. దానధర్మమ్ములను జేయ ధన మదేది ?
పేదతన మెన్న నే నిరుపేదదాన
తీర్థయాత్రల నెఱుఁగను దీనురాల
వృద్ధగురులను భక్తి సేవించినాను. 276

గీ. ముదిమి వచ్చెను – తనువెల్ల ముడుతలెక్కె
బక్కచిక్కితి నెత్తురుచుక్క లేదు.
బడుగుదేహమ్ముతో నెట్లొ బ్రతికియుంటి
నిన్ను గనుగొంటి ఎంత పుణ్యమ్మొ రామ ! 277

## శ్రీరామచంద్రుడు శబరికి ముక్తి నిచ్చుట

గీ. శబరి భక్తికి రామ ! ఆశ్చర్యమంది
శబరి ! భక్తికి ముక్తికి చదు వదేల ?
చదువు వేరమ్మ ! ఆత్మజిజ్ఞాస వేరు
చదివినంతనె ఎవఁడు విజ్ఞాని కాఁడు
జ్ఞాని యైనంత మాత్ర మోక్షమ్ము రాదు. 278

గీ. మూఢభక్తియె ఇచ్చును ముక్తి సుమ్మ !
భక్తి అందఱి కెన్న లభ్యమ్ము కాదు
పూర్వజన్మార్జితంబైన పుణ్యగరిమ
భక్తి అలవడు దానిచే ముక్తి వచ్చు. 279

గీ. అమ్మ ! ముక్తికి జాతిభేదమ్ము లేదు
లింగభేదమ్ము నదియు నెన్నంగ లేదు
స్త్రీలు–పూరుషులని గాని బాలవృద్ధ
వయసులవి గాని వర్ణవివక్ష గాని
కారణమ్ములు ముక్తికి గావు తల్లి !
భక్తి గలవారె గాంతురు ముక్తి శబరి !
భక్తురాలవు నీ కింక ముక్తి గలుగు
శబరి శంకింపవలదు నిశ్చయము సుమ్మ ! 280

గీ. అనుచు మాయాన్వితుఁడవౌచు నంతలోన
మానుషత్వము మదిబూని మాటమార్చి
జానకిని నీవు గాంచితే శబరి యిచట
సీత ఎచ్చట నున్నదో చెప్పగలవె ! 281

గీ. అనుచు నడిగిన– ఆశ్చర్యమంది శబరి
సర్వ మెఱిగిన శ్రీరామచంద్ర! యిట్లు
మానవత్వము నూని సామాన్యు నట్లు
నన్ను నడిగెదవౌ గాదె! విన్నవింతు.

గీ. రఘుకులప్రభు! మాయావి రావణుండు
అపహరించెను మీరు లేనప్పు డామె
అసురవల్లభుఁ డతఁడు లంకాధిరాజు
లంకలో నున్న దా నిష్కళంక సీత.

## సుగ్రీవుతో సఖ్యము సేయుమని శబరి చెప్పుట

సీ. ఇటనుండి యొక క్రోశ మేగిన నచ్చట
రమణీయ పంపాసరస్సు గలదు
దానికి ప్రక్క నత్యంత శోభాభాసి
కమనీయ ఋశ్యమూకమ్ము గలదు
ఆ యద్రి సుగ్రీవుఁ డనెడి వానరరాజు
సూర్యపుత్రుఁడు మహాశూరవరుఁడు
వాలిచే రాజ్యనిర్వాసితుండై యుండు
హరియూథపులు మంత్రివరులు గొలువ
అతనితోడుత రామ! సఖ్యమ్ము సేయు
మతఁడె అన్నిట నీకు సాహాయ్యమగును
వాని సాహాయ్యమంది రావణుని గెలిచి
జానకిని గొందు వీవు నిస్సంశయమ్ము.

## శబరి యోగాగ్నిలో దేహదాహము గావించి ముక్తి నొందుట

వ. అని వచియించి ఒక్క క్షణ మాగుము రాఘవ! నిన్ను గాంచుచే
తనువును పాంచభౌతికము దాహ మొనర్చి సనాతనమ్మునున్
జననమృతాదికమ్ములగు సంసృతిబంధము లేవి లేని ఆ
మునిజనకామ్య మైవెలయు ముక్తిపదమ్మును గాంతు నో ప్రభూ!

గీ. రామ! శ్రీరామ! కోటి పరంధామ! రామ!
నిన్ను గనుగొంటి నా పున్నె మెన్న దరమె
అనుచు యోగాగ్ని దేహదాహమ్ము నేసి
శబరి దివ్యులు పొగడ మోక్షమ్ము గాంచె
కాంచి తిథియెల్ల నేడె యోగరిత నగుచు
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 286

ఆ. అట్టి శబరి చేసినట్టి ఆతిథ్యమ్ము
ఆమె ముగ్ధభక్తి నరసి మదిని
మెచ్చి పరమపురుష! ఇచ్చితి మోక్షమ్ము
రమ్యసుగుణసాంద్ర! రామచంద్ర! 287

ఉత్సాహ—

భానువంశవార్ధిచంద్ర! భానుతుల్యవిక్రమా!
జ్ఞానగమ్య! సూర్యవంశసార్వభౌమరత్నమా!
జానకీమనోభిరామ! జామదగ్నినిగ్రహా!
దానవీర! ధర్మవీర! ధర్మరక్షణాగ్రహా! 288

**కాండాంతగద్యము**

ఇతి శ్రీమదాకుండ్యన్వయపవిత్ర, ఆత్రేయసగోత్ర మహాకవివేంకటకవి
ప్రపౌత్ర, జగన్నాథశాస్త్రిపౌత్ర ఉద్దండపండితగోపాలశాస్త్రి
పుత్ర, విద్వజ్జనవిధేయ ఉభయభాషాప్రవీణ -
సూర్యనారాయణశాస్త్రినామధేయ ప్రణీ
తంబయిన ప్రత్యక్షరామాయణ
మహాకావ్యంబున ఆరణ్యకాండము
సర్వము సమాప్తము
ఓం తత్ సత్
శ్రీరామచంద్రార్పణమస్తు

—o—

శ్రీః

# శ్రీ ప్రత్యక్ష రామాయణము

## ప్రత్యక్షాత్మానుభూతి రామాయణము

## కిష్కింధా కాండము

---

క. శ్రీకర! సీతాహృత్కమ
లాకర - చరరాజహంస! ఆశ్రితపోషా!
లోకేశ వినుతగుణర
త్నాకర! స్మితపూర్వమంజులామృతభాషా! 1

గీ. భానువంశాబ్ధిసోమ! శ్రీభవ్యనామ!
అవనిజానాథ! సర్వలోకైకనాథ!
మదనసుందరరూప! ధర్మస్వరూప!
వినుము తరువాయి నీ కథ విస్తరింతు. 2

### పంపా సరోవరము

గీ. శబరి చెప్పినయట్టు లాసన్నవర్తి
పద్మసౌగంధభరిత పంపాసరస్సు
చేరి జలములు గ్రోలి తత్తీరభూమి
చల్లగాలుల - కొంత విశ్రాంతి నంది. 3

చ. అమలినవారిపూరము సహస్రదళాంచితఫుల్లపద్మమున్
కమలసుగంధవాసితము కచ్ఛపనక్రఝషప్రచారమున్
భ్రమదళిపుంజఝుంకృతి విరావసుమంజులగీతనాదమున్
అమలతరంగడోలనవిహారసమాదర రాజహంసమై.

గీ. రమ్యమై యొప్పు పంపాసరస్సు మీకు
మందపవనాంకురముల నానంద మొసఁగ
కలరవంబుల సత్కావికులముతోడ
స్వాగతము పల్కె భ్రమరనిస్వానఘణిలి.

గీ. క్రమఫలభారనమ్రవృక్షవ్రజమ్ము
పండి రోమంథమును జేయు పశుగణమ్ము
వృక్షశాఖల విహరించు పక్షిగణము
ప్రకృతిశోభకు శుభ్రదర్పణము పట్టె.

సీ. పిల్లగాలుల లేచు చల్లని కెరటాల
తూగుటుయ్యాలల తూగియాడి
పద్మనాళము నోటఁ బట్టి హారనిని డాసి
ముక్కున నునుచెక్కు ముద్దుపెట్టి
తెక్కలు విదళించి ముక్కున నవరించి
పద్మపత్రంబుల పవ్వళించి
తోడిరాయంచలతో వినోదము సల్పి
హంసీగణమ్ముతో నాటలాడి
వివిధగతుల నీట్లు విహరించు రాయంచఁ
గాంచి దాని సొబగు లెంచి మదిని
సీత మదిని మెదల చింతించి హా సీత !!
అనుచు రామ ! మోహ మందినావు.

7

## ఋశ్యమూకము.

చ. వరతరుశోభితమ్మును సువర్ణసుపుష్పసుగంధ మంజరీ
చరదళిపుంజఝుంకృతివిసర్పితకుంజగుహాంతరంబునున్
కరిఘటఘాతనిర్దళితగండవిచూర్ణిత జంతుజాలమున్
గిరిఝరశీకరప్రకరసించితవప్రము ఋశ్యమూకమున్. 8

క. కనుగొని తద్గిరిశోభకు
మనమున నానందమంది మంజునికుంజం
బున నుండఁగ సుగ్రీవుఁడు
గనె మిమ్ముల ఖడ్గతూణకార్ముకధరులన్. 9

సుగ్రీవుఁడు రామలక్ష్మణులను గాంచి శంకించుట.

చ. ఘనభుజవీర్యసంయుతులు కార్ముకధారులు పీనవక్షులున్
సునిశితబాణపూర్ణవరిశోభితతూణమహాసిధారులున్
వనజవిశాలనేత్రు లనవద్యశుభాంగులు సింహమధ్యముల్
జననుతరాజవంశజులు సంశయ మించుక లేదు చూడఁగా. 10

గీ. అమ్మతంగుని శాపవశమ్ము చేత
అతఁడు రాలేక ఋశ్యమూకాద్రి కిట్లు
వీరవరులైన వీరి దుర్వారబలుల
వాలియే పంపియుండు నవశ్యమనుచు. 11

గీ. మంత్రివరుఁడైన ఆ హనుమంతు జూచి
మహితమతిశాలి ! ఆ మహామహులఁ గాంచి
వార లెవ్వరో ! ఎందుకై వచ్చినారో !
అరసి శీఘ్రమ్మ ! పోయి రమ్మనుచు బనిచె. 12

## వటురూపమున హనుమంతుఁడు శ్రీరామలక్ష్మణులను గన వచ్చుట

క. వటురూపం బెంతయు వి
స్ఫుటమై గనుపింప నేగి సుందరమూర్తిన్
పటుశబ్దార్థస్ఫుటవాక్
పటుతయు వెలయంగ నిట్లు పలికెన్ వారిన్. 13

క. సృష్టిస్థితిలయకర్తలా!
శిష్టుల రక్షింప దుష్టశిక్షార్థంబై
స్రష్టయ కోరగ వత్తురా!
స్పష్టంబుగఁ దెలుపుఁడయ్య! పార్థివవరులో! 14

గీ. మీర లెవ్వరో! అతిలోకవీరవరులు
శౌర్యగాంభీర్యధైర్యసౌందర్యయుతులు
దివ్యతేజోవిరాజితదీప్తతనులు
మూర్తిగాంచిన క్షాత్రవిస్ఫూర్తిగతులు. 15

గీ. వేషమది చూడ మునిజనవేష మొప్పు
ఖడ్గకార్ముకతూణాదికమ్ము లరయ
క్షాత్రభావమ్ము- అదియు విస్పష్టమగును
తెలియ శక్యంబె మాకు మీ దివ్యచరిత. 16

గీ. దివ్యతేజమ్ము చూడ- ఆదిత్యులేమొ!
భువికి దిగివచ్చినట్టి- ఆ దివిజులేమొ!
లోకకల్యాణమునకు భూలోకమునకు
నరుఁడు నారాయణుఁడు వచ్చినారలేమొ! 17

గీ. అనుచు నడిగిన నీవు లక్ష్మణుని గాంచి
లక్ష్మణా ! వింటె పల్కు సలక్షణమ్ము
ఇతఁడు వటురూపధారి పండితుఁ డెవఁడొ !
శబ్దశాస్త్రజ్ఞుఁ డితఁడు నిస్సంశయమ్ము. 18

గీ. తమ్మునితో నిట్లు పల్కి తద్వటుని గాంచి
రాముఁ డనువాఁడ నే దశరథరాజసుతుఁడ
తమ్ముఁ డీతండు నేను నా తరుణితోడ
తండ్రియాజ్ఞానువర్తినై దండకవని
పంచవటియందు నుంటిని పర్ణశాల. 19

గీ. ఏము మృగయార్థమై దూర మేగునపుడు
అపహరించెను నా సఖి అసురుఁ డెవఁడొ
ఆమె వెదకుచు నిటు వచ్చినాము మేము
త్వచ్చరిత్రంబు తెల్పు విద్వద్వరేణ్య ! 20

## హనుమంతుఁడు తన చరితమును దెల్పుట

క. వినుఁ డిచ్చట సుగ్రీవుం
డను వానరరాజు కలఁ డహస్కరపుత్రుం
డినతేజుఁడు ఘనవీరుం
డనఘాత్ముం డతఁడు నేను అతని మంత్రిన్. 21

క. హనుమంతుఁడు నా నామ
మ్మనిలుని తనయుండ తల్లి అంజన సుగ్రీ
వుని మంత్రిని ఇనశిష్యుఁడ
విను మో ప్రభు ! నాదు చిన్న విన్నపము దయన్. 22

గీ. వాలి యనువాఁడు గలఁడు దుర్వారబలుఁడు
అతని తమ్ముఁడె సుగ్రీవుఁ డసమబలుఁడు
నయవిహీనుఁడు వాలి యన్యాయముగను
మంత్రులము మేము చెప్ప మా మాట వినక. 223

గీ. తమ్ము సుగ్రీవు నిర్దోషు తరిమికొట్టి
అతని భార్యను రుమను తా నపహరించె
న్యాయవర్జితు వాలిరాజ్యమ్ము వీడి
ఋశ్యమూకాద్రి చేరి సుగ్రీవుగూడి. 224

గీ. ఉన్నవారము మేము ఆపన్నుఁ గొలిచి
నీవు బలవంతుఁడైన సుగ్రీవుతోడ
సఖ్యమును జేయు మీకు నిష్టంబయేని
అతఁడు నీ శత్రు గెలువ సాహాయ్యపడును. 225

గీ. అనిన నీవును మందస్మితాననమున
అతని తోడుత మేము సఖ్యమ్ము సేయ
వచ్చినారము మీకును నచ్చెనేని
నీవు గొనిపొమ్ము మమ్ము సుగ్రీవు కడకు. 226

## హనుమంతుఁడు రామలక్ష్మణులను సుగ్రీవునికడకు గొనివచ్చుట

క. అంతట నిజరూపము గొని
సంతసమున మేను పెంచి స్కంధమునందున్
వింతగఁ దాలిచి మిము హను
మంతుఁడు వెస నెగసి వింటిమార్గము పట్టెన్. 227

క. చని ఋశ్యమూకశిఖర
మ్మున జేరిచి మిమ్ము- తాను ముందుగ సుగ్రీ
వుని గాంచి రామలక్ష్మణు
లను దెచ్చితి సఖ్యవృత్తి రమ్మని తెలువన్. 28

క. అని దెల్పిన సుగ్రీవుఁడు
మనమున హర్షమ్ము చెంది మహితాత్ముని నిన్
గన వచ్చి వృక్షశాఖా
సన మిచ్చెను గౌరవమ్ము సఖ్య మ్మెసఁగన్. 29

## లక్ష్మణుఁడు సుగ్రీవునితో నన్న మాటలు
## రామ-సుగ్రీవుల సఖ్యము

క. అన్యోన్యాసనదాన
మ్మన్యోన్యాలాపగౌరవాదరభావ
మ్మన్యోన్యత వెలయఁగ సౌ
జన్యము తోపంగఁ బల్కె సౌమిత్రి యిటుల్. 30

క. ఇనకులతిలకుం డీతం
డినతనయుఁడ వీవు నగుట- ఈ సంబంధ
మ్మున సఖ్య మ్మిరువురకున్
జననుతమై నెగడు కీశనాథా! వినుమా! 31

గీ అనఘ! నీతోడ మేము సఖ్యంబు గోరి
వచ్చినారము కూర్చె నీ వాయుసుతుఁడు
నీదు శత్రువుఁ బరిమార్చి నీ కితండు
రాజ్య మిచ్చును రుమతోడ రాఘవుండు. 32

ఉ. అతని వాక్కులన్ విని మహాముదమంది- ఇనాత్మజుఁడు నే
నాతని మైత్రిగోరి యటు లంపితి వాయుతనూజు లక్ష్మణా!
పూతచరిత్రుఁడైన రఘుపుంగవు కార్యము దీర్పువాఁడ నే
నాతని ఆ సతిన్ వెదుక నంపెద వానరవీరవర్గమున్. 33

చ. విను మొకనా డెవండొ వినువీధిని స్త్రీ గొనిపోవుచుండ నా
వనితయు రామ! కావు మనవద్యచరిత్ర! అటంచు నేడ్చుచున్
తన నగలేవొ కొన్నిటిని దా నిట వైచెను మూటగట్టి వా
నిని గొని దాచియుంచితిమి నీ వవి చూపుమ అన్నకున్ వెసన్.

ఉ. కన్నుల బాష్పబిందువులు క్రమ్ముట జూడగలేను లక్ష్మణా!
అన్నగ లన్ని మీ వదినె వైనది కానిది చూడుమన్న- నే
నన్ని యెఱుంగ భక్తి మెయి ఆమెకు నిత్యము పాదవందనం
బన్న! యొనర్చుటన్ వదినె అందెలు మాత్ర మెఱుంగుదున్
మదిన్. 35

గీ. కర్ణభూషల నెప్పుడు గాంచియెఱుగ
ఆమె కేయూరయుగళంబు నదియు నెఱుగ
నిత్యపాదాభివందన నియతిఁ జేసి
ఆమె అందెల నెఱుఁగుదు నవియె అనిన. 36

## సీత విడిచిన నగలమూటను రామునకు చూపించుట

క. అని తెచ్చి యిచ్చి చూపిన
జనకాత్మజ నగలు- రామచంద్రా! నీవున్
గని కడు దుఃఖావేగం
బునఁ గన్నుల బాష్పవారి పొంగుచుఁ గురియన్. 37

క. 'హా సీతా !' అని మూర్ఛిలి
గాసిల- ఇనసుతుఁడు నిన్ను గనుగొని రామా !
ఆ సీతాన్వేషణమును
జేసెద మా దనుజు పాపచిత్తు వధింపున్. 38

క. అని శపథము గావించిన
విని నీవును సంతసించి విను సుగ్రీవా !
నిను రాజును జేసెద, వా
లిని దునిమెద నీకు భయములేదు కపీంద్రా ! 39

గీ. అనుచు నిరువురు శపథంబు లాచరించి
అగ్ని సాక్షిగ నిల్చి సఖ్యంబు చేసి
సఖ్యభావమ్ముతోఁ బరిష్వంగములను
సలిపి విస్రంభగోష్ఠిని జరిపినారు. 40

గీ. మిత్రుసుగ్రీవుఁ గాంచి సౌమిత్రి యంత
నీదు చరితమ్ము నెల్ల విన్పించె మైత్రి
వాలి సుగ్రీవ వైరభావంబు నెల్ల
నీకు విన్పించెఁ దా నాంజనేయుఁ డెల్ల. 41

గీ. అట్టు లన్యోన్య సంభాషణాదికముల
ఉభయకష్టంబు లవియును నొక్కవిధము
లగుట మీ మైత్రి దృఢతరమయ్యె నంత
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 42

గీ. వాలి బలమును దెల్పెద నాలకింపు
అతులవిక్రముఁ డతఁడు మహాబలుండు
అతని నెదిరించి పోర శక్యమ్ము కాదు
రఘుకులాంభోధిచంద్ర ! శ్రీరామచంద్ర ! 43

## సుగ్రీవుఁడు వాలి బలపరాక్రమాదులన్ దెల్పుట

సీ. మయునకుఁ బుత్రుండు మాయావి అసురదో
ర్గంధంబుతోడ — కిష్కింధ చేరి
ఔద్ధత్యమున వాలి యుద్ధంబునకుఁ బిల్వ
వాలి సన్నద్ధుఁడై వానిఁ దరిమి
కొట్ట నాతఁడు కొండగుహలోనఁ జొరఁబడె
వాలి న న్నా గుహాద్వారమందు
నుండ నాజ్ఞాపించి ఒక్కండు గుహఁ జొచ్చె
మాస మైనను వాలి మాటలేదు
అస్రమాంసాస్థిపంకిలమైన రొంపి —
వఱద — గుహనుండి ఒకనాడు వచ్చె దాని
గాంచి వాలియె తా మరణించెననుచుఁ
దలఁచి పెనుశిల నా గుహాబిలము గప్పి. 44

ఆ. వాలి మృతికి దుఃఖవార్ధిలో నే మున్గి
వగచుచుండ మంత్రివరులు వచ్చి
రాజు లేనియట్టి రాజ్యమ్మునందున
శత్రువిప్లవములు జరుగవచ్చు. 45

ఆ. కీశనాథ ! నీవు కిష్కింధ కిప్పుడు
రాజవౌచు కడక రాజ్య మేలు
మనుచు మంత్రివరులు హరియూథపులు నన్ను
రాజు చేసినారు రాఘవేంద్ర ! 46

ఆ. అంత వాలి వచ్చి హతమార్చి మాయావి
మంత్రివరులు చెప్పు మాట వినక
కందరమ్ము మూసి కావరమ్మున వచ్చి
రాజ్య మాక్రమించి రాజువొదె ! 47

చ. అని- నను బట్టి కొట్టుచు మహాక్రుధ వాలియు వెంటనంట నే
వనములు పర్వతమ్ములును వారిధివాహినులెల్ల దాటి, ఓ
జనవర ! ఋశ్యమూకమును శాపభయమ్మునఁ జేరఁదంచు నా
మనమున నెంచి అప్తులగు మంత్రులతో నిట నుంటి రాఘవా !

ఆ. నన్ను దరిమికొట్టి నా భార్య నాతఁడు
అనుభవించుచుండె నక్రమమున
నీతిబాహ్యుఁ డతడు నిష్ఠురహృదయుండు
పాపబుద్ధి దుష్టభావనుండు. 49

ఆ. వాలి పాపబుద్ధి వారింపఁగాలేక
హనుమదాదిమంత్రు లంద ఱతని
బాసి వచ్చినారు రోసిరి మదిలోన
దుర్జయుండు వాలి దుష్టబుద్ధి. 50

## వాలి "దుందుభి" అను రాక్షసుని వధించుట

ఆ. మున్ను దనుజుఁ డొకఁడు మూఁడులోకమ్ములు
ముట్టి గెలిచి మహిషమూర్తి దాల్చి
భుజబలంబు తీట పోకార్చు బలశాలి
వీరు డెందు లేమి విర్రవీగి. 51

చ. కులగిరులన్ గదల్చుచును కొండల పిండి యొనర్చుచున్ మహా
జలనిధులన్ గలంచుచును జంగమ వింధ్యనగేంద్ర మట్లు దో
ర్బలమున జంతుసంతతి ఇభంబులఁ గూల్చుచు మాహిషాకృతిన్
చలమున వచ్చె దుందుభి నిశాచరుఁ డుద్ధతి వాలి మీదకున్. 52

ఉ. అమ్మహిషుండు గర్వమున ఆలము సేయఁగఁ బిల్వ వాలియున్
కొమ్ములఁ బట్టి నేలఁ బడగొట్టి పదమ్ములఁ ద్రొక్కి ముష్టిఘా
తమ్ముల నెమ్ములన్ విఱచి తన్ని, శిరంబును బట్టి త్రిప్పి చి
త్రమ్ముగఁ ద్రెంచి చిమ్మిన మతంగమునీంద్రుని ఆశ్రమస్థలిన్.

ఆ. పర్వతమ్ము వోలె పడినంత భోరున
అస్రవృష్టి గురిసె ఆశ్రమమున
దాన దడిసి యా మతంగమౌనీంద్రుఁడు
ఘూర్ణమాననేత్రగోళుఁ డగుచు. 54

ఆ. ఎవ్వ డీ శిరమ్ము నీ రీతి చిమ్మెనో
ఆతఁ డిటకు వచ్చినంత వాని
శిరము భిన్నమగుత ! శీఘ్రమ్మటంచును
శాప మిచ్చె కోప మాపలేక. 55

ఆ. ఋష్యమూకగిరికి ఋషిశాపమునఁ జేసి
వాలి రాఁడటన్న వార్త దెలిసి
ఇందు వీరిగూడి ఏ నుంటి రాఘవ !
వాలి నెదిరి పోరు వారు లేరు. 56

## సుగ్రీవుఁడు రాముని బలమును బరీక్షించుట

ఆ. ఎవ్వఁడైన వాలి నెదిరించి పోరాడ
వాని బలము సగము వచ్చునట్లు
వరము గాంచె వాలి వరబలమ్మునఁ జేసి
వాలి నెదిరి గెలుచువాడు లేడు 57

గీ. గిరిసమంబగు దుందుభి శిరము వాలి
తన బలమ్మున చిమ్మె యోజనము మేర
దాని చూపించి రామ! ఇద్దాని బలిమి
నీవు చిమ్మిన నమ్ముదు నీ బలంబు. 58

గీ. దాని గని నీవు మందస్మితమ్ము చేసి
కాలి అంగుష్ఠమున జిమ్మ గగనవీథి
కెగసి దశయోజనమ్ముల కేగి జలధి
పడియె సుగ్రీవుఁ డంత నీ బలము మెచ్చె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 59

గీ. సప్తతాళమ్ము లివె - వాలి శక్తి చూపి
బలముతో నూపి వీని నిష్పత్రములుగఁ
జేయు రాఘవ! గనుమ నీ చేవఁ జూపి
వీని భేదింతువేని గర్వింపవచ్చు. 60

చ. అన విని మందహాసమున ఆ రవిపుత్రుని గాంచి లీలమై
ఘనతరకార్ముకమ్ము విశిఖమ్మును జేఁగొని విక్రమస్ఫురత్
ఘనభుజవీర్యదర్ప మెసగంగను నేసిన సప్తతాళముల్
క్షణమునఁ గూల్చి బాణము రసాతలమున్ వడి జొచ్చి వచ్చెసన్.

## సుగ్రీవుఁడు రాముని మాధవునిగా గుర్తించుట

క. కని సుగ్రీవుఁడు మంత్రులు
మనమున విస్మయము చెంది మంజులఫణితిన్
వినుతించిరి బహువిధముల
మనమున సంశయము వీడి మహనీయునినున్. 62

క. ఇనకుల దీపా! మా మది
అనుమానము తీరె— తొలగె నజ్ఞానమ్మున్
నిను మనుజుగ భావించితి
మనుజాకృతి నున్న నీవు మాధవుఁడవుగా. 63

క. పరమపురుష! నిను గాంచితి
తరియించితి నాదు జన్మ ధన్యంబయ్యెన్
సిరులేలా! సతులేలా!
వరగుణ! రాజ్యంబునేల! వసుధ యదేలా! 64

చ. ఇనకులరత్న! రాఘవ! అహీనబలాన్విత! నిన్ను నే నిటుల్
వినయము దప్పి బుద్ధియు వివేకములేక పరీక్ష చేసితిన్
వినుతచరిత్ర! రామ! అరవిందదళాయతనేత్ర! భక్తిమై
వినమితమస్తకుండనయి వేడెద నన్ క్షమియించి గావుమా! 65

ఉ. ఆడినమాట తప్పుట ఇనాన్వయ జాతుల పాడిగాదు— ఈ
రేడు జగమ్ము లేకమయి ఏర్చిన నోర్చెద వారి గూల్చెదన్
వీడుము శంకలన్నియు వివేకవిహీనుని నీతిబాహ్యునిన్
వాడిశరమ్ము నొక్కటన వాలిని గూల్చెద నొక్క వ్రేల్మిడిన్.

గీ. కాన వాలిని బిల్వుము కయ్యమునకు
మిత్రతనయుండ వీవు - నే మిత్రకులుఁడ
మిత్రధర్మమ్ము దీర్తు - అమిత్రు గూల్తు
వంత దీర్చెద శంక అవంత వలదు. 67

క. అన విని యినతనయుఁడును
జని చివ్వకుఁ బిలిచె వాలి జయశీలుండై
విని వాలియు గద చేఁగొని
అనుజుని వధియింతు నే డటంచును వచ్చెన్. 68

## వాలి - సుగ్రీవుల యుద్ధము

చ. హరి హరి పోరునట్టుల అహంకృతిఁ బోరుచు హుంకరించుచున్
కరములు సాచి యొండొరులు గంధగజంబులఁబోలె ద్రోయుచున్
గిరి గిరి దాకినట్లు విజిగీషను నిర్వురు నేకరూపులై
గురుతర బాహువీర్యమున ఘోరముగా నటు పోరు నల్పినన్.

చ. తరువులు గూలె దిగ్గిరులు దద్దరిపోయెను జంతుసంతతుల్
పరువులు దీసె దిక్కులకుఁ బాఱెను పక్షులు భూమి యూఁగె - ఆ
యిరువురు నేకరూపమున నీ గతి బోరగ వాలిఁ గూల్పగా
శరమును నేయలేక కడు శంకితచిత్తుఁడవైతి రాఘవా! 70

## వాలికి ఓడి సుగ్రీవుఁడు వచ్చుట

ఆ. వాలితోడఁ బోరఁజాలక భీతిమై
పారివచ్చి రామభద్ర! యిట్టు
అభయమిచ్చి నన్ను ఆలమ్మునకుఁ బంపి
వాలిఁ గొట్టవైతి చాలియుండి. 71

ఆ. వాలి గూల్తు నొక్క వాడిబాణంబున
అనుచు ననికి నన్ను ననిచి నీవు
శత్రుచేత నిట్లు చంపింపఁ జూతువే
ఏమి తప్పు చేసి తేను రామ ! 72

ఆ. అనిన జాలి నొంది ఇనపుత్ర ! ఇటులందె !
ఒక్కరీతి మీర లున్నఁ జూచి
ఇరువురందు వాలి యెవ్వరో గుర్తింపఁ
జాలనైతి- కొట్టఁజాలనైతి. 73

## శ్రీరాముఁడు మరల సుగ్రీవుని వాలితోడి యుద్ధమునకుఁ బంపుట

గీ. మిత్రఘాతిత్వశంక నమిత్రు వాలి
నేయనైతిని అన్యథా ఎంచబోకు !
భ్రమనివారణమునకునై భవ్యదివ్య
పుష్పదామమ్ము ధరియించి పొమ్మనంగ. 74

గీ. పుష్పమాలను ధరియించి పోయి గిరులు-
దరులు దిక్కులు ప్రతినినాదమ్మలీన
సింహనాదమ్ము సేయుచు చేవమీర
వాలిఁ జివ్వకుఁ బిల్చె గర్వమ్మెసంగ. 75

## వాలిని యుద్ధమునకుఁ బోవలదని తార వారించుట

ఉ. వాలి మహోగ్రకోపమున వానిని నేడు వధింతునంచు- డా
కేలగదం ధరించి విజిగీషను బోవఁగ నెంచినంత- ఆ
వాలిని నిల్పి తార అనవద్యపరాక్రమ ! భానుజుండు- ఈ
వేళన యోడి పాటి యిటు వీఁకను వచ్చుట చూడఁగా వెనన్. 76

ఉ. ఏదియొ సందియమ్ము మది నేచుచునున్నది- అలకింపు నీ
సోదరు చెల్మిగోరుచు విశుద్ధచరిత్రులు రామలక్ష్మణుల్
సొదరబుద్ధి తా మనలసాక్షిగ సఖ్యము చేసినట్లుగా
కాదనఁబోకు మంగదముఖంబున వింటిని సత్యమౌ సుమా !

ఉ. వారు ప్రశస్తిగన్న- ఇనవంశసుజాతులటంచు వింటి, దు
ర్వారబలాఢ్యులంట- అనవద్యపరాక్రములంట- ఎక్కు మ
వ్వారి సహాయమబ్బుటను వచ్చె నినాత్మజుఁ డిట్లు పోరికిన్
వారలఁ జూడఁ బంపు మనవారల నీవును రాజనీతిమై. 78

ఉ. మానుము భీతి నెమ్మది- అమాయకురాలవు నీవు తారా ! ఆ
మానితవిక్రమక్రములు మాదగు సఖ్యము గోర కట్టు లా
దీనుని గోరువారలె ! మదీయబలంబును వా రెఱుంగరే !
మానిని! చింతదక్కు మనుమానము మానుము శత్రుఁ గూల్చెదన్.

## వాలి-సుగ్రీవులు రెండవసారి పోరుసల్పుట

చ. అని కడు కోపవేగమున ఆ గతి నేగి నిజానుజన్మునిన్
గనుగొని బల్మిమై భుజయుగంబున గట్టిగఁ బట్టెవైవ- ఆ
యినజుఁడు లేచివైచె ఇటు లిద్దరు గంధగజంబులో యనన్
ఘనగతి లిద్దరుం గొని నగంబులు దీకొనునట్లు లుద్ధతిన్. 80

క. త్రోయుచు భుజముల గదలం
ద్రేయుచు బిడుతివియకుంద భీరము మీరన్
పాయుచు రొప్పుచు కడువడి
దాయుచుఁ బోరాడి రన్నదమ్ములు పేర్కన్. 81

## శ్రీరాముఁడు వాలిని గూల్చుట

క. ఇనజుఁడు నిన్నే మాటికిఁ
గనుచును యుద్ధమ్ము సేయ ఘనకార్ముకమున్
గొని తరువును మాటుగఁ గొని
కనుమున్ నిలుచుంటి వొక్క క్షణకాల మటుల్. 82

చ. కనుగొని ఇంద్రదత్తమగు కార్ముకమున్ ధరియించి ధీరతన్
ఘనభుజసారమెల్ల గొని కాలభుజంగముపోలు సాయక
మ్మును గొని లక్ష్యశుద్ధి గని మోమున రౌద్రరసంబు మీరగా
ధనువునఁ గూర్చి వాలి నతి దారుణవజ్రమువోలె నేసినన్. 83

## వాలి శ్రీరాముని గాంచి దూఱుట

ఆ. అశనిపాతమట్టి ఆ బాణఘాతమ్ము
నంది వాలి మూర్ఛచెంది చిరము
తెలివి వచ్చి యెదుట తిలకించె నాజాను
బాహు శ్యామలాంగు పద్మనేత్రు. 84

ఉ. శ్యామలకోమలాంగు సువిశాలసమున్నతపీనవక్షు – సు
త్రామశరాసనాంచిత సురమ్యసుదీర్ఘభుజాభిరాము – ఉ
ద్దామపరాక్రమక్రమవిదారితదారుణదైత్యధాము శ్రీ
రాముని నిన్ను గాంచెను పరాజితభార్గవరాము చెంగటన్. 85

క. కని గద్గదహీనస్వర
మున బల్కెను వాలి రామ! మున్నెపుడేనిన్
నిను దూఱను – అపరాధ
మ్మును జేయను నేను నీదు మోమే యెఱుగన్. 86

క. నను వృక్షము మాటుగ గొని
ఘనశరమున నేయ నేమి కారణమగునో !
ఇనవంశంబునఁ బుట్టిన
జననాథ ! అధర్మవృత్తిఁ జనఁగాఁ దగునే. 87

క. నరనాథు లదెన్నడు వా
నరమాంసము దినరు గాదె ! నయవిద ! యిటులన్
వర నిజధర్మము వీడుట
ధరణీపాలకుల కెందు ధర్మమ్మగునే ? 88

ఉ. రావణుఁ డట్లు నీ సతి నరణ్యమునన్ గొనిపోవ నామెకై
నీవును దిక్కులారసి వనీస్థలిఁ ద్రిమ్మరు చిట్లు వచ్చి సు
గ్రీవునితోడ సఖ్యము నరిందముఁడంచును జేసినావు నా
లావు నెఱుంగవైతి వయొ లంకనె రావణుతోడ తేవనే ! 89

## శ్రీరాముఁడు వాలికి సమాధానము చెప్పుట

క. అని నిష్ఠురోక్తులాడిన
మనమున గర్హించి ధర్మమార్గము మాకున్
వినిపింతువు నిజసోదరు
సతి చెఱచుట - ఇద్ది ధర్మసరణియె చెపుమా ! 90

గీ. కూతురున్ - చెల్లె - మఱదలు - కోడ లరయ
ఒక్కరూపగు వీరిలో నొక్కరితను
చెఱచెనేనియు వాని శిక్షింపవలయు
ననుచు వచియించు శాస్త్రమ్ము లరయలేదె ! 91

గీ. దశరథాత్మజుఁడను నేను ధర్మవర్తి
ధర్మమును నిల్పువాఁడ నధర్మ మడచి
శిక్ష కర్హుఁడవవుట – శిక్షించినాను
కట్టిపెట్టుము ధర్మమార్గముల నుడువ. 92

గీ. సూర్యవంశీయుఁడను నేను శూరవరుఁడ
ఆలి విడిపింప నన్యసాహాయ్య మేల!
క్షత్రియుండను లోకరక్షణమె దీక్ష
వరుసవచ్చిన కోటి రావణులఁ గూల్తు. 93

గీ. ధీరభావంబు దోప గంభీరముగను
నీవు పల్కిన భయమంది నిన్నుఁ గనుచు
తప్పిదము చేసితిని నేను దండమునకు
అర్హుఁడను నౌదు క్షమియింపు మమలచరిత! 94

## వాలి శ్రీరాముని నారాయణునిగా గుర్తించుట

గీ. వనజభవుఁ డట్లు వేడ రావణుని జంప–
ధర్మరక్షణ సేయ నీ ధరణియందు
అవతరించిన ఆదినారాయణుఁడవు
తెలిసికొంటిని నిన్ను నే దివ్యపురుష! 95

గీ. అనుజుసుగ్రీవు కీశ రాజ్యాభిషిక్తు
చేసి అంగదు యువరాజు చేయుము ప్రభు!
అంగదుం డెన్న బాహువీర్యమున నాకు
సాటియగువాఁడు నీదు నాజ్ఞను మెలంగు. 96

గీ. ప్రాణముల్ వీడునపుడు నిన్ భావవీథి
కాంచినంతనె గల్గు మోక్షమ్ము గాదె!
అట్టిచో నిన్ను గంటి ప్రత్యక్షముగను
నీదు లోకమ్ము సిద్ధించు నిశ్చయముగ. 97

గీ. అమలకరమున నా హృదయమ్ము దాకి
బాణమును దీయు విడిచెదఁ బ్రాణములను
అనిన నీవును నటు హృదయమ్ము తాకి
ఆశుగము లాగ- అసువుల నతఁడు విడిచె. 98

గీ. అమ్ము దీసిన- వాలిదేహమ్ము నుండి
దివ్యతేజమ్ము వెలువడి దివికి నెగసి
అఖిలవానరు లాశ్చర్యమంది చూడ
అరిగి అమరేంద్రు దివ్యదేహమ్ముఁ జొచ్చె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 99

## తారా విలాపము

గీ. వాలి మరణించెనను ఘోరవార్తనంత
వానరాధీశమంత్రులు వచ్చి దెలుప
బోరు బోరున నేడ్చుచు తార వచ్చి
ధూళిధూసరగాత్రుఁడౌ వాలి గాంచి. 100

గీ. నేల పడియున్న పతి పాదమూలమందు
గాలిచే నేల గూలిన కదళివోలె
ముక్తమూర్ధజయై పడి మూర్ఛనంది
కొంత తడవుకు తెలివొంది కొందలమున. 101

గీ. పలవరించుచు విలపించి పతిని గూర్చి
నిన్ను గనుగొని అత్యంత ఖిన్నయౌచు
నన్ను విడనాడి వాలి క్షణమ్ముగూడ
ఉండఁజాలఁడు స్వర్గమ్ము నొందె గూడ. 102

గీ. వాలి గూల్చినయట్టి ఆ వాడిశరము
నేసి నన్నును గడతేర్చు మేను బోయి
వాలిఁ గూడెద – వైధవ్యబాధ తొలగు
పతివియోగమ్ముతో నేను బ్రతుకఁజాల. 103

## శ్రీరాముఁడు తార నోదార్చుట

గీ. అనుచు పలవించి విలపించు నామె గాంచి
తార నిట్టులు నీవు నోదార్చినావు
పాంచభౌతికదేహమ్ము పతియె – లేక
ఆత్మ పతియౌను నెమ్మది నరయుమమ్మ! 104

గీ. పాంచభౌతికదేహమ్ము – భర్తయైన
గలదు నీముందె గనుము దుఃఖమ్మదేల?
ఆత్మయే నీకు – పతియైన ఆత్మ కెపుడు
జననమరణాదులే లేవు జాతి లేదు
నామరూపమ్ములే లేవు – నాథుఁ డెవఁడు?
సత్య మరయుమ! ఇదియె సంసారమమ్మ! 105

గీ. తార నీరీతి చాల ఓదార్చి నీవు
జ్ఞానబోధమ్ము చేసి విజ్ఞాన మీయ
నిన్ను గుర్తించి ఆమె ఆపన్నశరణ!
పూర్వభవసంచితమ్మైన పుణ్యగరిమ. 106

గీ. నాకు దర్శన మిచ్చితి నాదు జన్మ
ధన్యమయ్యె నటంచును తార నిన్ను
బహువిధమ్ముల భక్తిమై ప్రస్తుతించి
చనియె నటనుండి తన బంధుజనులతోడ. 107

## వాలి అంత్యక్రియలు

గీ. నీవు చేసిన బోధ సుగ్రీవుఁ డెల్ల
వినుటచే దుఃఖభారమ్ము విడిచి వచ్చి
రామ ! నీ యాజ్ఞ రాజమర్యాద లొలయ
వాలిదేహమ్ము గొని పుష్పవాహనమున. 108

గీ. బంధుజనులును సైన్యాధిపతులు గొల్వ
అగ్నిసంస్కారమును జేసి అంజలించి
అఖిల బంధులతో నివాపాంజలిచ్చి
స్నాన మొనరించి వచ్చె నీ సన్నిధికిని. 109

## సుగ్రీవుని పట్టాభిషేకము

గీ. రామ ! సాక్షాత్తు నీవు నారాయణుఁడవు
శిష్టరక్షార్థమును దుష్టశిక్ష సేయ
అవతరించితి గాదె మానవుఁడ వౌచు
దయను గనుగొమ్మ ! నన్ను నీ దాసునిగను. 110

గీ. రఘుకులాధిప ! కిష్కింధ రాజవౌచు
ఏలు నీ భృత్యులము మమ్ము నేలుకొమ్మ !
అనిన సుగ్రీవ ! నీవె నే ననుచు బలికి
కౌగిటను జేర్చి మిగులంగ గౌరవించి. 1'1

గీ. కీశ రాజేంద్ర! ఇంక కిష్కింధ నీది
రాజ్య మేలుము దుమ ననురక్తి గొనుము
అంగదుని నీవు యౌవరాజ్యాభిషిక్తు
చేయు మాతఁడు భక్తి నీ సేవ చేయు.

గీ. పదియునాల్గేండ్లు నే జానపదమునందు
పదము మోపన– ఇది నాదు ప్రతిన గాన
అనుజ లక్ష్మణ! నీ వేగి హనుమదాది
మంత్రులను గూడి ప్లవగసామ్రాజ్యమునకు
అర్కతనయుని జేయు పట్టాభిషిక్తు
అంగదుని జేయు యౌవరాజ్యాభిషిక్తు
అనుచు బనిచిన లక్ష్మణుం డరిగి వెంట
సిరుల కిరవౌచు వెలయు కిష్కింధ చేరి.

గీ. అర్కపుత్రుని జేసి పట్టాభిషిక్తు
అంగదుని కూర్మి యౌవరాజ్యమున నిల్పి
రాజు సుగ్రీవుఁ డిచ్చు మర్యాదలంది
నిన్ను గనవచ్చి సర్వంబు విన్నవించె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర!

## ప్రస్రవణాద్రి శోభ

చ. జలజల పాఱు నిర్ఝరము చల్లని నీడల నిచ్చు వృక్షముల్
ఫలగురుభారనమ్రబహుపాదపముల్ బహువర్ణపక్షులున్
విలసితవల్లికావిసరవిస్తృతమంజునికుంజవారమున్
కలకలలాడు నా ప్రకృతి గాంచుచు– ప్రస్రవణాద్రిశోభలన్

సీ. గైరికాదికధాతుగణశోభితమ్మును
స్ఫాటికమణిరత్నభాసురమ్ము
పరిపక్వఫలభారబంధురవృక్షమ్ము
నిర్మలజలసరిన్నిర్ఝరమ్ము
కలరావశుకశారికాపక్షిలలితమ్ము
జ్యోతిర్లతాప్రభాజ్యోతితమ్ము
సాంద్రవనస్పతిచ్ఛాయాభిరామమ్ము
కమనీయసుశిలాకందరమ్ము
అగుచు చెలువొందు ప్రస్రవణాద్రియందు
ప్రకృతిరమణీయసానుమత్ భవ్యసీమ
వాసయోగ్యమ్ము శీతవర్షాసహమ్ము
రమ్యమై యొప్పు - ఒక కందరమ్ము గాంచి. 116

గీ. సజ్జనాత్మను బోలి ప్రశాంతినిలయ
మతి విశాలమ్మునగు కందరాంతరమున
వాసమును జేసి వార్షికమాసములను
గడప నెంచితి వీవు లక్ష్మణునితోడ 117

గీ. ప్రతిదినంబును - పుణ్యనిర్ఝరిణియందు
తాన మొనరించి నిత్యకృత్యములు దీర్చి
లక్ష్మణుం డిచ్చు వన్యఫలములఁ గొనుచు
అవని జూ చింత ప్రస్రవణాద్రి నుండ. 118

గీ. లలితగుణశాలి అనుజుండు లక్ష్మణుండు
నీ పదంబులు గొల్చుచు నియతభక్తి
ఆత్మతత్వంబు జిజ్ఞాస నడుగ నీవు
నరగఁ జెప్పవె వేదాంతసార మెల్ల
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 119

## వర్షాకాల వర్ణనము

ఆ. ఇట్లు కొన్ని దినము లేగిన యంతనే
కాఱుమొగులు నింగి క్రమ్ముకొనుచు
పట్టపగలె దెసలు చిట్టచీకటి గ్రమ్మ
కరకవృష్టి వానకాఱు వచ్చె. 120

ఆ. తొలకరించి మొయిలు తొలివాన కురిపింప
కమ్మవలపు పుడమి గ్రుమ్మరించె
హలము పట్టి భూమి హాలికుల్ దున్నంగ
వేడి బాష్పచయము విడిచె సీత. 121

సీ. కాఱుమేఘమ్ములు గ్రమ్మ నాకసమందు
పగలు రేయియు నొక్క పగిదియయ్యె
సూర్యరశ్మల వార్ధి శుష్కించి జలదమై
వినువీథి కేగి ద్రవించె ననగ
ఘోరు ఘోరున నభోభూభాగ మేకమై
కురిసె నీరదపంక్తి కుంభవృష్టి
కనుదోయి మిఱుమిట్లు గ్రమ్మ విద్యుల్లతల్
తళ తళ మెరసి దిక్తటుల నొరసె
ఫెళ ఫెళార్భటి నుఱుములు పిడుగులడరె
వఱదలెత్తుచు నదులెల్ల వడిగ పాఱె
అవనియంతయు జలమయమయ్యె నంత
సూర్యదర్శన మన్నదే శూన్యమయ్యె. 122

గీ. భేకఝాంకృతు లెల్లెడ పిక్కటిల్లె
నెమ్మితండమ్ము పేర్మి నృత్యమ్ము చేసె
ఇంద్రగోపమ్ము లవనిపై సాంద్రమయ్యె
కర్షకుల కెల్ల పర్వమ్ము వర్షఋతువు. 123

గీ. శ్యామసుందరరామ పర్జన్యమూర్తి
ఇంద్రధనువును ధరియించి సాంద్రగతిని
శాతనిర్ఘాతసమశరాసారవృష్టి
పరపి గ్రీష్మాసురప్రతాపమ్ము నడచె. 124

గీ. తొలకరించిన వానల పులకరించి
లలితరుచి మించె పుడమి చూలాలువోలె
పసిడిపంటల నిండుగర్భమ్ము దాల్చి
పుడమిపైదలి నీళ్లాడి పొలుపు దాల్చె. 125

గీ. పచ్చ పట్టుతివాసిని పఱచినట్లు
శాద్వలమ్ములు– చూడ ముచ్చటలు గొల్పె
పుడమిదాల్చిన పచ్చనిపట్టు మట్లు
సాంద్రగోధుమశాలి సస్యములు మించె. 126

## శరదవతరణము

గీ. వెలసె వానలు దిక్కులు విశదమయ్యె
మబ్బులన్నియు నెటో మటుమాయమయ్యె
తెల్లపూవుల దెసలెల్ల వెల్లనయ్యె
పండువెన్నెల కన్నుల పండువయ్యె. 127

గీ. దానముల పేదవడినట్టి దాతవోలె
జలము నెల్లను వర్షించి జలదచయము
వట్టిపోయెను దిక్కులు వట్టిపోయె
దాతలకు నిద్ది ప్రకృతిసిద్ధమ్ము గాదె. 128

గీ. కలకబారిన జలము నిర్మలమునయ్యె
నదుల వీఱుదులవలె పులినములు దోచె
క్రొత్త పోడిమి దోప కొంగ్రొత్త సిరుల
చిత్త మలరించు రీతి శరత్తు వచ్చె 129

సీ. మబ్బుబెబ్బులు లెల్ల మటుమాయమైపోయి
కులగిరి సుషిశాల గుహల జొచ్చె
వఱదలెత్తిన నదుల్ వడిపాటి విరహార్తి
కడలి కౌగిళ్లలో కరగిపోయె
జలధిగర్భమ్ములో స్వాతిముత్యములట్లు
వినువీథి చుక్కలు వెల్లివిరిసె
పండువెన్నెల వెల్ల పట్టుదిండుల నుండి
చంద్రుండు రాత్రిరాజ్యమ్ము నేలె
మంచువలిపమ్ము లడుగులమడుగు లొత్త
శరము పుష్పించి పట్టువింజామరముల
రాజహంసలు దివి సంబరమునఁ గొలువ
రాజమర్యాదతో శరద్రాజు వచ్చె. 130

## సుగ్రీవుఁడు రాగభోగ లాలసుఁడగుట

గీ. గిరిచరాచారవిధిని నంగీకరించి
దేవరన్యాయమునను సుగ్రీవు గూడి
తార రుమవోలె ప్రియతమదార యయ్యె
రాణు లిరువుర నినజుండు రక్తి నేలె. 131

క. గురుతర విరహవ్యథతో
చిరకాలము ఋశ్యమూకశిఖరాశ్రయుఁడై
తిరిగిన సుగ్రీవుం డిటు
వరరాణుల గూడి పారవశ్యండగుచున్. 132

క. భోగాసక్తుఁడు కడు నను
రాగాసక్తుండునౌచు రాణులతో సం
యోగాసక్తిని నిరతము
రాగిల్లుచు మఱచె తాను రామా! నిన్నున్. 134

గీ. రాజ్యభోగమ్ము లంది నిరంతరమ్ము
రాణులంగూడి కామానురక్తి మునిగి
యున్న సుగ్రీవు మంత్రిముఖ్యుండు హనుమ
గాంచి యొకనాడు తా వచియించె నిట్లు. 135

గీ. వర్షఋుతు వేగినంతనే వానరేంద్ర!
జానకీ మార్గణము సేయ జాలు వారి
నంపవలెనంచు రాముండు పలికెఁ గాదె
రాజ! మఱచితి వేమొ శ్రీరాము మాట. 136

## హనుమంతుఁడు సుగ్రీవుని హెచ్చరించుట

గీ. రామచంద్రుని కరుణచే రాజ్యమంది
రాగభోగమ్ములకు లొంగి రాము మఱచి
రాణులం గూడి అంతఃపురమ్ము వీడి
రావు నీ కిది తగునె సుగ్రీవ! రాజ! 137

గీ. అటులు రాముండు ప్రస్రవణాద్రిగుహను
అనుజుతోడుత కష్టమ్ము లందుచుండ
నీవు వారిని జూడంగ బోవు గాదె!
వారు కోపింప నెదిరించువారు గలరె. 138

ఆ. వానకాలు తొలఁగె వచ్చె శరత్తిదె
సీత జాడఁ దెలియజేయుపొంటె
అవనిలోన నున్న హరియూథపులఁ బిల్వ
ఆజ్ఞ లిచ్చి భటుల నంపవలయు. 139

గీ. అనిన భయమంది కపిరాజు హనుమ గాంచి
నీవు చెప్పిన దిదియెల్ల నిజము మంత్రి!
అష్టదిక్కులకు నీవ రాజాజ్ఞ గాగ
పంపి హరికోటి వేగ రప్పింపు మనియె. 140

గీ. పక్షమును మించకుండంగ ఋక్షవరులు
వేడుగన్నట్టి వానర వీరభటులు
శీఘ్రగతి వచ్చి కిష్కింధ చేరవలయు
అనుచు పంపించె భటుల రాజాజ్ఞగాగ. 141

## శ్రీరాముని విరహ వ్యథ

గీ. అచట రాఘవ! ప్రస్రవణాద్రియందు
గురుతరంబైన మైథిలీవిరహభరము
మదిని గుందింప జనకజ మనసులోనఁ
దలఁచుకొనుచును - కనులలో నిలుపుకొనుచు. 142

గీ. మెఱుపుతీవల గన్న - నీ మేని యొఱపు
చంపకము గన్న - నీదు నాసంపు సొంపు
భ్రమరముల గన్న నీ నీల భ్రమరకములు
తరుణి నా మది కదలి ప్రత్యక్షమగుదు. 143

గీ. మధురదృశ్యమ్ము లెవి గన్న మధురవస్తు
వేదియు గాంచిన మైథిలీ! ఎదను నీవ
కదలుచుందువు - దుష్టరాక్షసుల మధ్య
ఎట్లు యుంటివొ! నీ వార్త నెట్లు వింటు! 144

సీ. పూర్ణచంద్రునిఁ గన్న - పూర్ణేందుముఖి! నీదు
ముఖశోభ నా డెందమునకుఁ దోచు
కమలమ్ములన్ గన్న కంజాక్షి! నీదైన
కనుదోయి నా కంత గానిపించు
శుకభాషలను విన్న - శుకవాణి! నీ మృదు

మధురభాషలు నాదు మదిని విందు
కలహంసములఁ గన్న - కలహంసయాన ! నీ
గమనభంగిమ నాదు కనుల నిలుచు
చిగురుటాకుల గన్న నీ చిగురుకేలు
బింబముల గన్న నీ యోష్ఠబింబశోభ
విల్లువంచిన నీదు భూవిభ్రమమ్ము
కానిపించును ప్రేయసీ ! కనుల ముందు. 145

గీ. వింట విరిసిన ఆ హరివిల్లు గాంచి
సుభ్రు ! తలచెద నీదు భ్రూవిభ్రమమ్ము
నీరదమ్ముల గాంచిన నీలవేణి !
సఖియ ! తలపించు నీదు కేశముల సొంపు. 146

గీ. ఎందుఁ జూచిన నీ రూపె ఎదను కదలి
మెదలుచుండును కనులలో గదలుచుండు
దేవి ! నను బోలి ఎందొ - ఇందీవరాక్షి !
రమణి ! దుఃఖింతు వశ్రువర్షమ్ము కురిసి.
అనుచు సీతను మదిగాంచి వ్యథను జెంద- 147

గీ. నీదు దుఃఖమ్ము కనుగొని నీరదములు
నింగినుండియె కార్చు కన్నీటిధార
వదరలెత్తిన ఆ కొండవాగులట్లు
పరువులెత్తును నీదు భావస్రవంతి. 148

గీ. నీలనీరదసుందర నీలదేహ !
జలదపట్టులు నీవును జలదరించి
బోరుమంచును కన్నీటిధార కురిసి
ఎంత కుందితొ సీత నీ యెదను మెదల. 149

గీ. నీవు విరహాన అటులు కన్నీరు కురియ
తరులతాదులు నీదు సంతాప మరసి
చివురుటాకుల జారు బిందువుల మిషను
కార్చె నశ్రులు మిగుల దుఃఖమున క్రుంగి
నెమ్మినై గాంచి నేను శోకమ్ము గొంటి. 150

ఆ.వె. కలికి నిన్ను నేను– కలలోనఁ గనుగొంద
మన్న నిద్రలేమి అదియు లేదు
నీవు లేనియట్టి జీవితమే నాకు
భారముగను దోచు భవ్యశీల ! 151

గీ. రాజ్యభోగమ్ము లొల్లక రమణి ! నీవు
వనమునకు వచ్చితివి నన్ను ననుసరించి
చెంత నెప్పుడు నుండి విశ్రాంతి గూర్తు
నన్ను నెడబాసి యెట్టులున్నావొ నీవు ! 152

గీ. ఎచట నే రీతి నుంటివో ఎఱుఁగరాదు
ఎంత పలవించుచుంటివో వంతఁ జిక్కి
మూఁడులోకమ్ము లేకమై ముట్టినేని
శత్రు వధియించి నిను దెత్తు జనకపుత్రి ! 153

గీ. అట్టు లీ వట ప్రస్రవణాద్రియందు
ధరణితనయను నిరతంబు దలఁచుకొనుచు
వ్యథితహృదయుండ వొచు నా వర్షఋతువు
ఇట్లు గమియింపగా శరదృతువు వచ్చె. 154

## శ్రీరామచంద్రుఁడు సుగ్రీవు నుద్దేశించి లక్ష్మణునితో నాడిన మాటలు

క. అని చింతించుచు మనమున
అనుజుని లక్ష్మణుని గాంచి అనుజా ! గనుమా !
ఇనజుఁడు భోగాసక్తిని
మన విషయమె మఱచినట్లు మదికిన్ దోచున్. 155

క. జనకజ నన్వేషింపఁగఁ
బనిచెద భటకోటిననుచుఁ బలికెను గాదే !
పనలను జూడగనైనను
ఇనతనయుఁడు రాఁడు వాని నేమనవచ్చున్. 156

ఆ.వె. ఇపుడ ఇనజుపురికి నేగి శీఘ్రమ్ముగ
ఇనజు భావమేమొ ఎఱిఁగి రమ్ము
చేసినట్టి ప్రతిన చెల్లింపకున్నచో
వాలి గతియె నీకు వచ్చుననుము. 157

## లక్ష్మణుఁడు కోపావేశముతో కిష్కింధకు బయలుదేరుట

చ. అనుజునితోడ నీ విటు లనన్ వినినంతన లక్ష్మణుండు దా
ధనువుని బూని- ఆలయకృతాంతుని బోలిక క్రోధమూర్తియై
ఇనజు కృతఘ్ను నేడు వధియించి తదీయ శిరంబుఁ దెత్తు నే
ననిన- ససంభ్రమమ్ముగను ఆతనితోడుత నంటి విట్టులన్. 158

గీ. అనుజలక్ష్మణ ! తగదంత ఆగ్రహంబు
మిత్రపుత్రుండు మనకు సన్మిత్రుఁ డతఁడు
అనలసాక్షిగ నతని సఖ్యమ్ము చేసి
చంపవచ్చునె వాని నిశ్శంకవృత్తి ? 159

గీ. శపథమును దప్పఁడు నిశ్చయమటంచు
హెచ్చరిక చేసి వానికి హితము చెప్పి
అతని భావమ్ము నడువడి అరసి రమ్ము
దండ్య దగునేని దండింపఁదగు నటన్న. 160

ఉ. అన్నకు నీకు మ్రొక్కెడి శరాసనమున్ ధరియించి వీఁకమై
కన్నులు జేవురింపఁగ ముఖంబున రౌద్రరసంబు పిఱగా
అన్నిటలాక్షుఁడో యన మహాప్రళయాకృతి భీమమూర్తియై
మిన్నును మన్ను నూగగ గమించెను లక్ష్మణుఁ డంత నుగ్రుఁడై

గీ. కినుక లక్ష్మణుఁ డట్లు కిష్కింధ చేరి
ధనువు చేపట్టి సింహనాదమ్ము చేసి
నారి సారింప బెదరె దిఙ్నాగచయము
దిగ్గిరివ్రాతగుహలు ప్రతిధ్వనించె. 162

ఆ. కీశరాజధాని కిష్కింధ కా రీతి
మూర్తిగన్న క్రోధమో యనంగ
వచ్చు లక్ష్మణేశు వానరుల్ గనుగొని
భయముతోడ వేగ పాఱి వచ్చి. 163

ఆ. వచ్చె లక్ష్మణుండు చిచ్చరపిడుగట్లు
క్రోధమూర్తి దా నకుంఠగతిని
ఏమి కారణమ్మొ ఎఱుగమో యువరాజ!
పవనతనయ! శాంతిపఱుపు మనిన. 164

## పవనతనయుఁడు లక్ష్మణునకు స్వాగతము పల్కి లోనికిఁ గొనివచ్చుట

గీ. రాజునకుఁ దెల్ప వే యువరాజుఁ బంపి
వాయుతనయుండు లక్ష్మణస్వామి గాంచి
స్వాగతము పల్కి ఆతని శాంతుఁ జేసి
నగరునకుఁ దెచ్చి యిట్లు విన్నపముఁ జేసె. 165

గీ. వీరె లక్ష్మణ ! వానరవీరకోటి
దేశ దేశాల నుండి ఏతెంచినారు
రాజు సుగ్రీవుఁ డీనాడె రాముఁ జూడ
దాను వీరలతోడ రాఁదలఁచినాఁడు. 166

గీ. రామచంద్రుని సతిని శ్రీరమణి సీత
వెదుక నద్దెసలకు నేడె వీరిఁ బంపు
కోపమున్ జెందఁ దగునె నీకున్ మహాత్మ !
మిత్రు సుగ్రీవుఁ జూడ సౌమిత్రి ! రమ్ము. 167

గీ. అనుచు లోనికిఁ గొనితేర నచట నతఁడు
యోధవారమ్ము వానర యూథపతుల
ధర్మనిర్మిత సువిశాలభవనములను
సౌధవీథులు రచ్చలు చావడులను. 168

గీ. కనుచు నెన్నెన్నొ వాకిళ్లు గడచి నడచి
రత్నరంజిత మత్యంత రమ్యమైన
రాజభవనంబు గనుచు నా రాజసుతుఁడు
రాణివాసమ్ము తుదకు జేరంగవచ్చె. 169

గీ. అంగదునివల్ల సుగ్రీవుఁడంత తెలిసి
భయము గదురంగ మిగుల విభ్రాంతి చెంది
శాంతచిత్తుని జేసి లక్ష్మణుని - తెమ్మ
అనుచు నంగదుతో తార నంపె నతఁడు. 170

తార లక్ష్మణునకు స్వాగతము పలికి
ఆతని శాంతచిత్తుని గావించి లోనికి దెచ్చుట

గీ. తార - తా నంతిపురి ముందు ద్వారసీమ
నిలిచి లక్ష్మణు నెమ్మిమై పలుకరించి
స్వాగతము పల్కి అతని సుస్వాంతుఁ జేసె
రమ్ము దేవర ! ఇది మీ గృహమ్ము గాదె. 171

గీ. రాజు సుగ్రీవుఁ డంతఃపురమ్మునందుఁ
గలఁడు నీవన్న ఎంతయొ గౌరవమ్ము
నిన్ను గానితేర ఆతండు నన్ను బంపె
దేవరుఁడ వీవు రమ్ము సందియ మదేల ! 172

గీ. అదిగొ చూడుము సుగ్రీవు నాజ్ఞఁ జేసి
ఎల్లదిక్కులగల హరిమల్లురెల్ల
వసుమతీపుత్రి వెదుకంగ వచ్చినారు
మఱచిపోలేదు రాముని మాట రాజు. 173

గీ. రాముఁడే గాదె యిచ్చె నీ రాజ్యమెల్ల
అమ్మహాత్ముని నెంచు దైవమ్ముగాగ
నేడె సీతోడ శ్రీరాముఁ జూడ వచ్చు
అన్యథా యెంచ నీకు భావ్యమ్ము గాదు. 174

గీ. అనుచు లోనికిఁ గొనితేర నర్కసుతుఁడు
దిగ్గనన్ లేచి శయ్యను డిగ్గివచ్చి
భక్తిసంభ్రమ విసయసంభరితుఁ డగుచు
ప్రణతి చేసిన వానరరాజు గాంచి. 176

## లక్ష్మణుఁడు అంతఃపురమున నున్న సుగ్రీవు గాంచి క్రోధపరవశుఁడై ఆడిన మాటలు

శా. ఏమీ రాముని విస్మరించితివె కామీ ! వాలి సామ్రాజ్య మా
రాముండే గద నీకు నిచ్చె- ఇటు లీ రామామణుల్ గొల్వగా
కామాసక్తుఁడవౌచు నుందువటె ఉగ్రంబైన రామాశుగో
ద్దామాగ్నుల్ వడి గాల్చుగాదె నిను నీ ధామమ్ము-కిష్కింధయున్.

గీ. వాలి గూల్చిన ఆ రాము బాణవహ్ని
రగులుచున్నది కిష్కింధ రగులుకొల్ప
శపథమున్ దప్ప కీడు నిశ్చయము వినుమ !
వాలి పోయినగతె నీకు వచ్చు సుమ్మ ! 177

## హనుమంతుఁడు లక్ష్మణుని శాంతచిత్తుని గావించుట

క. అని కోపమ్మునఁ బల్కిన
యని లక్ష్మణుగాంచి హనుమ వినయాన్వితుఁడై
విను నీ కంటెను భక్తుం
డినజుఁడు శ్రీరామునందు ఇట్లనఁ జనునే ! 178

గీ. దీవి దీవులనుండియు ధీరులైన
వానరాధిపులెల్ల రావలె నటంచు
పంపె పదివేల వానరభటుల ముందె
వచ్చినారలు వారె దుర్వారబలులు. 179

ఉ. వచ్చిరి వారె చూడు మటు వానరయోధుల యూథనాథులన్
హెచ్చిన బాహుదర్పమున ఎల్ల సురాసురవీరవర్గమున్
మెచ్చరు - మేరుధీరులు అమేయబలాఢ్యులు వారిగూడి తా
వచ్చుచు నున్నవాఁ డిదిగొ వానరనాథుడు రాము జూడగన్.

శా. చేతోవేగముతో - తరించెదరు నిస్సీమాబ్ధివారమ్ములన్
యాతాయాతము చేయజాలుదురు వీ రానేతశీతాచలం
బేతన్మాత్రులుగాగ నెంచకు ప్రభూ ! ఈ యూథనాథాదులన్
ఏత ద్విశ్వము చుట్టి రాగలరు సుమ్మీ లక్ష్మణా! నమ్ముమీ! 181

గీ. జానకీదేవి గనుగొన జలధి దాటి
లంక గాలించగలరు నిశ్శంకవృత్తి
రావణునితోడ సంగరరంగమందు
నిలిచి పోరాడఁగల మహాబలులు వీరు. 182

## హనుమంతుఁ డాడిన మాటలకు లక్ష్మణుఁడు లజ్జితుఁడగుచు ఆడిన మాటలు

గీ. అనిన లజ్జితుఁ డగుచుఁ దా ననిలతనయు
ఇనజునిం గాంచి లక్ష్మణుఁ డిట్టు లనియె
ప్రణయమునఁ జేసి అట్లంటి అనిలతనయ !
అన్యథా యెంచఁబోకుమీ అర్కతనయ ! 183

ఆ. అచట రామచంద్రుఁ డారీతి సీతా వి
యోగభరముతోడ వేఁగుచుండ
కాముకుండవోలె కాంతలతో రాగ
భోగయుక్తి నీకుఁ బోలునయ్య ! 184

గీ. జానకీదేవి నరయంగఁ జాలినట్టి
వారి నల్దిక్కులకుఁ బంపవలయు గాదె!
రాముఁ జూడంగఁ దలఁచిన రమ్ము నేడె
నీవు చేసిన శపథమ్ము నిలుపుకొమ్ము! 185

## సుగ్రీవుఁడు లక్ష్మణునితో నాడిన మాటలు

క. అని పలికిన లక్ష్మణుఁ గని
ఇనజుఁడు వినయంబు దోప నిట్టులు పలికెన్
ఘనభుజుఁడగు శ్రీరామున
కెనయగు వీరుండు జగతి నెందునఁ గలఁడే! 186

ఆ. స్వామి కేను జేయు సాహాయ్య మది యెంత
సేవకుండనగుచు సేవఁ జేయ
వచ్చువాఁడ నిదిగో వైదేహి వెదుకంగ
పంపువాఁడ యూథపతుల నిపుడ. 187

గీ. అనుచు నినజుండు సౌమిత్రి నాదరమున
కౌగిటను జేర్చి మిగులంగ గౌరవించి
ఆననమ్మిడి అర్ఘ్యపాద్యాదు లిచ్చి
శాంతచిత్తుని మరియు సుస్వాంతుఁ జేసె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 188

## సుగ్రీవుఁడు లక్ష్మణునితో శ్రీరాముని జూడఁబోవుట

గీ. పవనతనయాది మంత్రిపుంగవులు గొలువ
యూథనాథులు వానరయోధులెల్ల
బలసి సాయుధులై యిరువంక నడువ
బట్టు లిరుకేవలన్ బరాబరులు సలుప. 189

గీ. ఛత్రచామరరాజలాంఛనము లొలయ
పటహభేరీరవంబు దిక్తటుల నొరయ
రాజమర్యాదతో స్వర్ణరథము నెక్కి
మిత్రతనయుండు వచ్చె సౌమిత్రితోడ. 190

గీ. అచట ప్రస్రవణాద్రి గుహాంగణమున
ప్రవిమలంబైన సువిశాలప్రస్తరమున
జనకజాతావియోగసంజాతవిరహ
తాపఖిన్నాత్ము నిన్ను దౌదవుల గాంచి. 191

గీ. అరద మల్లంత దూరాన నవతరించి
భయము వినయమ్ము మిగుల సంభ్రమము దోప
వినయవినమితగాత్రుఁడై యినసుతుండు
అతులభక్తిని సాష్టాంగనతులఁ జేసె. 192

గీ. పాదనతుఁడైన సుగ్రీవు - పట్టి యెత్తి
కౌగిటను జేర్చి కూర్మి సఖ్యమ్ము నెఱపి
ప్రక్కఁ గూర్చుండఁ జేసి సద్భావ మెసఁగ
క్షేమవార్తను నడుగ సుగ్రీవుఁ డంత. 193

చ. ప్రవిమల త్వత్కృపామతిని భాసురరాజ్యరమావిభూతి వై
భవములఁ గంటి, బంధురశుభంబులఁ గాంచితి, పుత్రమిత్రబాం
ధవులను - మత్సతిన్ రుమను. తార నుదారను బొందినాఁడ, రా
ఘవ! భవదీయమైత్రిని సుఖంబుగ నుంటి దయాపయోనిధీ!

ఉ. వచ్చిరి దేశదేశముల వానరవీరులు సీతజాడలన్
చెచ్చెర గాంచి వచ్చెదరు సింహపరాక్రము లెల్లవారలున్
హెచ్చిన రాజభక్తిమెయి నిత్తురు ప్రాణములైన వీర లో
సచ్చరిత! ప్రభూ! గనుమ - సర్వహరుల్ దివిజాంశసంభవుల్,

## సుగ్రీవుఁడు వానరయూథనాథులను శ్రీరామునకు పరిచయము గావించుట

శా. నానాద్వీపనివాసులన్ మఱియు నానాశైలసంవాసులన్
నానాకాననవాసులన్ మఱియు నానాదేశసంజాతులన్
నానాకార విచిత్రరూపులను నానావర్ణసంశ్లిష్టులన్
నానావానర – ఋక్షనాథుల మహాలాంగూలురన్ గాంచుమా !

క. కొందఱు దశగజబలు లింక
కొందఱు శతనాగబలు లకుంఠితసత్త్వుల్
కొందఱు నాగాయుతబలు
లందఱు నా మేరుమందరాద్రిసమానుల్. 197

సీ. ఇతఁడు – ఋక్షవిభుండు హితమంత్రిముఖ్యుండు
కోటి భల్లుకనాయకుం డితండు
ఇతఁడు – వాయుసుతుండు మతిశాలి – తేజస్వి
సచివులలో ముఖ్యసచివుఁ డితఁడు
ఇతఁడు వాలిసుతుండు – అతిలోకవీరుండు
తండ్రిని మించు నుద్దానుబలుఁడు
ఇతఁడు కేసరి – వాయుసుతునకు జనకుండు
అనమానబలుఁడు దేవాంశజుండు
మైంద శరభ గంధమాదన దధిముఖ
గవయ నీల పనస గజ సుషేణ
ద్వివిద తార ముఖ్యవీరులు వీరెల్ల
యోధవరులు ముఖ్యయూథపతులు. 198

గీ. నీలుఁ డీతండు వానరానీకములకు
సర్వసేనాధినాథుండు జ్వలనసుతుఁడు
వ్యూహనిర్మాణదక్షుఁ డాయోధనమున
అగ్నికల్పుఁడు శత్రుదాహమ్ము సేయు. 199

క. అందఱు త్వత్పదభక్తులు
అందఱు ఆజ్ఞానువర్తు లందఱు దక్షుల్,
ఇందఱిలో నచ్చిన వా
రందఱి వైదేహి నరయ నంపుము దేవా ! 200

ఆ. అనిన సంతసించి అర్కజుఁ గనుగొని
ఎవ్వరెవ్వ రిందు నెంతవారొ
ఎవరు కార్యదక్షు లెఱుఁగుదు నీవె కా
తగినవారిఁ బంపఁదగుదు నీవ. 201

## సుగ్రీవుఁడు సీత నన్వేషింప వానరయోధుల నంపుట

క. అనినన్ నీ ఆజ్ఞను గొని
ఇనజుఁడు తగువారి నెంచి యిట్లని పనిచెన్
జనకజ నరయఁగ బోవుఁడు
కనుగొని మాసమ్ములోనఁ గ్రమ్మఱవలయున్. 202

క. ప్రాచీప్రతీచ్యుదీచుల
కేచిన బలదర్పయుతుల నెంచి మదాజ్ఞన్
వే చని మైథిలి నరయుఁడు
చూచెద మీదైన కార్యధూరత నెల్లన్. 203

గీ. దక్షిణాశకు నత్యంతదక్షులైన
వారిఁ బంపంగవలెనంచు వానరేంద్రు
డంగదుని నాయకత్వాన హనుమదాది
యూథనాథుల నియమించె యోధవరుల. 204

సుగ్రీవాజ్ఞ-

గీ. అవనిజాతను గనకుండ ఎవరుగాని
మాసమును మించి వచ్చినన్ మరణశిక్ష
తప్ప దియ్యది వినుడు మచ్ఛాసనమ్ము
అనుచు హెచ్చరికను జేసె అర్కసుతుఁడు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 205

శ్రీరామచంద్రుఁడు తన అంగుళీయకమును
ఆనవాలుగా సీత కిమ్మని హనుమంతున కిచ్చుట

గీ. రామ ! నీకును వానరరాజునకును
అందఱున్ భక్తి పాదాభివందనములు
చేసి నిర్దిష్టదిశలకు సీత నరయ-
తరలగా నీవు వాయునందనుని గాంచి. 206

గీ. అనిలనందన ! కార్యసాధనమునందు
దక్షుఁడవు నీవు బుద్ధిమత్తరుఁడ వీవు
బలము ప్రజ్ఞావిశేషంబు ప్రౌఢతయును
నీకె గలదంచు నెంతయు నాకుఁ దోచు. 207

గీ. ముద్రితమన్నామాక్షర
ముద్రిక నడియాలముగను భూసుత కిమ్మా !
భద్రముగాఁ గొనిపొమ్మి
ముద్రికఁ గని సీత చాల మోదము చెందున్ 208

ఆ. నన్ను జూచినట్లు నా ముద్రికను గాంచి
నిన్ను విశ్వసించు నీరజాక్షి
ఇచటి మా చరిత్ర మెల్లను వినిపించి
ఆమె క్షేమవార్త నరసి రమ్ము. 209

ఆ. శుభముహూర్త మిదియ శుభమస్తు! విజయోస్తు!
కార్యసిద్ధిరస్తు! క్రాంతిరస్తు!
అనుచుఁ బలుక నీదు ఆశీస్సు తలదాల్చి
భక్తివినయ మెసఁగ ప్రణతి సేసి. 210

గీ. అంగదునినేతృతను వారలంద ఱట్లు
దక్షిణాశకుఁ గదలిరి తక్షణంబ
జనకజామార్గణార్థంబు చనుచు వారు
కొండలన్ కోనలన్ మహాగుహలు వనులు. 211

గీ. అరసి తిరుగుచు ఆ దక్షిణాశ యెల్ల
శుష్కతాలోష్ఠకంఠులై శోష చెంది
ఆర్ద్రపక్షంబులైన విహంగమములు
కందరమునుండి వచ్చుట గాంచి యుబ్బి. 212

గీ. అందులో నుండవచ్చు జలాశయమ్ము
అనుచు భావించి దప్పిమై అందు జొచ్చి
చాలదూరమ్ము నడచి విశాలమైన
ఆశ్రమం బొండు గనిరి వా రందులోన. 213

సీ. బహువస్తుజాలసంభరితకోష్ఠంబులు
మణిమయభాసురమందిరములు
ఇష్టమిష్టాపూప మృష్టాన్నరాశులు
పరిపక్వసుమధురఫలచయమ్ము
బహువిధఫలసారపరిపూర్ణకుంభముల్
రాజితభోజనభాజనములు
స్ఫటికాశ్మబద్ధసోపానాంచితములైన
సువిశాలసుందరభవనములను

గాంచి యిద్ది యేదొ గంధర్వనగరమ్మొ
భువికి దిగిన భవ్యదివిజపురమొ
అనుచు వెరఁగు దోప నందందు దిరుగుచు
యోగనిరత నొక్క యువతి గాంచి.

ఆ. ఈమె ఎవరొ! ఇంక ఈ పురం బెవరిదొ
ఇచట ఒంటినుండ నేమి కతమొ
అనుచు హనుమ దలఁచి వినయభావమ్మున
అమ్మ! ఎవరిదాన వమ్మ! అనిన.

ఆ. ఆమె కనులు విప్పి ఆ వానరులఁ గాంచి
మీర లెవరి భటులు? మీర లిటకు
రాకత మ్మదేమి? ఈ కందరమ్మున
మీర లేల జొచ్చినారొ చెపుడి.

## పవనతనయుఁడు-స్వయంప్రభకు తమ వృత్తాంతమును దెల్పుట

ఆ. అనిలతనయుఁ డంత ఆ యోగినికి మ్రొక్కి
అమ్మ! మా చరిత మాలకింపు
వానరేంద్రు మంత్రివరులము మే మమ్మ!
భవతి! మేము రామభటుల మమ్మ!

సీ. దశరథక్షితిపతి తనయుండు రాముండు
జనకాజ్ఞ దండకావనికి వచ్చి
తన సతి సీతయు తమ్ముండు సౌమిత్రి
తన్ను గొల్వగ నుండె దండకమున
అనుజునితో మృగయార్థ మేగినతఱి
అసురు డెవ్వడొ సీత నపహరించె
ఆమె నన్వేషించు చా రామచంద్రుండు
కిష్కింధ చేరి సుగ్రీవు గలసి
అనలసాక్షిగ వాని సఖ్యమ్ము చేసి
వాని యన్నను దుష్టాత్ము వాలి గూల్చి
రాజుగా జేసి సుగ్రీవు రాజ్యమునకు
అనుజుతోగూడ ప్రస్రవణాద్రి నుండె. 218

గీ. మిత్రభావమ్మునన్ జేసి మిత్రసుతుడు
అవనిజాతను వెదకిరం డనుచు మమ్ము
దక్షిణాశకు బంప నో తల్లి! మేము
ఆమె నందందు నరసి తృషార్తి చెంది. 219

గీ. జలపిపాసను జేసి ఈ బిలము సొచ్చి
దైవవశమున గంటి మో తల్లి! నిన్ను
దివిజకాంతవె ఔదు వో దేవి నీవు
నీదు చరితమ్ము తెల్పవే నిర్మలాత్మ! 220

ఆ. అనిన నామె మిగుల ఆనందమును జెంది
భోజ్యములను గొని బుభుక్షతీర
తృష్ణతీర విమలతీర్థమ్ము సేవించి
రామభక్తులార! రండ టన్న. 221

క. జలములు గ్రోలి యథేచ్ఛగ
ఫలములు మృదుమధురభోజ్యభక్ష్యాదుల నా
కలి దీరగ గొని వచ్చిన
పలుసుగ తన చరిత మిట్లు వారికిఁ దెలిపెన్. 222

స్వయంప్రభ— తన చరిత్రమును వానరులకుఁ దెల్పుట

వినుడు వానరులార! విశ్వకర్మతనూజ
"హేమాఖ్య" అచ్చరలేమ గలదు
ఆమె నృత్యము చేసి ఆ హరు మెప్పించి
వరముగాఁ బడసె నీ పురవరమ్ము
అతినిష్ఠమై ఆమె అయుతవర్షమ్ములు
తపియించి బ్రహ్మతాదాత్మ్య మందె
ఆమె సఖిని నే 'స్వయంప్రభ' అనుదాన
శ్రీనాథుఁ గొలుతు విశిష్టభక్తి
యోగనిరతి నిందు నే యోగినినయి
యుంటి, శ్రీరామదాసులగంటి మిమ్ము
రాముఁ డాతండ— ఆదినారాయణుండు
అతని భృత్యులు మీరు పుణ్యాత్ములయ్య! 223

శ్రీస శ్రీరాముఁ జూడ— కిష్కింధ కిపుడ
పోవెదను— మీరు కన్నులు మూసికొనుడు
క్షణములో మిమ్ము దాటింతు కందరమ్ము
అనుచు గాంధర్వవిద్యచే నంపె వారి. 224

గీ. పవనతనయాదు లా స్వయంప్రభకు మ్రొక్కి
కనులు మూసిన యంత ఆ క్షణములోన
బిలము వెలువడి అంద జీవలకు వచ్చి
ఆమె మహిమకు అశ్చర్యమందినారు
రమ్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 225

## స్వయంప్రభ– ప్రస్రవణాద్రియందున్న శ్రీరామచంద్రుని దర్శించుట

గీ. అటు 'స్వయంప్రభ' ప్రస్రవణాద్రి చేరి
త్వత్పదంబుల వ్రాలి శ్రీదయిత ! నీదు
పాదదాసిని నే స్వయంప్రభను దేవ !
ధన్యనైతిని రామ ! త్వద్దర్శనమున. 226

గీ. ఎన్నొ వేలేండ్లుగా రామ ! నిన్నె మదిని
నిల్పి నిశ్చలభక్తి – ధ్యానించుచుంటి
ఇంద్రనీలాభదేహ ! బ్రహ్మేంద్రవినుత !
దేవ ! త్వద్భక్తురాలను బ్రోవుమయ్య ! 227

గీ. దాశరథివౌచు మానవత్వమ్ము నూని
అవతరించిన ఆదిమాధవుఁడ వీవు
నిగమనిచయంబె నిన్ను వర్ణింపలేక
మూగవోవగ నే నెంత మూఢమతిని. 228

గీ. శిష్టులను బ్రోవ దుష్టుల శిక్షసేయ
అవతరించితి వందు రీ అవనియందు
అట్టి నిన్నిట గంటి ప్రత్యక్షముగను
అనఘ ! నేటికి నాదు పుణ్యమ్ము పండె. 229

గీ. బహువిధమ్ముల నిన్నెంతొ ప్రస్తుతించి
లలితనిజదేహవల్లరి పులకరింప
అమితమౌ భక్తి పారవశ్యంబు చెంది
ముక్తిపదమును - తావకభక్తి వేడ. 280

గీ. అమె భక్తికి సమ్మోదమంది మదిని
పరమపదమైన వైకుంఠపదమె నీవు
వరముగా నిచ్చితివి గాదె ! పరమపురుష !
ఇంచి తదియెల్ల నే వనకాంత నగుచు
రహస్యగుణసాంద్ర ! శ్రీరఘురామచంద్ర ! 281

## అంగదాదుల మంత్రణము

గీ. అంగదుండు నచట - హనుమదాదుల గాంచి
మనము బయలు వెడలి మాసమయ్యె
సీతఁ జూడకుండ శ్రీరామవిభు నెట్లు
గాంచఁగలము ! రవిజు గాంచు టెట్లు. 282

ఉ. మాస మతిక్రమించె హనుమా ! గనుమా ! యిక రామభూవిభున్
భూసుతఁ జూడకుండ గనఁబోవగఁ గాలము భానుజుండు వి
శ్వాసము తోడుతన్ మనల బంపె నవాదికి మార్గణార్థమై
ఈ సమయంబునన్ మన మికేమి యొనర్చుటొ తోచ దేమియున్.

గీ. "అవనిజాతను గనకుండ - ఎవరుగాని
మాసమును మించి వచ్చిన మరణశిక్ష"
అనుచు హెచ్చరికను జేసె హరివిభుండు
చంపు నే మిష నన్ను నిశ్శంకవృత్తి. 284

ఆ. శత్రుపైన వాలిపుత్రుండ- నాయందు
ఇనజునకును ప్రేమ ఎట్టులుండు ?
రామవిభుఁడు నన్ను రక్షించె- గానిచో
పవనతనయ ! నాకు బ్రతుకు గలదె ! 2:5

ఆ. అనిన ననిల తనయుఁ డంగదు గనుగొని
వినుము నాదుమాట విశ్వసించు
నీ పితృవ్యునకును నీయందు శత్రుత్వ
మిందుకైన గానిపించదోయి ! 236

ఆ. తగునె యిట్టు లనుట – తారాసుతుండవు
నిన్ను జూచు రాజు నిందుప్రేమ
రాఘవుండును యువరాజుగా నినుఁ జేసె
అట్టి భయము విడువుమయ్య ! మదిని. 237

గీ. లెమ్ము వీడుము శంక ధైర్యమ్ము గొనుము
రామలక్ష్మణులున్ మన రాజు మెచ్చ
అవనిజాతను గాంచియె అరుగవలయు
సీతఁ గనకుండ బోవంగ సిగ్గుగాదె ! 238

చ. మనమున చింతమాని వినుమా యువరాజ! రఘూద్వహుండెదన్
మన యెడ కార్యసాధన సమర్థత గాంచి, నిజాంగుళీయకం
బును మనచేతి కిచ్చెగదె భూసుత కిమ్మని ఆనవాలుగా
అనఘుఁ డతండు- తాన "శుభమస్తు! జయోస్తు"ని బల్కి దీవనల్

ఉ. అతఁడు- మాధవుండు- జనకాత్మజ లక్ష్మియుగా నెఱుంగు మీ
రీతిగ మానవాకృతి ధరించి చరింతురు మాయబూని, తా
మాతతపుణ్యభాగ్యమున అతని దూతలమైతి మిట్లు భూ
జాతను జూచి రాగలము సత్యము రామునిమాట తప్పునే ! 240

ఉ. కావున దక్షిణాశగల కానల కోనల నన్ని చూడఁగాఁ
బోవుద మింక నెట్లయిన భూసుతఁ గాంతుముగాక ! రిత్తమై
పోవగరాదు నాదయిన బుద్ధికి నీ గతిఁ దోచు నన్న నా
పావని యూథనాథులు సెబాసని మెచ్చి వినిశ్చితార్థులై. 241

గీ. తక్షణమ వారలందఱు దక్షిణాశ
ఎల్ల గాలించి జానకి నెందుఁ గనక
చేరి దక్షిణవారాశి తీరభూమి
అభ్రమును రాయు నలమహేంద్రాద్రి గనిరి. 242

గీ. దక్షిణాశ-వార్ధి దర్పించి పైకుబ్బి
విఱిగిపడెడు తరఁగ నురుఁగుగముల
అల్పబలుల గాంచి అవహాసమును జేయు
నట్టు తోచె- తాను మిట్టిపడుచు. 243

క. నురుఁగులు గ్రక్కుచు- తరఁగలు
పరుగులు వెట్టుచును నెగిరిపడుచున్ వెలుచన్
తురగంబుల దాడ్పున నవి
ఉఱుకుల్ వెట్టుచును దక్షిణోదధి తోచెన్. 244

ఆ. ధీరుఁడైన మేటి వీరాగ్రణిని బోలి
అచట నిలిచియుండె అద్రిరాజు
హోరుమనుచుఁ దా నహోరాత్రములు వార్ధి
పోరుసల్పి ఓడిపోవ రెవరు. 245

గీ. సారధీరుని సంసారసాగరమ్ము
ముంచలేదంచు మనకు బోధించు నిద్ది
ఈ మహావార్ధి తాను మహేంద్రగిరిని
ఎన్ని యేండ్లయిన ముంచలే దిదియ సాక్షి. 246

గీ. ఇట్టి భావంబు లెవియేవొ ఎదను మెదల
కొంత తడవందు— వారు విశ్రాంతి నంది
సీత నెంతకుఁ గానమి చింత జిక్కి
కార్యసాధనమార్గంబుఁ గాంచలేక. 247

## అంగదాదులు ప్రాయోపవేశదీక్షఁ బూనుట

గీ. మరలి కిష్కింధ కేగిన మన విభుండు
మరణదండమ్ము విధియించు మనకునెల్ల
అబ్ధి దాటంగ మనకు శక్యమ్ము గాదు
ఇంక— ప్రాయోపవేశమే ఇపుడు శరణు. 248

క. అని వారలు తత్తీరం
బున నిరశనదీక్షఁ బూని పుణ్యచరిత్రన్
జనకాత్మజఁ గనమైతిమి
మన జన్మమె వ్యర్థమయ్యె మాట లికేలా! 249

అని చింతించుచుండ—

గీ. అపుడె ఆహారసంపాదనార్థ మద్రి
గుహను వెలువడి సంపాతి కొండదిగువ
దృష్టిసారించి ప్రాయోపవిష్టులైన
వానరుల గాంచి భక్షింపవచ్చె నటకు. 250

గీ. ఇనజునకుగాని శ్రీరాఘవునకుగాని
మేలు సేయని మన జన్మమేల అకట!
అదిగొ ఆ గృధ్రమేదొ ఆహారమునకు
నిటకు వచ్చెడు అది మ్రింగునేమొ మనల. 251

గీ. అవనిజాతను చోరుఁడై అపహరించు
అసురనాథునితోఁ బోరి అసువులొడ్డి
జానకీజానికరుణ మోక్షమ్ముఁ గాంచె
అల జటాయువు జన్మ ధన్యమ్ముఁ గాదె ! 252

గీ. అరుణతనయుండు సంపాతి– ఆ జటాయు
నామమున్ చెప్పి పొగడు వానరులఁగాంచి
వీర లెవ్వరో ప్రాయోపవిష్టులగుచు
ఇట్టులుండఁగఁ గారణమేమొ అనుచు. 253

సీ. విహగేశుఁ డో మహామహులార ! మీ రిట్లు
ప్రాయోపవేశమ్ముఁ జేయనేల ?
ఆ జటాయువు నాకు అనుజుండు ప్రాజ్ఞుఁడు
'రాముని సతిఁగావ ప్రాణ మిచ్చె'
అని మీర లన వింటి– ఆ రామునకు మీకు
సంబంధమేమొ విస్పష్టముగను
వచియింపుడీ మిమ్ము వధియింప హరులార !
రాముఁ డాతండు నారాయణుండు
అతని చరితమ్ముఁ విన కుతూహలము కలదు
అనిన నంతట లేచి– ఆ అంగదుండు
రఘుకులోత్తమ ! దావకారణ్యగమన
మాదిగాఁగల వృత్తాంత మంత తెలిపి. 254

గీ. అర్కతనయాజ్ఞ– ఈ దక్షిణాశ వెదకి
జానకీదేవిఁ గనకె మాసమ్ముఁ గడచె
మరలి కిష్కింధ కేగిన మా విభుండు
మరణశిక్షను విధియించు మాకునెల్ల. 255

గీ. కాన ప్రాయోపవేశమ్మె కార్యమనుచు
ఇట్టులుంటిమి దీక్ష- పక్షీంద్ర మేము
ఇనకులాధిపు రమణి తా నెందు గలదొ
నీకుఁ దెలిసిన దెల్పవే నీడజేశ ! 256

గీ. ముందు వినిపింపు నీ కథ విందు మనఘ !
అనిన వినిపించె సంపాతి తన చరిత్ర
సూరసారథియైన అనూరునకును
అల జటాయువు నేనును ఆత్మజులము. 257

## సంపాతి తన కథను దెల్పుట

చ. వినుఁడు జటాయు వేను వినువీధికిఁ బోయితి మొక్కనాడు మా
జనకు ననూరు గాంచగ ప్రచండగభస్తిమహాగ్నికీల నా
యనుజుఁడు సొమ్మసిల్లఁ గని ఆతనిఁ గావఁగ నెంచి మింటికిన్
జని వెస నాదుపక్షములఁ జాచిన దగ్ధములయ్యె నా గఱుల్. 258

గీ. దగ్ధపక్షుల మగుచు భూతలమునందు
పడినవారము- ఇహదూరపాతవశత
మూర్ఛ మునిగితి- కొన్నాళ్ల మూర్ఛతేఱి
కనులు విప్పి జటాయువు గానమైతి. 259

గీ. దేశమేదియో సుంత గుర్తింపలేక
గఱులు లేమిని ఇటు నటు గదలలేక
క్షుత్పిపాసల నెడనెడ సొమ్మసిలుచు
ఎటులొ చేరితి తుద కీ మహేంద్రగిరిని. 260

గీ. పక్షహీనుండనై అట్లు బ్రతుకలేక
ఆత్మహత్యకు బాల్పడ్డ నంతలోన
చంద్రమానామ మునిలోకచంద్రుఁ డరసి
నన్ను వారించి పలికె ప్రసన్నుఁ డగుచు. 261

గీ. ఆత్మహత్యయు నరయంగ హత్య యొకటె
అట్టి పాపమ్ము నెవరు సేయంగరాదు
జ్ఞానదృష్టిని నీ భవిష్యమ్ము గంటి
భవ్యమతి నాదు మాట సంపాతి! వినుమ! 262

## చంద్రమానామ మునిరాజు_ సంపాతికి ఆతని భవిష్యచ్చరితమ్మును దెల్పుట

సీ. త్రేతాయుగమ్మున శ్రీపతి రాముఁడై
ధర్మమ్ము నిలుప నధర్మ మడప
అవతరించును భువి ఆతఁడు పిత్రాజ్ఞ
దండకావనిలోన నుండునపుడు
ఆతని అర్ధాంగి సీతను రావణుం
డను దుష్టరాక్షసుం డపహరించు
ఆమె నన్వేషించు చా రాఘవేంద్రుండు
కిష్కింధ చేరి సుగ్రీవుతోడ
అనలసాక్షిగ కూర్మి సఖ్యమ్ము చేయు
జనకజాతను వెదకంగ నినసుతుండు
పవనతనయాంగదాదులఁ బంపునపుడు
దైవవశమున గనుగొందు వీవు వారి, 263

ఉ. వారి ముఖమ్మునుండి వినువాఁడవు శ్రీరఘురాము సత్కథా
సారము దానఁజేసి విలసన్నవపక్షము లుద్భవిల్లు నీ
కోరిక తీరు వానరులకున్ వినిపింతువు సీతజాడ నీ
దూరపుదృష్టిశక్తి - వినుతుల్ పచరింతురు వానరేశులున్. 264

## దూరదృష్టిగల సంపాతి - సీత జాడను దెల్పుట

చ. అని వచియించె మౌని యపు
డాతని మాటలు సత్యమయ్యెగా
కనుఁ డివె పుట్టె పక్షములు
గాంచి వచించెద సీతజాడనీ. 265

చ. వననిధిమధ్య లంక యను పట్టణ మల్లదె దోచు రాఘవే
శుని సతి జానకమ్మయు నశోకవనమ్మున గానుపించు యో
జనశతదూరమై తగు విశాలసముద్రము దాట నింక యో
చనమును జేయుఁడయ్య! మది సంశయ మించుక పొందరాదు, నా
అనుజుని గూల్చినట్టి దనుజాధము నేన వధింతు గాని, ఏ
అనువున నాకు శక్యమగు? ఆయతపక్షవిహీను డన్ గదా! 266

గీ. సాగరమె గాదు సంసారసాగరమ్మె
మహిత శ్రీరామనామ సంస్మరణ మహిమ
దాటవచ్చును - అతని దాసులైన
వారు మీ కెన్న ఈ యల్పవార్ధి యెంత? 267

గీ. శ్రీరఘూద్వహు బంటులు మీరు గాదె
సంద్ర మిది యెంత మీకు గోష్పదమగును
అమ్మహాత్ముని చరిత విన్నంత నాకు
గఱులు మొలకెత్తె నిదియ సాక్ష్యమ్ము గాదె! 268

గీ. ఆ జటాయువునకు నివాపాంజలిత్తు
తీసికొని పొందు నను వార్ధితీరమునకు
అనిన గొనిపోవ సంపాతి నంగదుండు
సాశ్రులోచనుడై నివాపాంజలిచ్చి 269

గీ. వాయుజాంగద జాంబవత్ ప్రముఖులైన
సర్వహరులకు సప్రేమ స్వస్తి పలికి
అరిగె సంపాతి తా మహేంద్రాద్రి గుహకు
జానకిం గాంచ నూతనోత్సాహశక్తి
అంగదాదులు ఆనందమందినారు 270

## సముద్ర తరణమ్మునకు అంగదాదులు మంతనము గావించుట

ఉ. నింగికి దాటు నా ఝష వినీలతిమింగిలనక్రభీమమై
తుంగతరంగమాలికల ద్రుళ్లుచు పొంగెడు వార్ధి గాంచి, ఆ
అంగదజాంబవత్పవనజాదులు మంత్రణ సేయసాగి రె
ట్లింగిని దీని దాటగలవార మటంచు తదేకదీక్షమై. 271

గీ. వార్ధి తరియింప నిందు సమర్థుఁ డెవఁడొ
అతఁడ మనలోన రాజమర్యాదలందు
రామునకు మాకు నాతండ ప్రాణదాత
అతడె మాకెల్ల సర్వ నియంత యనిన. 272

గీ. ఒక్కరొక్కరి మొగముల నొకరు గనుచు
మౌనమును దాల్చి మరి మారుమాట లేక
అవనతాననులై యున్న- అంగదుండు
వారికిన్గల శక్తిజవంబు లడుగ. 273

క. పది యామడ లాదిగ తొం
బది యామడ లెగురు శక్తి ప్రకటింపఁగ నం
గదుఁ డంతటఁ బల్కెను నే
చదలన్ శతయోజనములు సనగలనైనన్. 274

ఆ. మరల తిరిగి వచ్చు మాట చెప్పఁగఁజాల
ననిన జాంబవంతుఁ డనియె నిట్లు
శక్తియున్న నిన్ను శాసింపఁ దగదేము
నీవు నేతవౌట పోవఁ దగదు. 275

## జాంబవంతుఁడు హనుమంతు నగ్గించుట

ఉ. పుట్టిననాడె నీవు బుభుక్షను సభ్యుదితుండు నౌచు ఓన్
పట్టునఁ దోచు రక్తమయభానుని పక్వఫలం బటంచు వే
బట్టగ నెంచి మింటికి జవంబున రాఘవు శాతసాయకం
బట్టులు నీవు యోజనసహస్రము పోవవె నాడు పావనీ! 276

క. అట్టిడు వాఁడవు నీ విపు
డిట్టులు మౌనమ్ము నూని ఏమియు గన పీ
పట్టున నీ శక్తిని జూ
పెట్టుము నీ కీర్తి నిలువఁబెట్టుము జగతిన్. 277

క. అనినంతనె హనుమ్మని ఆ
హనుమంతుఁడు మేను పెంచి అంబుధి గడతున్
జనకజఁ గొనితెచ్చెద, రా
వణుఁ జంపెద లంక కాల్చివచ్చెద ననినన్. 278

క. కని హనుమను ఋక్షేశుఁడు
హనుమా! నీ వంతవాడ వగుదువె యైనన్
జనకజ గని రమ్మా రా
ముని యాజ్ఞను మీర మనకుఁ బోలునె గనుమా! 279

గీ. అనిన ఆ ఋక్షనాథుని హనుమ గాంచి
నీవు చెప్పిన దదియెల్ల నిజము గాన
జనకజాతను గని వత్తు ననుచుఁ బలికి
అమ్మహేంద్రాద్రి నధిరోహణమ్ము చేసె
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 280

గీ. నీవు— కిష్కింధలో నుండ నీరజాక్ష
పవనతనయాది త్వత్పాదభక్తులందు
నేను నొకరుండనై యుండి నిండుభక్తి
రామ! నీ దివ్యచరిత సర్వంబు గంటి
రమ్యగుణసాంద్ర! శ్రీరఘురామచంద్ర! 281

ఉత్సాహము—

కామకోటిసుందరాంగ! కంబురమ్యకంధరా
కామితార్థదానదక్ష! కల్పవృక్షమందిరా!
శ్యామలాంగ! కోమలాంగ! సద్గుణైకసుందరా!
రామచంద్ర! కీర్తిసాంద్ర! రాక్షసాబ్ధిమందరా!

కాండాంతగద్యము

ఇది శ్రీమదాకుండ్యన్వయపవిత్ర, ఆత్రేయసగోత్ర మహాకవివేంకటకవి
ప్రపౌత్ర, జగన్నాథశాస్త్రిపౌత్ర ఉద్దండపండితగోపాలశాస్త్రి
పుత్ర, విద్వజ్జనవిధేయ ఉభయభాషాప్రవీణ –
సూర్యనారాయణశాస్త్రినామధేయ ప్రణీ
తంబయిన ప్రత్యక్షరామాయణ
మహాకావ్యంబున కిష్కింధా
కాండము సర్వము
సమాప్తము

ఓం తత్ సత్

శ్రీరామచంద్రార్పణమస్తు

—o—

# ప్రత్యక్ష రామాయణము-తప్పొప్పుల పట్టిక

## బాలకాండము

| పుట | పద్యము | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 15 | 38 | 6 | దంపతులకు | జంపతులకు |
| 20 | 54 | 1 | మందమయ్యె | మందమ్మయ్యె |
| 27 | 77 | 3 | దాయకముల్ | దాయకమున్ |
| 34 | 95 | 4 | దక్షురై | దక్షులై |
| 35 | 96 | 8 | గురిపి | గురిసి |
| 38 | 112 | 4 | తద్దర్శ | త్వద్దర్శ |
| 47 | 156 | 1 | ధనుఁడు | ధనుఁడ! |
| 60 | 198 | 4 | సుండి | వినుడి |
| 65 | 216 | 3 | డిగి | డిగి |

## అయోధ్యా కాండము

| పుట | పద్యము | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 70 | 10 | 5 | ధాన్యసంతతి | ధాన్యరత్నసంతతి |
| 72 | 16 | 3 | యువరాజు | యువరాజ |
| 81 | 48 | 4 | రావోయి దే | రావోయి! నే |
| 82 | 51 | 5 | సాధ్యమ్మగునే? | సాధ్యమ్మెగనుమ? |
| ,, | 53 | 2 | ఖడ | ఖడ్గ |
| ,, | 53 | 4 | కంవాల | కరవాల |
| ,, | 54 | 3 | దలప | దలఁతె |
| 83 | 55 | 1 | పితరుకంటె | పితరులకంటె |
| 84 | 59 | 3 | విరుబోణు | విరిబోణు |
| 90 | 81 | 1 | పడి | నయొ |
| 94 | 94 | 3 | స్నిగ్ధవేశ | స్నిగ్ధకేశ |
| 99 | 106 | 10 | లిచ్చి | లనువిచ్చి |

| | | | | |
|---|---|---|---|---|
| 101 | 109 | 1 | నవిత | సవిత |
| ,, | ,, | 7 | చెత | చెంత |
| ,, | ,, | ,, | నిశ్చిత | నిశ్చింత |
| 103 | పద్యసంఖ్య | | 114 | 115 |
| | ,, | | 115 | 114 |
| 106 | 131 | 4 | క్రందుసెడెర్ | క్రందుసెడెన్ |
| 117 | 185 | 2 | జూడనెచి | జూడనెంచి |
| 118 | 190 | 1 | గీ. | ఆ॥ |
| 122 | 212 | 2 | వటటపం | వటవిటపం |
| 124 | 221 | 2 | వరవశ | పరవశ |
| 126 | 230 | 4 | నయశ్రీ | వినయశ్రీ |
| ,, | 232 | 4 | గుణభవ | గుణభవ్య |
| 128 | 242 | 2 | సీసుకిటు | సీమకిట్లు |
| 131 | 258 | 3 | వనిక | వనికా |
| 132 | 261 | 2 | భ్రాతృ | ఛాత్ర |

## అరణ్య కాండము

| | | | | |
|---|---|---|---|---|
| 139 | 6 | 2 | విలు | విల్లు |
| 140 | 11 | 4 | దట్టపు | దట్టంపు |
| 141 | 12 | 1 | తరు | తరులు |
| ,, | 14 | 4 | అల్లల్లన | అల్లనల్లన |
| ,, | ,, | ,, | గొనుచుదు | గొనుచుందు |
| 143 | 23 | 1 | లొక్కముద్ద | లొక్కటముద్ద |
| 145 | 34 | 3 | కరుణస | కరుణరస |
| 152 | 71 | 1 | వీర్ష్య | నీర్ష్య |
| 156 | 90 | 7 | బాఋ | జాఋ |
| ,, | ,, | 8 | నిర్ఘరీ | నిర్ఝరిణీ |
| 159 | 96 | 1 | కాతర | కాదర |

| | | | | |
|---|---|---|---|---|
| 161 | 100 | 4 | కాంతి | కాంత |
| 163 | 111 | 4 | బామను | రామను |
| 167 | 129 | 3 | సాటిగాగా | సాటిగా రారా |
| ,, | 130 | 4 | ముష్కరుడు | ముష్కరుండు |
| ,, | 133 | 4 | చెపు | చెపుమ |
| 173 | 161 | 3 | మాపోయె | మారిపోయె |
| 177 | 179 | 2 | లక్ష్మణా | లక్ష్మణ! |
| 181 | 193 | 2 | వినులే | వినునే |
| 185 | 212 | 1 | చెలిని | చెవిని |
| ,, | 214 | 4 | గొండు | గొంతు |
| 187 | 221 | 4 | ఇంతి | ఇంతి! |
| 189 | 231 | 2 | సిరము | సిడము |
| 200 | 284 | 7 | రాజ | రాజ్య |
| ,, | ,, | ,, | యుండు | యుండె |

## కిష్కింధా కాండము

| | | | | |
|---|---|---|---|---|
| 207 | 19 | 1 | తమ్మునితో | తమ్ముతో |
| ,, | ,, | 5 | నుంటిని | నుంటిమి |
| 227 | 118 | 4 | అవనిజూ | అవనిజా |
| 235 | 152 | 3 | నెపుడు | నెప్పుడు |
| ,, | ,, | ,, | శ్రాంతి | విశ్రాంతి |
| 246 | 204 | 4 | యూధనాధుల | యూథనాథుల |
| 250 | 223 | 9 | నిరతి | నిరతిని |
| 254 | 241 | 4 | నాధులు | నాథులు |
| 257 | 257 | 3 | నూర | సూర |
| 259 | 265 | 1 | వచియిచె | వచియిచె |
| 261 | 276 | 1 | నీవు | నీవహో? |

—: 0 :—